


佛

# బుద్ధదేవుని కథ











డా॥ జి.వి. పూర్ణచంద్










SB SURYA BOOKS

Surya's

# బుద్ధదేవుని కథ











డా॥ జి.వి. పూర్ణచంద్

Surya BOOKS

SURYA'S

# బుద్ధదేవుని కథ



1st Edition : 2006
2nd Edition : Dec. 2007
3rd Edition : Nov. 2009

Price : **Rs. 30-00**

**సోల్ డిస్ట్రిబ్యూటర్స్**

**శ్రీ వెంకటేశ్వర బుక్ డిపో**
సింగరాజువారి వీధి, కొత్తపేట,
**విజయవాడ - 520 001.**
ఫోన్ : (0866) 6663733, 2565038.

---

**శ్రీ వెంకటేశ్వర బుక్ డిపో**
ప్లాట్ నెం. 3, 103, 2-4-1085,
సాయిలక్ష్మీ నికేతన్, రామకృష్ణా హాస్టల్ ఎదురు వీధి,
కాచిగూడ కుమార్ థియేటర్ దగ్గర,
నింబోలి అడ్డ, హైదరాబాద్ - **500 027.**
ఫోన్ : (040) 65528228, 24745257
సెల్ : 9346771314.

---

Published by : **Victory Publishers,** Regd. Office : # 11-16-32 (A)
Singarajuvari Veedhi Kothapeta. **VIJAYAWADA - 1** ✆ 666372?



సిద్ధార్థ యువరాజు

# వ్యక్తి పరివర్తన కోసమే బుద్ధదేవుని కథ......

తెలుగువారందరిలోనూ ఒకేసారి పరివర్తన కలిగి బౌద్ధులుగా మారిపోయినా, బ్రాహ్మణ బౌద్ధులు, కమ్మ బౌద్ధులు, రెడ్డి బౌద్ధులుగానే ఆలోచిస్తూ వుంటారు! దళిత బౌద్ధులు తిరిగి చివరి పీటీనే నిలబడి మేథావుల పెదవి సానుభూతిని మాత్రం పొందుతూ వుంటారు అంతే !! సామాజిక సమానత్వం మనదేశంలో అసాధ్యమే అన్నంతగా వ్రేళ్ళూనుకొంది. భారతీయులమైనందుకు మనం గర్వించదగిందేమీ ఇందులో లేదు.

కులవ్యవస్థ మీద పోరాడిన బౌద్ధం గురించి, తెలుగు వారితో దాని అనుబంధం గురించిన విశేషాలు మనలో ఆలోచనల్ని ప్రేరేపించేవిగా వుంటాయి. ఈ వ్యవస్థనంతా మార్చి కులాల విషవృక్షాన్ని కూలగొట్టడం సాధ్యం కాదని 2600 సంవత్సరాలుగా సాగిన చరిత్ర సాక్ష్యం ఇస్తోంది. ఇప్పుడు కావలసింది వ్యక్తిలో పరివర్తనే! బుద్ధదేవుని కథలు ఈ పరివర్తన దిశగా కొన్ని ఆలోచనల్ని తప్పకుండా కల్గిస్తాయి.

తెలుగువారైన బౌద్ధులకు సంబంధించిన వివరాలకు కేవలం బౌద్ధ గ్రంథాలే ఆధారం. "భక్తి" వున్నచోట చరిత్ర అతిశయోక్తులకు లోనవటం సహజం. ఈ అతిశయోక్తుల్లోంచే మనం మన ప్రాచీన చరిత్రను అన్వేషించుకోవాల్సి వస్తుంది.

బుద్ధుడు ఏ కాలం నాటివాడు? బుద్ధుడి జీవిత కాలంలో వింధ్యను దాటి బౌద్ధం విస్తరించిందా? బుద్ధుడు నిజంగానే అమరావతి వచ్చాడా? బుద్ధుడు వచ్చినట్లు చెబుతున్న ధనకటకం అమరావతేనా? ఇవన్నీ సమాధానం దొరకని ప్రశ్నలు.

బుద్ధుడు సింహళానికి మూడు సార్లు వెళ్ళినట్లు మహావంశలో చెప్పిన ఆధారాలు నిజమే అయితే, సముద్ర మార్గాన వెళ్ళినా, భూమార్గాన వెళ్ళినా దారిలో తెలుగు ప్రాంతాన్ని సందర్శించే వుంటాడని ఊహించవచ్చు.

ఇవన్నీ ఊహలే!..... అవునన్న వారివీ - కాదన్న వారివి కూడా ఊహలే!! తమ నమ్మకాల మీద ఆమాత్రం నమ్మకం వుండాలి కాబట్టి కొందరు చరిత్రకారులు "ఇదే వాస్తవం" అన్నట్లు రాస్తుంటారు. కానీ, రకరకాల ఊహల్లో అదికూడా ఒకటి!

గోదావరి అనగానే కోస్తా జిల్లాలవారు రాజమండ్రినీ, తెలంగాణా వారు కోటిలింగాలనూ ఊహించుకొంటారు. ఆ నది మహారాష్ట్రలో పుట్టి, కొంత మేర

అక్కడ కూడా ప్రవహిస్తున్న సంగతి వీరి ఊహల్లోకి రాదు. నదులపేర్లు, ఊళ్లపేర్లు, వ్యక్తుల పేర్లు కూడా ఒక ప్రాంతానివి ఇంకో ప్రాంతంలో కూడా కన్పిస్తూ వుంటాయి. గంగానది పాయని గోదావరి అంటారని, బావరి అనే బ్రాహ్మణవాది కథ వారణాసి దగ్గరే జరిగివుంటుందని మనం ఊహిస్తున్నట్టు రాజమండ్రి దగ్గర కాకపోవచ్చని ఒక వాదన వినిపిస్తుంది.

ఆధారాల్ని ఊహల్ని కలగలిపితేనే చరిత్ర తయారౌతుంది. కొన్నిసార్లు ఆధారాలు, కొన్నిసార్లు ఊహలూ ప్రశ్నించబడతాయి. అప్పుడే చరిత్ర కొత్త మలుపులు తిరుగుతుంది.

ఇక్కడ చరిత్రను పరిశీలించే దృష్టి కోణమే ముఖ్యం. మనం చరిత్రని అధ్యయనం చెయ్యడానికి ఒక "లక్ష్యం" పెట్టుకోవాలి. ఆ "దృష్టి"తోనే చారిత్రక విషయాల్ని పరిశీలించాలి.

తెలుగు వాళ్లమో, ఆంధ్రులమో ఇంకా తేలని స్థితిలో వున్న మనం బుద్ధుడి కాలంనాటి తెలుగు ప్రజలగురించి సాధికారికంగా తేల్చగలిగేది చాలా స్వల్పంగా వుంటుంది. అందుకని - తెలుగు సమాజం మీద బౌద్ధం కల్గించిన ప్రభావాన్ని మాత్రమే అధ్యయనం చెయ్యడానికి "బుద్ధ దేవుని కథ"లో ప్రయత్నించాను.

ఈ సమాజాన్ని "వర్ణాలు"గా లేదా "కులాలు"గా విభజించి పాలిస్తున్న కుసంస్కృతి మీద బౌద్ధధర్మాల పోరాటం, వాటి విజయాలు, వాటి వైఫల్యాల్ని కొంతమేర వివరించే ప్రయత్నం చేశాను.

కులతత్వాన్ని రోజురోజుకూ పెంచి పోషిస్తున్న వ్యవస్థలో జీవిస్తున్న మనం - ఒక్కసారి బుద్ధదేవుడి గురించి, ఆయన బోధనల గురించి దృష్టి సారించవలసిన అవసరం వుంది. ఈ "బుద్ధదేవుని కథ" పరివర్తన దిశగా ఒక కొత్త ఆలోచనని కల్గించగలిగితే చరిత్ర అధ్యయనపరుడిగా ధన్యత నొందినట్లు భావిస్తాను.

- డా॥ జి.వి. పూర్ణచంద్

**"ఆంధ్రత్వమ్ ఆంధ్రభాషాచ**
**ప్రభాకర పరిశ్రమాః**
**తత్రాపి యజుషిశాఖా నల్పశ్య**
**తపశాః ఫలం"**

*- అప్పయ్య దీక్షితులు 16వ శతాబ్ది*



# విషయసూచిక




బుద్ధదేవుని కథ .................................... 7
బుద్ధుని జన్మస్థలం.................................... 8
బుద్ధుని వైవాహిక జీవితం ......................... 9
36వ ఏట బుద్ధుడయ్యాడు ...................... 10
గురువుకోసం అన్వేషణ ............................ 10
బుద్ధుడు మొదట జైనుడయ్యాడు ................ 10
ఐదుగురు సహచరులు.............................. 11
సాంఖ్య మరియు యోగశాస్త్రాల అధ్యయనం ... 12
జైనం నుంచి దూరంగా.......................... 12
మొదటి శిష్యులు ................................. 12
మొదటి ఉపన్యాసం .............................. 13
కాశీలో మొట్టమొదటి బౌద్ధ సంఘం ........... 14
వందల సంఖ్యలో శిష్యగణం .................... 16
ముఖ్య శిష్యులు సారిపుత్రుడు, మొగ్గల్లానుడు ... 16
బౌద్ధసంఘంగా మారిన కపిలవస్తు ............. 17
రాహులుని బౌద్ధ స్వీకారం......................... 17
బేతవనం కథ........................................ 17
భిక్షుకిగా మారిన ధనిక స్త్రీ విశాఖ ............... 18
బాబూ! నీ తల్లిని! నన్నూ చేర్చుకోవూ... ??? .. 19
బౌద్ధుడుగా మారిన బందిపోటు "అంగులీమాల" 20
బుద్ధుని వ్యక్తిగత సహాయకుడు ఆనందుడు ..... 20
అజాతశత్రుని కోటకు శంఖుస్థాపన............. 21
బుద్ధుడి జీవితంలో విలన్ - దేవదత్తుడు ........ 22
బుద్ధుని విజయాలు................................ 23
బుద్ధుడి నుంచి దీక్ష స్వీకరించిన ఇతర గురువులు ..... 23
మరణించాక బుద్ధుడు ఏమౌతాడు ? ........... 24
బుద్ధుని నిర్వాణం.................................. 25
క్రీ.పూ. 6వ శతాబ్దిలో తాత్త్విక ప్రపంచ విప్లవం ...27
బౌద్ధాన్ని రూపొందించిన సామాజిక పరిస్థితులు...28
వ్రేళ్ళూనుకున్న కులవ్యవస్థ....................... 30
ధర్మం శరణం గచ్ఛామి ........................... 31
బుద్ధుడు సూచించిన దుఃఖ నివారణ మార్గాలు ... 32
మూడు శరణాలు................................... 33
భౌతికవాదం పునాదులమీద బౌద్ధం ............ 34
బౌద్ధుల స్వర్గలోకం సుఖవతి .................. 35
బౌద్ధులకూ నరకలోకం వుంది .................. 35
తొలి బౌద్ధ గ్రంథాలు.............................. 36
బౌద్ధ త్రిపిటకాలు................................... 36
పొగడ్తలొద్దు ........................................ 37
సంఘాలకు నియమాలు - వాచి ఆచరణ ...... 37
పార్లమెంటరీ విధానం ............................. 38
బౌద్ధ సంఘాలలో ప్రోటోకాల్ ..................... 39
సభాధ్యక్షుణ్ణి వినయధరుడంటారు ............. 40
కోరమ్ నిండిన సభ - సమగ్ర..................... 40
నిర్ణయాలు తీసుకునే విధానం..................... 41
ఎజెండా రచన...................................... 42
మినిట్స్ రికార్డు చెయ్యడం ........................ 42
విధిగా హాజరు కావాలని విప్..................... 42
తీర్మానాల్ని ప్రవేశపెట్టే విధానం .................. 43
తీర్మానానికి సభ ఆమోదం......................... 44
వ్యతిరేకత తెలిపే విధానం.......................... 45
సమన్వయ సంఘం ................................ 45
ఓటింగ్............................................. 46
మొదటి సంగీతి .................................. 47
చీలికలకు దారితీసిన భేదాభిప్రాయాలు... ఇవి ! ... 48
రెండవ సంగీతి .................................. 49
మౌలికమైన విభేదాలు ఇవీ... .................. 49
మహాదేవుని సవరణలు .......................... 51

అశోకుడు ప్రచారం చేసిన మహాసాంఘికం .... 52
మహాసాంఘిక బౌద్ధం ............................ 52
వ్యక్తిగత విభేదాలే సైద్ధాంతిక విభేదాలైనాయి ....... 54
నాలుగో సంగీతి ..................................... 54
బౌద్ధం ఇలా పతనం అయ్యింది... ! ............ 55
గ్రీకు బౌద్ధులు ........................................ 57
బౌద్ధాన్ని పరిరక్షించడానికి గ్రీకుల దాడి ......... 58
రోమ్‌లో ఆత్మాహుతి చేసుకున్న భారతీయ బౌద్ధుడు !...58
గ్రీకు భాషలో బౌట్టా అంటే బౌద్ధ ! ............ 59
తెలుగునేలపై విదేశీ యాత్రికులు ............... 59
బెజవాడలో హ్యూన్‌త్సాంగ్ ........................ 60
బౌద్ధాన్ని ఆకర్షించిన తెలుగునేల ................ 62
బౌద్ధ గ్రంథాలు చెప్పిన అంధపురం .............. 65
బుద్ధుడికి గొడుగుపట్టిన ఆంధ్రుడు ............... 66
తెలుగువారి ఏడుతలల పాము విగ్రహాలు ....... 67
సింహళానికి బుద్ధుడు మూడుసార్లు వెళ్ళాడు.... 68
విశ్వామిత్రుని సంతతి "ఆంధ్రులు" ఎవరు ? ... 68
మహాసాలిపట్నమే మచిలీపట్నమా...? ........... 70
మహానావికుడు శివకుడు .......................... 71
అశోకుడిమీద తెలుగువారి ప్రభావం ............ 72
తెలుగునేలమీద బౌద్ధాన్ని వ్యాపింపచేసిన
మహాదేవుడు ........................................ 73
సింహళంలో బౌద్ధాంధ్రులు ........................ 74
శ్రీలంకలో తెలుగు శిల్పకళ ........................ 76
రావణుడు బౌద్ధుడా ? ............................ 76
బుద్ధుడికాలం నాటి ఆంధ్ర రాజధాని నగరం
భట్టిప్రోలు ........................................... 77
బౌద్ధాన్ని ఆదరించిన తెలుగు రాజులు శాతవాహనులు..81
క్రీస్తుపూర్వం నాటికే "తెలుగు" వినియోగం ..... 84
తెలింగ-కళింగ ....................................... 85
శాతవాహనులకు అమరావతి వాణిజ్య రాజధాని ... 86
రెండువేల ఏళ్ళనాటి ఓ బ్యాంకు కథ ............ 87
అమరావతి కేంద్రంగా మహా సాంఘిక బౌద్ధం ..... 88
విరాళాలు పోగేసి స్తూపాలు నిర్మించారు......... 88
అమరావతి విశేషాలు ............................ 89
అమరావతి స్తూపంలో తెలుగుదనం ............. 91
బౌద్ధాన్ని విస్తరింపచేసిన ఇక్ష్వాకులు ........... 92
ఆంధ్రప్రదేశ్‌లో బౌద్ధస్థూపాలు...................... 93
బౌద్ధ విజ్ఞాన కేంద్రం నాగార్జునకొండ ........... 95
గుంటుపల్లి .......................................... 96
శాలిహుండం ........................................ 96
బొజ్జనకొండ - లింగాలకొండ ..................... 97
అమరావతి బౌద్ధస్తూపం ఊహాచిత్రం ............ 97
అమరావతిలో జైనం ................................ 98
సిద్ధనాగార్జునుడి చరిత్ర ........................... 99
స్తూపాన్ని తవ్వించిన వెంకటాద్రినాయుడు...... 101
శిల్పాలదొంగలు బ్రిటిషర్లే !............................102
ప్రాతఃస్మరణీయుడు రాబర్ట్‌స్యూయల్ ........... 103
బర్గీస్ 1882 రిపోర్ట్ ................................. 104
బౌద్ధాలయాలు ధ్వంసం చేసిన విష్ణుకుండినులు 105
శైవుల అమరావతి దురాక్రమణ..................... 106
నాగార్జునకొండ బ్రాహ్మణుల ఆక్రమణ ........... 106
బౌద్ధుల తలకు వెల ................................. 108
బౌద్ధయుగంలో తెలుగువారి చదువులు .......... 108
తెలుగు విశ్వవిద్యాలయాలు......................... 109
ఘటికా స్థానాలు ..................................... 109
తెలుగు బౌద్ధుల ఆచారాలు ....................... 110
తెలుగు నేల మీద తాంత్రిక బౌద్ధం ............. 111
తాంత్రిక బౌద్ధం ఆశించిన ప్రయోజనం ........ 113
విగ్రహారాధన - తీర్థయాత్రలు బౌద్ధులవే !..... 113
వాసుదేవ కృష్ణుడు - భగవద్గీత .................. 114
విష్ణుమూర్తి బుద్ధుడి అవతారం ఎందుకెత్తాడు ?116
శివపురాణం ప్రకారం మరోకథ...................... 116
అమరావతి శివాలయం బౌద్ధారామం కాదు ... 118
చాళుక్య భీముడి అమరేశ్వరాలయం డిజైన్ .... 121
అమరవటేశ్వరం అంటే ఏది ? ................... 123
తొలినాటి శివలింగాలకు పానవట్టం లేదు ..... 124
వైదిక దేవాలయాలుగా మారిన బౌద్ధాలయాలు 124
బౌద్ధం ప్రజలమతం ................................ 125
అస్పృశ్యులుగా మిగిలిన బౌద్ధులు................ 126



# బుద్ధదేవుని కథ

భారతీయ సమాజంలో పెట్టుబడిదారీ వాణిజ్య వ్యవస్థ నడుస్తున్న కాలం....

అభిజాత్యపు లక్షణాలున్న రాజులే పాలకులుగా వున్న రిపబ్లిక్ తరహా ప్రజా స్వామ్యం నడుస్తోన్న సమయం....

వైదిక సంస్కృతి వ్యాప్తిలో వున్న ఆర్యావర్తానికి ఆవల ఉన్న ప్రదేశం.... కాబట్టి వైదిక ఆచారాలు కొన్ని, అవైదికం కొన్ని కలగలిపిన సామాజిక జీవనం.....

హిమాలయం రాజ్యం.....నగరం కపిలవస్తు.... పాలకులు శాక్య కుటుంబీకులు .... క్షత్రియులు...! కొందరు సూర్యవంశీకులనీ, కొందరు చంద్రవంశీకులనీ అంటారు. కోసలదేశం, సాకేత నగరం నుంచి వచ్చిన సూర్యవంశ క్షత్రియులుగానే ఎక్కువమంది ఈ శాక్య కుటుంబీకుల్ని భావిస్తారు.

ప్రజలు "కోక" లేదా "ముండా" జాతి వారు కావచ్చని పరిశోధకులంటారు. "సవర", "ముండా" జాతి ప్రజలు శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల్లో నేటికీ వున్నారు. బహుశా, ఈ జాతీయులు కపిలవస్తు నుంచి ఉత్తరాంధ్ర వరకు వ్యాపించి వుండవచ్చు. లేదా వలస వచ్చి ఉండవచ్చు.

శాక్యరాజ వంశీకులు గౌతమస గోత్రికులు.

తమ గోత్రంలోని పిల్లల్ని పెళ్ళి చేసుకునే అలవాటు ఈ గోత్రికులకు వుండేదట. అది ఆర్య ధర్మ విరుద్ధమైనప్పటికీ, ఆర్య రుషి గోత్రికులైన వీరు ఆర్యావర్తానికి వెలుపల వుండడాన ఈ అనార్య ఆచారం అలవడి వుంటుందని పరిశోధకుల భావన.



బుద్ధుని జననం-ప్రసవ సమయంలో లుంబినీ వనంలో ఒక చెట్టు ఆసరాగా నిలబడిన మాయాదేవి

సింహళంలోని బౌద్ధగ్రంథాల్ని బట్టి, ఇద్దరు శాక్యరాజులు, జయశేనుడు, దేవ రాహుడు ఒకే గౌతమ గోత్రికులు. వీరిద్దరూ ఇదే విధంగా కుండమార్పిడి సంబంధాన్ని చేసుకున్నారు. వీరి అబ్బాయిని వారి అమ్మాయికి, వారి అబ్బాయిని వీరి అమ్మాయికి చేసుకున్నారు. వారి పిల్లల సంతతికూడా తిరిగి అలానే కుండమార్పిళ్ళు చేసుకున్నారు.

ఆ విధంగా జయశేనుడి మనుమడు శుద్ధోధనుడు, దేవరాహుడి మనుమరాళ్ళు మాయాదేవి, ప్రజాపతి - ఇద్దర్నీ పెళ్ళిచేసుకున్నాడు.

మాయాదేవికి సిద్ధార్థుడు కలిగాడు.

ప్రజాపతిదేవికి "నందుడు" పుట్టాడు.

సిద్ధార్థుడు పుట్టిన ఏడవ రోజున మహామాయా దేవి మరణించింది. సవతితల్లి ప్రజాపతి దేవి ఆదరణ లోనే సిద్ధార్థుడు పెరిగాడు. ఆమె స్వయంగా పాలిచ్చి పెంచింది.

## బుద్ధుని జన్మస్థలం



లుంబినిలో "ఇదిగో ఇక్కడే బుద్ధుడు పుట్టాడు" "హిద బుద్ధే జాతె శాక్య మునితి" అని రాసి, అక్కడ ఒక పెద్ద స్తంభాన్ని నెలకొల్పాడు అశోకుడు.

తల్లిలేని బిడ్డడు కావడంతో సిద్ధార్థుని బాల్యం అమిత గారాబంగానే సాగింది. భోగ లాలసలోనే గడిచింది.

108 మంది బ్రహ్మణులు ఈయనకు సిద్ధార్థుడని నామకరణం చేసి, ఈయన సార్థక నామధేయుడౌతాడని ఆశీర్వదించారు. మహా ప్రవక్త అవుతాడని జ్యోతిష్యులు నివేదించారట రాజుకి!

# బుద్ధుని వైవాహిక జీవితం

సిద్ధార్థుని 16వ ఏట ఆయనకు వివాహం జరిగింది. ఆయన భార్యపేరు "భద్ద కచ్చ" అని "బుద్ధవంశం" గ్రంథంలో వుంది. "బింబ" అని జాతక కథలలో కన్పిస్తుంది. "గోప" అని లలితవిస్తరం పేర్కొంది. "యశోధర" అని ఉత్తర భారత దేశపు బౌద్ధగ్రంథాలు చెప్తున్నాయి.

యశోధరతో సిద్ధార్థుడు 12 ఏళ్ళపాటు వైవాహిక జీవితాన్ని అనుభవించాడు. క్రమేణా ఆయనలో కొన్ని పరివర్తనలు రాసాగాయి.

ఆ దశలోనే సిద్ధార్థుని 29వ ఏట ఆయనకు రాహులుడు జన్మించాడు. "ఒక బంధం పుట్టింది...." అన్పించిందట ఆ క్షణాన బుద్ధునికి!

ఆ రాత్రే బుద్ధుడు ఇల్లు విడిచి వచ్చేశాడు. రాజకీయమైన కొన్ని కారణాలవలన తనకు తానే రాజ్య బహిష్కరణను ప్రతిపాదించుకొని నగరం విడిచి వెళ్ళిపోయాడని ఒక ఐతిహ్యం వుంది.

ఆధ్యాత్మిక ప్రయోజనం అయితేనేమి.... సామాజిక ప్రయోజనం అయితేనేమి.... రాజకీయ ప్రయోజనం అయితేనేమి... బుద్ధుడు కపిలవస్తునీ, భార్యనీ, చంటి బిడ్డడినీ వదిలి వెళ్ళిపోయాడు.

ఆయన గుర్రంపేరు కంటక. గుర్రపు బండి పేరు ఛన్న. బండివాడి పేరు ఛండకుడు.

దేశ సరిహద్దులు దాటి అరోమా నది అవతల బండిని ఆపుచేయించాడు సిద్ధార్థుడు.

ఛండకుడికి తన నగలు, వస్త్రాలు వలిచి ఇచ్చేశాడు సిద్ధార్థుడు. గిరిజాలు వంకీల రాజదర్పానికి సంకేతంగా వుండే అందమైన తన జుత్తుని తనే స్వయంగా కత్తిరించివేశాడు. పసుపు రంగు గుడ్డలు కట్టుకున్నాడు.... వీటిని తీసుకొని ఛండుడిని కపిలవస్తు వెళ్ళిపోవలసిందిగా చెప్పాడు.

అక్కడినుంచి ఒంటరిగా నడుచుకుంటూ ఎటో వెళ్ళిపోయాడు.... అని "లలిత విస్తరం" గ్రంథంలో ఈ కథ వివరంగా వుంది.

## 36వ ఏట బుద్ధుడయ్యాడు



సిద్ధార్థుడు సాధకుడై జ్ఞాన సిద్ధిని పొంది తన 36వ ఏట బుద్ధుడయ్యాడు. అంత చిన్న వయస్సులో ఆయన పొందగలిగిన జ్ఞానం ఏముంటుందనే ప్రశ్న సహజంగా కలుగుతుంది.

కానీ, ఏసుక్రీస్తు, మహావీరుడు, బుద్ధుడు, ఆదిశంకరుడు, రామానుజుడు, వివేకానందు .... వీరంతా సుమారుగా తమ 36వ ఏటనే జ్ఞాన సిద్ధిని పొందిన వైనాన్ని మనం అర్థం చేసుకోవాలి. వ్యక్తి జీవితంలో "పరిపక్వత"కు ఈ వయస్సు చాలా కీలకమైనదనే చెప్పాలి.

గౌతమ సిద్ధార్థుడు బుద్ధుడైన తీరు ముఖ్యంగా అధ్యయనం చేయవలసిన ఘట్టం. ఒక క్షత్రియుడు గురువు స్థానాన్ని పొందడానికి ఆనాటి సామాజిక పరిస్థితుల రీత్యా ఎంత ప్రయాస పడవలసి వుంటుందో కూడా మనం ప్రత్యేకంగా పరిశీలించవలసి వుంటుంది.

## గురువు కోసం అన్వేషణ



బుద్ధుడు తగిన గురువుకోసం వెదకసాగాడు. గురువు లేని విద్య గుడ్డివాడి నడకేనని ఉపనిషత్తులు చెప్పిన సంగతి ఆయనకు తెలుసు.

ఆలారకాలాముడనే ఋషిని మొదట ఆశ్రయించాడు. ధ్యాన నిష్టలో కూర్చుంటే, ఎంత రణగొణధ్వనులు కూడా ఆయన ఏకాగ్రతని చెరుపలేవని ఆయనకు పేరు. రెండో గురువు ఉద్రక రామపుత్రుడు. వీరి దగ్గర నేర్చుకున్న విద్య ఆయనకు సంతృప్తి కల్గించలేదు.

## బుద్ధుడు మొదట జైనుడయ్యాడు

అక్కడినుంచి మగధ సామ్రాజ్యంలో ఒక నదీతీరంలో జైన శ్రమణకులతో పరిచయం కల్గింది. శరీరాన్ని శుష్కింపచేసుకొని, మాంసాహారం మానేస్తే, అత్యున్నత



జ్ఞానం కల్గుతుందని నమ్మి, జైన విధానంలో ఉపవాసదీక్ష చేశాడు. నాలికని అంగిటికి ఆనించి పెట్టి గుటక వెయ్యకుండా దీక్షలో కూర్చున్నాడు. శరీరం అస్థిపంజరంలా తయారయ్యింది. నీరసించి కృశించి పోయాడు. కానీ, అదనంగా కలిగిన జ్ఞానం ఏదీ కన్పించలేదు.

బుద్ధుడు జైనుడిగా వున్నకాలంలో ఆయన పేరు "ముని బుద్ధకీర్తి." శ్రీపార్శ్వనాథుడు తీర్థంకరుడిగా వున్నకాలం కావచ్చు. పిహితస్రావుడనే గురువు ఈ విధంగా బుద్ధుడిచేత ఉపవాసదీక్ష చేయించాడు. సరయూనదీ తీరంలో "పలాశ"లో ఇది జరిగింది. జైనుల ప్రకారం "కేశలుంఛక్రియ" తలవెంట్రుకలు తీసి గుండు గీయించుకొన్నాడు ! ఇది కూడా నిరుపయోగ మైనదేనని భావించి వరి అన్నం, పెరుగు తిని శరీరాన్ని సరిచేసుకున్నాడు. ఎర్రటి దుస్తులు ధరించాడు. మత్స్యము, మాంసము తినడంలో అపకారం ఏదీ లేదని ప్రబోధించాడు.

అటు వైదిక విధానంలో బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు బోధించిన పద్ధతిలోనూ, ఇటు జైనుల మార్గంలో ఉపవాస విధానంలో కూడా ప్రయత్నించిన తర్వాత అనుభవపూర్వకంగా అర్థం చేసుకున్నాకే బుద్ధుడు తనదైన మార్గంలో ఆలోచించడం ప్రారంభించాడు - ఆరు సంవత్సరాల కఠిన నియమాలతో.

## ఐదుగురు సహచరులు



ఈ అన్వేషణా క్రమంలో బుద్ధుడికి తనలాగే జ్ఞానాన్వేషణలో వున్న ఐదుగురు మిత్రులతో సాన్నిహిత్యం ఏర్పడింది. ఈ ఐదుగురినీ "పంచ వర్గీయ భిక్షు" లంటారు. వారిలో మొదటి వాడు అచ్చమైన తెలుగుపేరు కల్గినవాడు - "అణ్ణా కొండణ్ణ" ! అస్సాజి, వప్పా, మహానాముడు, భద్దియ. ఈ ఐదు గురూ బుద్ధుడితో పాటే నడిచారు. కానీ, వీరికి శరీరాన్ని హింసించుకునే విధానాల మీద ఇంకా నమ్మకం పూర్తిగా సడలలేదు. బుద్ధుడు దీక్ష విరమించడం ఇష్టం లేక, ఈ ఐదుగురూ ఆయన్ని వదిలి వెళ్ళి పోయారు.

## సాంఖ్య మరియు యోగశాస్త్రాల అధ్యయనం

ఈ క్రమంలో బుద్ధుడు కపిలముని దగ్గర సాంఖ్యదర్శనాన్ని మధురలో గాని, తక్షశిలలో గాని అధ్యయనం చేసినట్లు కొన్ని గ్రంథాల్లో వుంది. యోగశాస్త్రం కూడా అభ్యసించాడు.

ఈ నేర్చుకున్నవన్నీ ఆయనకు అనుభవాలే. వీటిలోంచి తనదైన ఒక కొత్త సిద్ధాంతాన్ని తాను ప్రతిపాదించగలగాలి. దానికోసమే ఆయన అన్వేషణ.

బౌద్ధ ధర్మాలలో మూడు మౌలికమైన ధర్మాలు కలగలసి వున్నాయి. (1) జైన విధానం (2) సాంఖ్యశాస్త్రం (3) యోగశాస్త్రం. ఈ మూడింటినీ చాలాలోతుగా అధ్యయనం చేసి మూడింటి సారం అనదగిన బౌద్ధ ధర్మాన్ని ప్రతిపాదించాలని ఆలోచించసాగాడు.

## జైనం నుంచి దూరంగా .....

"మహావస్తు" అనే బౌద్ధగ్రంథం ప్రకారం, బుద్ధుడు జైనాన్ని తనకు ఉపకరించేది కాదనుకొని వదిలేశాడు. తర్వాత తన తొలి గురువు ఆలారుణ్ణి సందర్శించాడు. రెండవ గురువు ఉద్రీకుణ్ణీ కలుసుకొన్నాడు. ఆ తర్వాత మగధ చక్రవర్తి బింబిసారుణ్ణి "రాజగృహ'లో కలిశాడు. ఆయన సాదరంగా ఆహ్వానించి గౌరవించాడు. వారిద్దరి బోధనల్ని, ధ్యాన విధానాల్ని రాజగృహలో బింబిసారుడు నిర్మించిన ఆశ్రమంలో సాధన చేయడం ప్రారంభించాడు.

ప్రతిరోజూ "ఘనాహారం" తీసుకోవాలనీ, ఆరోగ్యాన్ని కాపాడుకోవాలనీ నిర్ణయించుకున్నాక, ఆ రాజ్యపు సేనాని కూతురు 13 ఏళ్ళ సుజాత రోజూ బుద్ధుడికి పాయసాన్నం తెచ్చి అందించేది. గడ్డికోసే "సొత్తియ్య" ప్రతిరోజూ కొన్ని దర్భలు తెచ్చి ఇచ్చేవాడు. దాన్ని పరుచుకొని బుద్ధుడు కూర్చుని ధ్యానం చేసేవాడు. ఇలా చాలాకాలం తరువాత ఒక రోజున ఆయన 36వ ఏట బుద్ధత్వం సిద్ధించింది. బోధిసత్త్వుడైనాడు.

## మొదటి శిష్యులు

తనకు జ్ఞాన సిద్ధి కల్గిన తర్వాత ఈ విషయం తన తొలి గురువుకు నివేదించాలని బుద్ధుడు చాలా ఆత్రంగా వెళ్ళాడు. కానీ, ఆ ఇద్దరూ అప్పటికే కాలం చేశారని ఆయనకు తెల్సింది. తనను వదలి వెళ్ళిన తన తొలి సహచరులు ఐదుగురినీ కలుసు కోవాలని కాశీ వెళ్ళాడు. కాశీ సమీపంలోని "ఈసి పట్టణం"లో హరిణవనంలో ఆ ఐదుగురూ తపోదీక్షలో వున్నారు. బుద్ధుడు వారిని కలిశాడు. సారనాథ్ స్తూపం నిర్మించబడిన

ప్రాంతానికి ఆనాటి పేరు "ఈసిపటన" అని బౌద్ధగ్రంథాలలో వుంది. బహుశా ఈశ్వర పట్టణానికి అది పాళీరూపం కావచ్చు. ఈ ఐదుగురు బ్రాహ్మణ అనుచర మిత్రులకు బుద్ధుడు ధర్మచక్ర ప్రవర్తన సూత్రాలు బోధించాడు. ఇవే బౌద్ధ ధర్మాలకు మూలసూత్రాలు. మొదటగా విని తరించినవారు ఈ ఐదుగురు బ్రాహ్మణులు - కొండన్న, వప్పయ్య, భద్దియ్య, మహానామ, అస్సాజీలు.

"మహావగ్గ" అనే బౌద్ధ గ్రంథంలో గౌతముడు జ్ఞానాన్ని పొంది బుద్ధుడుగా ఎలా మారాడో వివరంగా చెప్పబడింది.

మొదట సత్యదృష్టి ఏదో కళ్ళముందు తారాడినట్లనిపించిందట ! నాలుగు అంచెలలో ఈ సత్య దృష్టి కన్పించిందిట. ఒక్కొక్క అంచెలోకీ ప్రయాణిస్తూ ధ్యాన మార్గంలో సత్యాన్ని కనుగొనగలిగాడు చివరికి. ఆవిధంగా సంబుద్ధత్వాన్ని కొంత పొందాడు. బోధివృక్షం క్రింద పద్మాసనంలో ఏడురోజులపాటు కూర్చుని "విముక్తి" లోని ఆనందాన్ని అనుభవించాడట సిద్ధార్థ గౌతముడు.

## మొదటి ఉపన్యాసం



బుద్ధుడికి మొట్టమొదటగా శిష్యులయ్యింది ఇద్దరు వ్యాపారులు. "తపుస్స", "భల్లిక" వీళ్ళిద్దరి పేర్లు.

తపుస్స భల్లికలు శిష్యులయ్యే నాటికి గౌతముడు బుద్ధుడుగా మారిన తొలిరోజులు. అప్పటికి బౌద్ధ సంఘాలను ఇంకా నిర్మించలేదు.

ఎనిమిది రకాల జీవిత విధానాల్ని ప్రకటించి, వాటి గురించి ప్రసంగించడం మొదలు పెట్టాడు బుద్ధుడు. ఆయన తనది మధ్యేమార్గంగా చెప్పుకొన్నాడు. తన మార్గాన నడిస్తే జ్ఞాన సముపార్జన తేలికగా జరుగుతుందని ప్రకటించాడు. ఇది ఆయన మొదటి ప్రసంగం (Sermon-I). ఇది బంగారం లాంటి సాధనంగా ప్రజలు గుర్తించడం క్రమేణ ప్రారంభం కాసాగింది.

కాశీపట్టణానికి దగ్గరగా సారనాథ్ స్తూపం శిధిలాలు ఇప్పటికీ కన్పిస్తాయి. దాని మీద నాల్గు ధర్మాలు బుద్ధుడు మొట్టమొదటగా బోధించినవి చెక్కబడి వున్నాయి.

సారనాథ్ స్తూపం వున్న ఈ ప్రాంతాన్ని అప్పట్లో "ఈసి (లేదా) ఈసిసి పట్టణం" అని పిలిచేవారట. అది హరిణవనంగా వుండేది. అంటే లేళ్ళ అభయారణ్యం. అక్కడ చేరిన కొందరు సన్యాసులు లేదా సాధువులను ఉద్దేశించి ఆయన మొదటిసారిగా ప్రసంగించాడు. "చత్వారి ఇమాని భిక్కవె అరియసచ్చాని" అని ఆ స్తూపం మీద రాసి వుంది.

'వారాణశీయ భగవతో చైంకమె" అని బౌద్ధ గ్రంథాల్లో ఉంది.

బుద్ధ భగవానుడి పాదస్పర్శతో వారణాసి దివ్యభూమి అయ్యిందని ఈ సూత్రానికి భాష్యం చెప్తారు. బుద్ధుడు సారనాథ్‌ని చేరేనాటికే వారణాసి పట్టణం ప్రాచుర్యాన్ని పొందిన నగరమేనా ..... లేక, సారనాథ్ పక్కన కొత్తగా వారణాసి నగరం వెలిసిందా..... అనే విషయంలో పరిశోధకుల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి. బుద్ధుని కారణంగానే కాశీ పట్టణం పవిత్రమైందని బౌద్ధ గ్రంథాల అభిప్రాయం! ఆ రోజుల్లో కాశీపట్టణం, ఈసీ పట్టణం జంటనగరాల వంటివి కావచ్చు కూడా!

## కాశీలో మొట్ట మొదటి బౌద్ధ సంఘం



వైదిక ధర్మాలకు చెందిన ఋషులు, సాధువులు, సన్యాసులు ఆచరించే పద్ధతులు – నిద్రాహారాలు మాని ఉపవశించే తపోదీక్షల్ని అనవసరమైనవిగా భావించాడు బుద్ధుడు.

జైన ధర్మాలను పాటించే దిగంబరుల్లాగా మొండిమొలలతో సంచరించినందు వలన జ్ఞాన సిద్ధి కలిగే అవకాశమే లేదనికూడా భావించాడు.

చక్కని తెల్లని బట్టలు వంటినిండా కట్టుకునే వాడు. సుష్టుగా భోజనం చేసేవాడు బుద్ధుడు.

రెండుపూటలా స్నానం విధిగా చెయ్యాలని ప్రకటించాడు. మనోనిగ్రహం, మద్యపానం చెయ్యకుండా వుండటం – ఇవి రెండూ ఖచ్చితంగా అమలు జరపగలిగితేనే బౌద్ధ భిక్షువుగా అర్హత కలుగుతుందని చెప్పాడు.

బుద్ధుని ధర్మాలు పైకి తేలికగా కనిపించాయి గానీ, ఆచరణలో ఆయనకు అనుచరుడిగా మారడం చాలా కష్టం అనిపించింది చాలా మందికి. ఎవరూ ధైర్యం చేసి శిష్యుడిగా ముందుకు రాలేదు. వచ్చింది మొదటి ఇద్దరు శిష్యులే !

మూడోవాడు "యాసుడు". ఈ యాసుడు కాశీనగరంలో చాలా గొప్ప ధనికుడైన ఒక వాణిజ్యవేత్త కొడుకు. మంచి వయస్సులో వున్నవాడు.

"వరుణా నది" ఒడ్డున ఒకరోజు యాసుడుకి బుద్ధుడు తారసపడ్డాడు. ఏవో తనకి తెలియని కొన్ని సంగతులు అడుగుతానని, సమాధానం చెప్పవలసిందిగా కోరాడు. ఇంత వరకు ఎవ్వరూ తన ప్రశ్నలకు తగిన జవాబులు చెప్పలేదన్నాడు.

"ఉప్పదుతమ్ ఓ ఉప్పసత్తమ్ ఓ" అంటూ ఆ యిద్దరి మధ్య అప్పుడు జరిగిన సంభాషణని బౌద్ధ గ్రంథాలు పేర్కొంటున్నాయి.

బుద్ధుడు యాసుడుకి దానకథమ్ (దానగుణ ప్రాశస్త్యం), శీల కథమ్ (ఉత్తమ శీల సంపదల ప్రాశస్త్యం), సగ్గ కథం (మోక్ష సాధన గురించి), కామానమాదీనవం సంకివేశమ్ (భవభోగాల అనుభవం గురించి) బోధించాడట.

ఈ విషయాలన్నీ విన్న తర్వాత యాసుడికి ఒక గొప్ప గురువు దొరికాడని అనిపించింది. తన 54 మంది స్నేహితుల్ని వెంటబెట్టుకొని వచ్చి, బుద్ధుని శరణుకోరి, ఆయన అనుమతితో శిష్యులుగా చేరారు.

ఆ విధంగా ఈ శిష్య గణంతో మొట్టమొదటి బౌద్ధ సంఘం ఏర్పడింది.

బుద్ధుడే స్వయంగా వారికి బౌద్ధమత దీక్ష ఇచ్చి, బౌద్ధ సంఘాన్ని ఏర్పరచి, దానికి యాసుని నాయకుడిగా నియమించాడు.

ఆ తర్వాత అనేక బౌద్ధ సంఘాలు ఏర్పడడం మొదలు అయ్యాయి. సంఘ నాయకత్వానికి ప్రజాస్వామ్య ప్రక్రియలో ఎన్నికలు జరిపించినట్లు చాలా ఆధారాలున్నాయి.

ఈ సంఘటన తర్వాత ఉరువేలలో, బుద్ధుడు జ్ఞానసిద్ధి పొందినచోట, వెయ్యిమంది బ్రాహ్మణ సన్యాసులు బుద్ధుని సందర్శించి బౌద్ధ ధర్మ అనుయాయులుగా మారారు. ఈ

వెయ్యి మందినీ "జటిలురు" అంటారు. జడలు కట్టిన వెంట్రుకలు కల్గిన సాధకులని అర్థం. బుద్ధుడు తన వాక్చాతుర్యంతోనూ, జ్ఞాన సంపన్నతతోనూ ఇతరుల వాదనల్ని పూర్వపక్షంచేసి, వారి మనసుల్ని జయించి, వారిని బౌద్ధులుగా స్వీకరించడం ప్రారంభించాడు.

క్రమేణా బౌద్ధ సంఘాలు ఏర్పడడం మొదలయ్యాయి.

## వందల సంఖ్యలో శిష్యగణం



ఉరువేలలో 30 మంది ధనికవర్గాలకు చెందిన యువకులు బౌద్ధులుగా మారడంతో అక్కడ రెండో బౌద్ధ సంఘాన్ని ఏర్పరిచాడు. 500 మంది జటిలురు - అగ్నిదేవుని ఆరాధకులు - వీరంతా కశ్యప ముని ఆధ్వర్యంలో బుద్ధుని అనుచరులుగా మారారు. అప్పటికే ఎంతో ప్రాచుర్యం కల్గిన కశ్యపముని అంతటి వాడు స్వయంగా బుద్ధుని తన గురువుగా ప్రకటించడం చూసి బింబిసారుడే ఆశ్చర్యపోయాడు. "వేలువనం" అనే వనాన్ని బుద్ధుడికి కానుకగా సమర్పించు కొన్నాడు బింబిసారుడు. వరుసగా బౌద్ధ సంఘాలు ఏర్పడసాగాయి.

## ముఖ్య శిష్యులు సారిపుత్రుడు, మొగ్గల్లానుడు

పాలీ భాషా ఉచ్చారణలో కనిపించే ఈ ఇద్దరు వైదిక ఋషులు సంజయ మార్గానికి చెందినవారు. ఆ మార్గంలోంచి విడివడి 250 మంది అనుచర గణంతో బౌద్ధంలోకి ప్రవేశించారు. ఆ తర్వాతి కాలంలో ఈ ఇద్దరూ బౌద్ధంలో ప్రముఖమైన పాత్ర పోషించగలిగారు. సారి సారదృతి పుత్రుడికి ఈసారిపుత్రుడు కొడుకు. "ఉపతిస్స" గ్రామానికి చెందినవాడు. అలాగే "మొగ్గల్ల" అనే బ్రాహ్మణ స్త్రీ పుత్రుడు మొగ్గల్లానుడు. ఈయన కోలిత గ్రామానికి చెందినవాడు.

మగధలో మూకుమ్మడిగా ఇలా బౌద్ధంలోకి "మత మార్పిడులు" అనదగిన పరిస్థితులు ముమ్మరంగా సాగుతుంటే, వైదికుల్లో గగ్గోలు ప్రారంభం అయ్యింది. ఈ గౌతముడు తల్లులకూ పిల్లలకూ కాకుండా చేస్తున్నాడని, అన్నెం పున్నెం ఎరుగని అమాయకులైన కుర్రాళ్ళని బౌద్ధ భిక్షువులుగా మార్చి సన్యాసుల్ని చేస్తున్నాడనీ వైదికులు ఆగ్రహించసాగారు.

## బౌద్ధ సంఘంగా మారిన కపిలవస్తు

కపిలవస్తులో రాజాంతఃపురం బౌద్ధ సంఘంగా మారిపోయింది. శుద్ధోధనుడు, అతని రాజులు కూడా బౌద్ధులుగా మారారు. బుద్ధుని కొడుకు రాహులుడు, తమ్ముడు నందుడు, సవతితల్లి గౌతమి మహాప్రజాపతి వీరంతా అప్పటికే బౌద్ధాన్ని స్వీకరించారు. బుద్ధుడు స్వయంగా వీరికి బోధనలు చేశాడు.

## రాహులుని బౌద్ధ స్వీకారం

ఇది ఇలా వివాదంగా రగులుతుండగానే, బుద్ధుని వ్యక్తిగత జీవితంలో ఒక ముఖ్య పరిణామం జరిగింది.

బుద్ధుని కుమారుడు రాహులుడు పుట్టిన రోజునే బుద్ధుడు నగరం వదిలి వచ్చేశాడు. ఆ పిల్లవాడు ఇప్పుడు యుక్త వయస్కుడయ్యాడు. బుద్ధుని పెంచిన సవతితల్లి ప్రజాపతీదేవికి తనతో పాటే పుట్టిన తన సవతి తమ్ముడు నందుడుకి రాజ్యభారం ఇవ్వడానికి తండ్రి శుద్ధోధనుడు నిర్ణయించాడు. జనపదకల్యాణి అనే అందగత్తెతో వివాహం కూడా నిశ్చయించాడు. రేపే పట్టాభిషేకం అనగా నందుడు, రాహులుడితో కలిసి కపిలవస్తు నగరంలోనే బౌద్ధాన్ని స్వీకరించారు.

ఇటు బుద్ధునికి గానీ, అటు శుద్ధోధనుడికి గానీ ఈ విషయం తెలియదు. కుమారులిద్దరు, మనుమడు కూడా సన్యసించడంతో కపిలవస్తు రాజ్యానికి వారసుడు లేకుండా పోయాడు. అప్పుడే బుద్ధుడు, తల్లిదండ్రుల అనుమతి లేకుండా ఎవరూ ఎవరికీ బౌద్ధ దీక్ష ఇవ్వకూడదని ఒక నియమం పెట్టాడు.

## జేతవనం కథ



శ్రావస్తి నగరంలో గొప్ప వాణిజ్యవేత్త సుదత్తుడికి బుద్ధుడు స్వయంగా బౌద్ధ దీక్ష ఇచ్చాడు. ఈ "సుదత్తుడు"కి మనసులో ఒక ఆలోచన కలిగింది. యువరాజు "జేత"కు చెందిన ఒక గొప్ప వనం వుంది. ఆ వనాన్ని బుద్ధుని వినియోగార్థం ఇవ్వాలనుకొన్నాడు. "జేత"ని కలిసి అతని తోటని అమ్మవలసిందిగా కోరాడు. కోరినంత డబ్బిస్తానన్నాడు.

బంగారు నాణాలు తెచ్చి నేలమీద పరవండి - ఎంతమేర పరచగలిగితే అంత వనాన్ని ఇస్తానన్నాడు జేత. నిజానికి ఇది అర్థంలేనంత ఖరీదైన అమ్మకం. కానీ సుదత్తుడు అందుకు అంగీకరించి, బండ్లనిండా జాడీలతో బంగారు నాణాలు తెప్పించి వనంలో పరిపించడం మొదలు పెట్టాడు. అది చూసి చలించిపోయి, జేత యువరాజు ఆ వనంలో బుద్ధుని వినియోగార్థం ఒక నివాసాన్ని నిర్మించి దానంగా ఇచ్చాడని ఒక ఐతిహ్యం. సుదత్తుడికి "అనాథ పిండదా" "నిరాశ్రయులకు ఆశ్రయం ఇచ్చేవాడు" అని పేరు పెట్టాడు బుద్ధుడు. "ఛుల్లవగ్గ" అనే బౌద్ధ గ్రంథంలో ఈ కథ వుంది.

ఈ కథని కథగా చదువుకుంటే ఉపయోగం ఏమీలేదు. ఆనాటి సామాజిక వ్యవస్థలో రాజుకన్నా ధనికులైన సామాజిక వర్గం ప్రజల్లో వున్నారు. రాజు కేవలం సంరక్షకుడు (Custodian of Property) మాత్రమే. వైశ్యుడు క్షత్రియుడికన్నా అధిక ధనవంతుడు. రాజకీయ అధికారానికి, ఆర్థిక బలానికి సంఘర్షణ నడుస్తోన్న ఆ కాలంలో బుద్ధుడు ఇద్దరికీ ఆమోద యోగ్యమైన వ్యక్తిగా నిలబడ్డాడు. సామాజిక వర్గాలలో మొదటి అంతస్తున వున్న బ్రాహ్మణుడు తన ఉనికిని కాపాడుకునే ప్రయత్నంలో వైదిక ధర్మాల సంరక్షణకోసం పనిచేస్తుంటే కొందరు క్షత్రియులు ఎక్కువమంది వైశ్యులు బుద్ధుని వెంట నడిచారు.

## భిక్షుకిగా మారిన ధనిక స్త్రీ విశాఖ

"విశాఖ" కథ చదివితే ఆనాటి సామాజిక వ్యవస్థ గురించిన మరికొంత అవగాహన కలుగుతుంది. బంగారం వ్యాపారుల కుటుంబానికి చెందిన అమ్మాయి విశాఖ. పుణ్యవర్ధనుడనే ఇంకో యువ వ్యాపారికి ఈ అమ్మాయినిచ్చి పెళ్లి చేశారు. పుణ్యవర్ధనుడు జైన దిగంబరులకు శిష్యుడయ్యాడు. జైన దిగంబరులు విశాఖని వదుల్చుకోవలసిందిగా సూచించారు. ఆమెను వదిలేయడం కోసం పుణ్యవర్ధనుడు ఆమె మీద కొన్ని అభాండాలు మోపాడు. వాటిని అభాండాలుగానే ఆమె నిరూపించి, బుద్ధుని కలిసి బౌద్ధం స్వీకరించి, తానే అతన్ని వదిలేసింది !

బుద్ధుని కలిసేందుకు వెళ్ళినప్పుడు ఆమె ఆశ్రమం దగ్గర తన ఖరీదైన తలపాగా మర్చిపోయిందట. ఆనందుడు దాన్ని జాగ్రత్త చేసి ఆమెకు అందచేస్తే ఆమె దాన్ని అమ్మగా వచ్చిన డబ్బుతో శ్రావస్తిలో "పూర్వారామం" కట్టించిందట. బుద్ధుడు జేతవనంలోనూ, పూర్వారామంలోనూ ఎక్కువ కాలం నివసించాడు.

ఈ విధంగా రాజగృహ, కపిలవస్తు, శ్రావస్తిలలో మూడు బౌద్ధారామాలు వెలిశాయి. ఇది జ్ఞానోదయం తర్వాత రెండవ సంవత్సరం.

# బాబూ! నీ తల్లిని! నన్నూ చేర్చుకోవూ ..... ???



గౌతముడు బుద్ధునిగా మారిన తర్వాత ఇది ఐదవ సంవత్సరం. బౌద్ధ ధర్మాన్ని స్వీకరిస్తున్న స్త్రీల సంఖ్య పెరగసాగింది. ఆ ఏడాది శుద్ధోధనుడు మరణించాడు. బుద్ధుడు రాజ్యానికి వెళ్ళి శాక్యులకు, కోలియులకు మధ్య ఏర్పడిన వివాదాల్ని పరిష్కరించాడు. రోహిణీ నది నీటిని పంచుకునే విషయంలో వివాదాలు ఏర్పడ్డాయి.

బుద్ధుని పెంచిన తల్లి మహాప్రజాపతీదేవి భిక్షుకిగా మారి బౌద్ధ సంఘారామంలో నివసించడానికి బుద్ధుని అనుమతి కోరింది. ఆమె మూడుసార్లు అడిగింది. మూడుసార్లూ బుద్ధుడు తిరస్కరించాడు. వైశాలికి తిరిగి వచ్చేశాడు. కపిలవస్తు నుంచి నడుచుకొంటూ ఆమె వైశాలి దాకా బుద్ధుని అనుసరించివచ్చి, ఆరామం బైట భోరున విలపిస్తూ నిల్చుంది. పాదాలు వాచిపోయి, దుమ్ముకొట్టుకు పోయిన దీన స్థితిలో ఆమెను చూసి ఆనందుడనే శిష్యుడు చలించిపోయాడు. బుద్ధుడు ఆమెను లోపలికి అనుమతించడంలేదు. ఆనందుడు బుద్ధుడి దగ్గరకు వెళ్ళి ఆమె పక్షాన మాట్లాడాడు. ఆమెను అనుమతించవలసిందిగా ప్రార్థించాడు అప్పుడు. బుద్ధుడు ఎనిమిది కఠినమైన నియమాల్ని విధించి, వాటిని అను సరించడానికి అంగీకరిస్తేనే స్త్రీలను బౌద్ధ భిక్షుకిలుగా అనుమతించాడు.

రాణితో పాటు, ఆమె కుమార్తె నందా, భద్దకచ్చన (యశోధర - బుద్ధుని భార్య) కూడా భిక్షువులుగా మారి సన్యాసం స్వీకరించారు. "థేరిగాధ" అనే గ్రంథంలో 70 మంది స్త్రీ భిక్షువుల గురించిన వివరాలున్నాయి. బింబిసారుడి భార్య "ఖేమ (క్షేమ) బౌద్ధ గ్రంథరచయిత్రి). ధమ్మదిన్నా (ధర్మదీన) కీశా (కృశ) గౌతమి... వీరంతా "అర్హతులు" అయిన స్త్రీ భిక్షువులు.

సారిపుత్రుడి ద్వారా "పటాచారా" అనే జైన పరివ్రాజిక బౌద్ధ దీక్ష తీసుకొంది. మానవిక, చించా, సుందరి ..... వీరంతా కూడా జైన పరివ్రాజికలేనని, బుద్ధుని మార్గాన నడిచి అర్హతులయ్యారని బౌద్ధ గ్రంథాలలో వుంది. ఆమ్రపాలి (అంబపాలి), చాలికలు రాజనర్తకులు బౌద్ధ భిక్షువులయ్యారు.

## బౌద్ధుడుగా మారిన బందిపోటు "అంగుళీ మాల"

శ్రావస్తిలో 20వ సమీక్షా సమావేశం నిర్వహిస్తున్నాడు బుద్ధుడు. ఆ సమయంలో పేరుమోసిన బందిపోటుదొంగ, కరుడుగట్టిన హంతకుడు "అంగుళీమాల" అనేవాడు బుద్ధుడికి తారసపడ్డాడు. అతని చేతిలో చావుకు గురయిన వ్యక్తుల బొటన వ్రేళ్లని తీసి దండలా గుచ్చి మెడలో వేసుకొని తిరుగుతాడట. అంగుళీమాల ఆ విధంగా ప్రసిద్ధుడు.

ఛాలికా అనే అటవీ గ్రామంలో బుద్ధుడు అతన్ని కలుసుకున్నాడు. అతన్ని సంస్కరించి తన మార్గంలోకి తీసుకువచ్చాడు. శ్రావస్తిలో అతనికి దీక్షనిచ్చి బౌద్ధ సన్యాసిగా చేశాడు. ఈ సమావేశానికి వచ్చిన రాజు ప్రశేనజిత్తుకి బుద్ధుని పక్కనే కూర్చొన్న అంగుళీమాలని చూసేసరికి ముచ్చెమటలు పోశాయట ! బుద్ధుడు భయంలేదని నవ్వుతూ అభయం ఇచ్చాడట !

ప్రశేనజిత్తు ఈ సందర్భంగా అంగుళీమాలకి కొత్తబట్టలు ఇస్తే, అంగుళీమాల సున్నితంగా తిరస్కరించి, బుద్ధుడు ఇచ్చిన ఈ దుస్తులు తనకి సరిపోతాయని అన్నాడట బౌద్ధసన్యాసి కట్టుకునే బట్టల్ని చూపించి !

## బుద్ధుని వ్యక్తిగత సహాయకుడు ఆనందుడు



బౌద్ధ సంఘాలు విపరీతంగా పెరిగిపోయి, తనను కలుసుకోవాలని వచ్చేవారి సంఖ్య అధికం కావడంతో బుద్ధుని మీద పనిభారం పెరిగింది. ఆయన ఆహారం, ఇతర విషయాల గురించి పట్టించుకునే వ్యక్తి అవసరం అయ్యాడు. అంతకుమునుపు నాగసాకులుడు బుద్ధుడు చెప్పిన వైపు కాకుండా ఇంకొకవైపు వెళ్ళి దొంగలబారిన పడ్డాడు. మేఘీయుడనే మరో సహాయకుడు బుద్ధుని ధిక్కరించి అవినయం ప్రదర్శించాడు. ఈ పరిస్థితుల్లో ఒక నమ్మకమైన సహాయకుడు అవసరం అయ్యాడు.

ఒకరోజు సభలో ఈ విషయాన్ని ప్రస్తావించాడు బుద్ధుడు. "సారిపుత్త" వెంటనే లేచి ఆ అవకాశం తనకిప్పించమని అడిగాడు.

మొగ్గల్లానుడు కూడా లేచాడు. ఆ సమయంలో ఆనందుడు సభలో ఒక పక్కన మౌనంగా కూర్చుని వున్నాడు. బుద్ధుడు ఆనందుడి కోసం వెదికాడు. "ఆనందా ! నువ్వు స్వీకరించగలవా.....?" అనడిగాడు. బుద్ధుడి పిలుపుకోసమే ఎదురుచూస్తున్నాడు ఆనందుడు. ఆయన లేచి భక్తితో నమస్కరించి అన్నాడు కదా.....

1. ఎల్లప్పుడు మిమ్మల్ని అనుసరించి వుండే అవకాశం ఇవ్వాలి.
2. వ్యక్తిగతమైన ఆహ్వానాలమీద మీరు వెళ్ళే చోట్లకు కూడా నన్ను తీసుకువెళ్ళాలి.
3. ఎప్పుడు అవసరం అయితే అప్పుడు మిమ్మల్ని వచ్చి కలుసుకునే స్వేచ్ఛ (Free Access) నాకుండాలి.
4. మీరు బోధించిన విషయాల్ని మీ సమక్షంలో పునశ్చరణం చేసుకునే అవకాశం కావాలి.

ఈ నాలుగు వరాలు తనకు ప్రసాదించ వలసిందిగా కోరాడు ఆనందుడు. బుద్ధుడు సంతోషంగా వాటికి అంగీకరించాడు. ఆరోజునుంచి బుద్ధుని వ్యక్తిగత సహాయకుడిగా మారాడు ఆనందుడు.

## అజాతశత్రుని కోటకు శంకుస్థాపన

79వ ఏట రాజగృహ నుంచి నాలంద, పాటలీ గ్రామాల్ని సందర్శించడానికి బయల్దేరాడు. పాటలీ గ్రామంలో కోటని నిర్మించడానికి బుద్ధుని శంకుస్థాపనకోసం ఆహ్వానించాడు అజాతశత్రు.

ఆర్యులు ఈ భూమి మీద వున్నంతవరకూ, వ్యాపారులు దిగ్విజయంగా వాణిజ్య వ్యవహారాలు నిర్వహించగలిగినంత కాలం ఈ నగరం పాటలీపుత్ర ప్రసిద్ధంగా వుటుందని ఆశీర్వదించాడు బుద్ధుడు.

బుద్ధుడికాలం నాటికి భారతీయ సమాజం వర్తక వాణిజ్యాల మీద ఆధారపడి ఉందని ఈ అంశాన్ని బట్టి మనం వూహించవచ్చు. "మహాపరినిర్వాణ సుత్త" బౌద్ధగ్రంథంలో దీని గురించి వుంది. అశోకుడి తర్వాతే సామ్రాజ్య విస్తరణలు, రాచరికం, ఫ్యూడల్ స్వభావాలు భారతీయ సమాజాన్ని ఆవహించి వుండాలి. అప్పటివరకూ రాజు - వ్యాపారుల్లో కెల్లా పెద్ద వ్యాపారిగా వుండేవాడని కూడా వూహించవచ్చు. వ్యాపారుల సంఘానికి (చాంబర్ ఆఫ్ కామర్స్) అధ్యక్షుడి లాంటివాడు ఆనాటి రాజు! శుద్ధోధనుడైనా, బింబిసారుడైనా, అజాతశత్రువైనా ఇలాంటి వారే!

నగరద్వారానికి అజాతశత్రువు గౌతమ ద్వారం అనిపేరు పెట్టాడు. ఈ ద్వారం దాటి ముందుకువస్తే నది. అక్కడ పడవలు ఎక్కేందుకు వీలుగా ఫెర్రీ నిర్మించారు. దానికి కూడా గౌతముడి పేరే పెట్టాడు.

## బుద్ధుడి జీవితంలో విలన్ - దేవదత్తుడు



బుద్ధుడికి 72 సంవత్సరాలు వచ్చాయి. రాజకుటుంబం లోంచి రాహులుడు, నందుడు వీరంతా బౌద్ధ భిక్షువులుగా మారడంతో ఏర్పడిన సంచలనంలో, వెనకబడిపోతాననే భయంతో దేవదత్తుడు కూడా బౌద్ధం స్వీకరించాడు. బాల్యం నుంచీ దేవదత్తుడు అసూయాపరుడే ! అయినా, బుద్ధుడు కరుణించి అతన్ని 11 మంది ముఖ్య అనుచరుల్లో ఒకడిగా ప్రకటించాడు. అతనిపైన ప్రత్యేక శ్రద్ధతో గట్టి శిక్షణ ఇచ్చాడు. అందువలన కొంత మానసిక శక్తిని సంపాదించుకోగలిగాడు దేవత్తుడు.

ఈ అవకాశంతో అజాతశత్రుని పక్కకు తప్పించి, సంఘ నాయకత్వం చేజిక్కించుకోవాలనేది దేవదత్తుడి దురాశ. బుద్ధుడు ఇంకెంత కాలం బతుకుతాడు ? ఆయన తర్వాత తానే ఆ స్థానానికి రావాలని, తనకు మించినవాడు ఈ సంఘంలో ఎవరూ లేరనీ భావించుకోసాగాడు. అందుకు అనుగుణంగా పావులు కదపసాగాడు. బుద్ధుడు తనవారసుడి గురించి చర్చ జరగడానికి ఇష్టపడలేదు. దేవదత్తుణ్ణి సంఘంలోంచి బహిష్కరించాడు! ఒక దశలో దేవదత్తుడు చేసే పనులకు, బౌద్ధానికి ఏమీ సంబంధం లేదని ప్రకటించాడు కూడా!

అంతలో, అజాతశత్రువు తన తండ్రి బింబిసారుణ్ణి రాజ్యాధికారం కోసం హత్య చేయడానికి ప్రయత్నిస్తున్నాడనే పుకారు వచ్చింది. బహుశా దేవదత్తుడు ఇలాంటి వార్తల్ని వ్యాపింపచేసి వుండొచ్చుకూడా! ఇది తెలిసి బింబిసారుడే రాజ్యత్యాగం చేసి, అజాతశత్రువును రాజుగా ప్రకటించాడు.

మాంసాహారం తీసుకోవడం వంటి కొన్ని విషయాల మీద బుద్ధుడు ఇచ్చిన మినహాయింపుని దేవదత్తుడు అలుసుగా తీసుకొని, బుద్ధ వ్యతిరేక ప్రచారం ప్రారంభించాడు. తనతోబాటు కోకాలికుడు తదితర 500 మంది భిక్షువుల్ని బైటకు తీసుకొచ్చాడు. తనదే అసలైన బౌద్ధం అంటూ ధర్మప్రబోధాలు మొదలుపెట్టాడు. తానే నిజమైన బుద్ధుడినన్నాడు.

సంఘంలోనుండి బైటికి వెళ్ళిన 500 మంది భిక్షువుల్ని కలిసి మాట్లాడవలసిందిగా బుద్ధుడు సారిపుత్రుణి మౌద్గయాయనుణ్ణీ పంపించాడు. ఈ ఇద్దరూ వారి సందేహాలు తీర్చి వెనక్కు తీసుకొచ్చారు.

## బుద్ధుని విజయాలు

1. మలినమైన, కల్మషమైన ఆలోచనల్ని దూరం చెయ్యగలిగాడు. నెగెటివ్ తరహా మనోభావాల్ని గుర్తించి వాటిని వదిలేయాలని ప్రబోధించాడు.
2. అమితమైన కోర్కెలు, కామం, తృష్ణ..... వీటిని జయించాడు.
3. సంగం, అసహ్యం - అంటే ప్రేమ ద్వేషాల్ని రెండింటినీ ధిక్కరించాడు.
4. విశ్వంలోని వింతల లోతుల్లోకి చూడగలిగాడు. విశాల విశ్వరహస్యాన్ని కనుగొన్నాడు.
5. ఆత్మ రహస్యాన్ని, మానవ జీవిత పరమావధిని తెలుసుకోగలిగాడు.
6. జ్ఞానజ్యోతిని దర్శించగలిగాడు - కాబట్టి "ఆసియా జ్యోతి" అన్నారు ఆయన్ని.
7. కామాన్ని జయించాడు కాబట్టి వీరుడన్నారు.
8. జయాన్ని పొందాడు కాబట్టి జినుడన్నారు.
9. జ్ఞానాన్ని అన్వేషించి యదార్థాన్ని తెలుసుకొన్నాడు కాబట్టి తథాగతుడయ్యాడు.
10. తనదైన ధర్మాన్ని ప్రవచించి అర్హతుడయ్యాడు.

బౌద్ధ దర్శనంలో కూలంకషమైన పాండిత్యాన్ని సాధించిన వారికి ప్రత్యేక గుర్తింపు వుండేది. అది "సృజనాత్మకమైన మానసిక పరిశ్రమ" అంటారు. కీ॥ శే॥ బి.యస్. యల్.యన్. హనుమంతరావుగారు.

అనేక శాసనాలలో "దిఘ మజ్జిమ నికాయ ధర" "పంచమాతి కాథర", "వినధర', "మహావినధర" "దమ్మ కాథిక", "మహాదమ్మ కథిక"..... ఇలాంటి బిరుదులున్న బౌద్ధ ప్రముఖులు కన్పిస్తారు. బౌద్ధ దర్శనంలోని ఆయా శాఖల్లో వీరు పండితులు కావచ్చు.

## బుద్ధుడినుంచి దీక్ష స్వీకరించిన ఇతర గురువులు

సంజయుడనే బౌద్ధుడి కథని మనం తెలుసుకుంటే ఈ సంఘాల నిర్వహణ ఎలా జరిగేదో అర్థం అవుతుంది.

సంజయుడు అనే వైదిక ఋషికి, 250 మంది శిష్యులుండేవారు. సారిపుత్రుడు, మొగ్గల్లానుడు అనే ఇద్దరు శిష్యులు తమ గురువు సంజయుడిపట్ల అసంతృప్తిని ప్రకటించి బుద్ధుని ఆశ్రయించి, ఆయన శిష్యులుగా చేరిన తర్వాత సంజయుడు ఆ శిష్యులిద్దరి

దగ్గరకూ వచ్చి, తన శిష్య గణాన్ని రెండుగా విభజిస్తానని, రెండో దానికి ఆ యిద్దరూ గురువులుగా వుండవచ్చని ప్రతిపాదించాడు. తనతో తిరిగి రమ్మని ఆ యిద్దరినీ కోరాడు. వాళ్ళు అందుకు నిరాకరించారు. "సబ్బేవ తయో ఇమమ్ గణమ్ పరిహరి శ్యామతి" - అంటూ, "సామాన్నా ఫల సుత్త" అనే బౌద్ధ గ్రంథంలో ఈ కథ ఉంది.

సంజయుడి లాంటి గురువులు ఆ రోజుల్లో ఆరుగురు ఉండే వాళ్ళట. పురాణ కశ్యపుడు, కౌపీన మఖాలి, కేశవస్త్ర, అజీతుడు, ఏకుధో కచ్ఛాయనుడు, సంజయుడు, నిఘంటుడు. ఈ ఆరుగురూ ఆ రోజుల్లో ఎక్కువ మంది శిష్యగణాన్ని కల్గిన గురువులు. వీళ్ళలో సంజయుడు బేలద్ధ గణానికి చెందినవాడు. ఆ గణానికి చెందిన విద్యార్థులు ఆయన దగ్గర చదువుకునే వారని అర్థం కావచ్చు. వారికి ఆయన గురువు, గణనాయకుడుగా కూడా వుంటాడు. అందుకని గణ అధికారాన్ని తన శిష్యులతో పంచుకోవడానికి సంజయుడు సిద్ధపడ్డాడు.

సంఘి, గణి, గణాచార్య ఇలాంటి పేర్లతో గణనాయకుడు లేదా గురువును పిలిచేవారు. గురువుని "సత్త" అనేవారు. ప్రతిగురువూ తనదైన ధర్మాన్ని, (దమ్మం) బోధించేవాడు. బ్రహ్మచర్యాన్ని "గురుసత్త" బోధిస్తే గణంలోని శిష్యులంతా దాన్ని పాటించాల్సిందే. "సంజయే పరిబ్బాజకె బ్రహ్మచరియం చరితమ్" సంజయుడనే పరివ్రాజకుడు బ్రహ్మచర్యాన్ని బోధించాడు..... అని వుంది "సామాన్నా ఫల సుత్త" గ్రంథంలో! ఈ స్థితిలో వున్న వ్యవస్థను బుద్ధుడు సంఘాలుగా మార్పుచేశాడు.

"అద్ధావుసో మహాశమనొ శాక్యపుత్తో శఖ్యకులాపబ్బజితో తాహం భగవంతం ఊద్దీశ్మ పజ్బాజితో-" అని మహావగ్గ బౌద్ధ గ్రంథంలోని వాక్యంలో అస్సజీ అనే భిక్షువు తాను మహాశమనకుడు, శాక్యపుత్రుడు, శాక్యకుల ప్రభావితుడు అయిన బుద్ధభగవానుని నుంచి బౌద్ధాన్ని స్వీకరించినట్లు చెప్పుకొన్నాడు. తొలి నాళ్ళలో బుద్ధుడే స్వయంగా దీక్షనిచ్చి శిష్యుల్ని ప్రోత్సహించాడు.

## మరణించాక బుద్ధుడు ఏమౌతాడు ?

జిజ్ఞాసువులే బౌద్ధంలో చేరారు. ఎందుకు - ఏమిటీ అనే తార్కికత బౌద్ధానికి మూలం. మనిషి మరణించాక ఏమౌతాడనే విషయంలో ఏ రెండు మతాల మధ్య ఏకాభిప్రాయం లేదు. బుద్ధుడు అభిప్రాయం ఏమిటో ఈ విషయమై ఎవరికీ తెలియదు. ఆయనెప్పుడూ దీని గురించి ఎవరికీ - చెప్పినట్టు అంతవరకూ తెలియదు. "మాలంక్య పుత్త ఉత్తియ వచ్చగొట్ట" అనే భిక్షువుకి జిజ్ఞాస ఆగలేదు. స్వయంగా బుద్ధుడి దగ్గరకే వెళ్ళి నేరుగా అడిగాడు. ఆ అడగడం కూడా "మరణించాక మీ గతి ఏమిటీ?" అని అడిగేశాడు.

బుద్ధుడు ఈ ప్రశ్నని ప్రోత్సహించలేదు. దానికి సూటిగా సమాధానం ఇవ్వలేదు. నశించిపోవడం సృష్టి ధర్మం. శరీరంకూడా అంతే ! నశించిపోతుంది..... దాని గురించి అంతకన్నా చర్చించవలసిన అవసరం లేదని ఆయన అభిప్రాయం!

నిస్సంగత్వానికీ, నిష్కామ కర్మకీ, దుఃఖ నిరసనకీ, ప్రపంచశాంతికి, సామాజిక సమానత్వానికి, అభివృద్ధికీ నిరోధకంగా వుంటాయి కాబట్టి, తనకు తెలిసినా చాలా విషయాల గురించి బుద్ధుడు వివరించడానికి ప్రయత్నించలేదు. ప్రత్యేకంగా నిర్వచించడానికి వీల్లేని అంశాల్ని ఉద్దేశపూర్వకంగానే బుద్ధుడు ఉపేక్షించాడు.

మరణించిన తర్వాత తథాగతుడి గతి ఏమిటీ అనే ప్రశ్న కూడా ఇలాంటిదే. ఇప్పుడది అంత తీవ్రంగా ఆలోచించవలసిన విషయమా .....? అలాంటి విషయాల గురించి అసలు ఆలోచించడమే నిష్ఫలం..... అంటాడు బుద్ధుడు.

## బుద్ధుని నిర్వాణం



వైశాలిలో వుండగా బుద్ధునికి చాలా తీవ్రమైన జబ్బు చేసింది. వైద్యులు అప్పటి కప్పుడు కొంత ఉపశమన చికిత్సలు చేశారు. కానీ, 3 నెలలకు మించి బతకకపోవచ్చని భావించారు. వార్త తెలిసి మొత్తం బౌద్ధ సంఘాలు విచారంలో మునిగాయి.

కొంచెం కోలుకున్నాక భండ్ర గ్రామం, హస్తి గ్రామం, అంచ గ్రామం, జంబూ గ్రామం, భోగానగరం ఇవన్నీ వెళ్ళి చివరికి "పాపా" గ్రామాన్ని సందర్శించాడు బుద్ధుడు.

అక్కడ చుండుడనే కుమ్మరికి చెందిన మామిడి తోటలో బసచేశాడు. చుండుడు బుద్ధుడి గౌరవార్థం ఆతిథ్యం ఇచ్చాడు. ఆయన ఆతిథ్యంలో "సూకర మద్దవ" అనే ఆహారపదార్థాన్ని వడ్డించాడు.

1. సూకర మద్దవం అంటే పంది మాంసం, కొవ్వు కలిపి తయారు చేసిన ఆహారపదార్థం అని కొందరు వ్యాఖ్యాతలు చెప్తారు.
2. పందులు కుళ్ళగించిన పుట్టగొడుగులు కావచ్చని మరికొందరంటారు.
3. ఇవి రెండూ కాకుండా మరొక అవకాశం కూడా వుంది. కంద దుంపని కూడా సూకరం అనే అంటారు. కంద కూర లాంటిది ఏదైనా అయివుండవచ్చు.

"సూకర మద్దవం" తినగానే బుద్ధునికి తీవ్రంగా విరేచనాలు అయ్యాయి. ఈ మూడింటిలో దేన్నితిన్నా, విరేచనాలు అయ్యే అవకాశం వుంది. పైగా వయోవృద్ధుడు,

జబ్బుపడి లేచినవాడు, ప్రయాణ బడలికచే వున్నవాడు కాబట్టి మరింతగా ఇబ్బంది పెట్టి వుంటుంది ఈ ఆహార పదార్థం.

విరేచనాలలో రక్తం కూడా పడడం మొదలయ్యింది. తీవ్రమైన కడుపునొప్పికూడా వచ్చింది. బుద్ధుడు వీటిని భరిస్తూనే తమాయించుకొని, తన ప్రయాణం కొనసాగించాడు. కుసినార వైపు ప్రయాణం అయ్యాడు.

అక్కడ కాకుత్స నది వుంది. పరిశుభ్రమైన నీరు త్రాగడానికి దొరుకుతుందను కొనేంతలో 500 ఎడ్ల బండ్లు ఈ నదిని దాటడం మొదలుపెట్టేసరికి నీరంతా మురికి అయ్యింది. కొంతసేపటివరకూ ఆగి, మురికి తేరుకున్నాక స్వచ్ఛమైన నీటిని సంపాదించాడు ఆనందుడు.

బుద్ధుడు తనకు అవసానకాలం సమీపించిందని భావించాడు. చుందుడు పెట్టింది తిన్నందువలన ఇలా జరిగిందని అతన్ని నిందించడం తగదని చెప్పాడు. చుందుడు పెట్టిందే తనకు ఆఖరి భోజనంగా ప్రకటించాడు. ఆ విధంగా అది పవిత్ర భోజనం.

కొంత తడవ విశ్రాంతి తీసుకున్నాక తిరిగి ప్రయాణం మొదలయ్యింది. కుసినారలో శాలి వృక్షాల తోటలో విశ్రాంతి తీసుకున్నాడు బుద్ధుడు.

ఉత్తర ముఖంగా తలను వుంచేలా మంచం వేయమని కోరాడు. "నేను తక్షణం విశ్రమించాలి" అన్నాడు. తను నిష్క్రమించే సమయం ఆసన్నం అయ్యిందని స్పష్టీకరించాడు. ఉపవానుడు విసురుతున్నాడు, ఈలోగా సుభద్రుడు అనే భిక్షువు వస్తే అతనికి ఉపదేశం చేశాడు బుద్ధుడు.

తనని చూడవచ్చిన వారందరినీ ఉద్దేశించి ఒకటే సందేశం ఇచ్చాడు, అదే ఆఖరు సందేశం - "నాశనం చెందే స్వభావం కల్గిన స్థితుల సమ్మేళనమే ఈ సృష్టి" [Subject to decay are all compounded things]. "ఒకస్థితి సర్వదా నాశనం చెందుతూ ఎప్పటికప్పుడు కొత్తగా వేరొకటి ఉత్పన్నమౌతూ వుంటుంది. - అన్నాడు బుద్ధుడు.

ఆనందుడికి దుఃఖం ఆగడంలేదు. లోపల్లోపలే కుమిలిపోసాగాడు. గమనించాడు బుద్ధుడు. తమ సన్నిహితులు మరణించారని జనులు మన దగ్గరకు వచ్చినప్పుడు మనం ఎంతమందిని సముదాయించి పంపించలేదూ..... జీవితంలో కలయికల గురించి, విడిపోవడం గురించి ఉపదేశాలు చెయ్యలేదూ..... మూర్ఖుడు ఆత్మని నిర్మించాలని ఊహలు చేస్తాడు. జ్ఞానవంతుడు ఆ నిర్మాణాలకు తగిన నేలలేదని గ్రహిస్తాడు - అని ఊరడించాడు ఆనందుని బుద్ధుడు.

"మీరు లేని రోజున ఈ బోధలు మాకెవరు చెయ్యగలరు?" అనడిగాడు దుఃఖంగా ఆనందుడు.

"బుద్ధులు జన్మిస్తూనే వుంటారు" అన్నాడు తథాగతుడు. తనను చూడ వచ్చిన వారిని నవ్వుతూ పలకరించాడు. అందరినీ తమతమ పనులకు తిరిగి వెళ్ళిపొమ్మని కోరాడు. "మీకేమైనా సందేహాలుంటే ఇదే సమయం. అడిగి తెలుసుకోండి–" అన్నాడు వచ్చినవారితో ! ఎవరూ ఏమీ అడగలేకపోయారు. "సృష్టి అస్తిత్వంలోనే నాశనం అనే గుణం అంతర్గతంగా వుంది. కానీ, సత్యం ఒక్కటే నాశనం లేనిది. దాన్ని నమ్ముకోండి" – అని మళ్ళీ చెప్పాడాయన.

బహుశా ఇవే ఆయన ఆఖరి మాటలు కావచ్చు ! అనంతమైన వేదనని అనుభవిస్తూనే, ఊపిరి బిగబట్టుకొని, ప్రాణాలు ఉగ్గదీసుకొని సందేశాలు ఇస్తున్నాడు బుద్ధదేవుడు.

సందేహాలు ఎవరూ అడగలేకపోవడంతో బుద్ధుడు ధ్యానంలోకి వెళ్లిపోయాడు. తిరిగి మెలకువలోకి రాలేదు. తథాగతుడు నిర్వాణం చెందినట్లు ప్రకటించారు.

## క్రీస్తుపూర్వం 6వ శతాబ్దిలో తాత్త్విక ప్రపంచ విప్లవం

అవ్యక్తంలోంచి లేదా మనకి తెలియని ఏదో ఒక దానిలోంచి ఈ సృష్టి పుట్టిందనే వాదానికీ, ఎలా పుట్టిందో తెలుసుకోవాలనే తపనకీ మధ్య జరిగిన సంఘర్షణలోంచి అనేక తాత్త్విక విప్లవాలు ప్రపంచవ్యాప్తంగా ఏర్పడ్డాయి. క్రీస్తుకు పూర్వం 5 - 6 శతాబ్దాల కాలంలో ఈ తాత్త్విక విప్లవం ఒక రూపాన్ని సంతరించుకొంది. ఆ రూపంలోంచి ఏర్పడ్డ తత్త్వాలు ఇవి కొన్ని :

1. **క్రీ.పూ. 6వ శతాబ్ది : ఓర్ఫిజం :** – పురాణ గ్రీకు కవి ఓర్ఫియస్ ప్రవచించిన మతం. సృష్టికి కాలం (కోనస్) కారణంగా చెప్పినవాడు.
2. **క్రీ.పూ. 599 - 527** : మహావీరుడు – అహింసని ప్రబోధించాడు. అనుమాన ప్రమాణాన్ని అనుసరించాడు. జ్ఞానాన్ని పదిమందికి పంచాలన్నాడు.
3. **క్రీ.పూ. 563 - 483** : బుద్ధుడు–వ్యక్తిగతంగా జ్ఞానసిద్ధిని పొందాలని ప్రబోధించాడు.
4. **క్రీ.పూ. 551 - 479** : చైనా దేశపు తత్త్వవేత్త కాన్ఫూసియస్ ప్రాచీన సంస్కృతిని విశ్లేషించి, నైతిక భావాల్ని వాటికి జోడించడం ద్వారా జ్ఞానాన్ని పొందాలని బోధించాడు. విశాల హృదయం, సత్ప్రవర్తనలు సంస్కృతికి తోడుకావాలని అప్పుడే ఉన్నత సమాజం ఏర్పడుతుందని ఆశించాడు. తన మనస్సును, తన బాధను,

బాధను సహించలేని తన స్థితినీ తెలుసు కొంటే, స్వర్గాన్ని తెలుసుకున్నట్టే నంటుంది ఈ మతం. కన్ఫూషియానిజం అంటారు ఈ మతాన్ని.

5. **క్రీ.పూ. 523 :** జొరాస్టర్ అనే ప్రవర్తకుడు మజ్దామతాన్ని ఇరాన్‌లో ప్రవేశపెట్టాడు. ఖిమెనిడే రాజు పాలనాకాలం అది. "మాగీ" మతం వుండేది అప్పట్లో. దానికి వ్యతిరేకంగా అధర్వణ వేదం తరహాలో యజ్ఞయాగాల సంస్కృతిని ఇరాన్‌లో ప్రవేశపెట్టాడు. ఋగ్వేదంలోని "మిత్రా" సంస్కృతికి ఇరాన్ మజ్దాయిజం కొనసాగింపని అంటారు.

6. **క్రీ.పూ. 545 :** గ్రీసుదేశపు థేల్సిస్ : సూర్యగ్రహణానికి కారణాన్ని కనుగొన్నాడు. రాహుకేతువుల కథలు వట్టి బూటకం అని కొట్టేశాడు. జ్ఞానాన్ని పరిశోధన ద్వారా సాధించాలంటాడు. గ్రహగతుల కారణంగా అయస్కాంతత్వం ఏర్పడు తోందన్నాడు.

7. **క్రీ.పూ. 520 :** సుశ్రుతుడు శస్త్రచికిత్సకు పితామహుడు. కంటి శుక్లాల ఆపరేషన్ మొదటిసారిగా వివరించిన వాడు.

8. **క్రీ.పూ. 470 - 399 :** సోక్రటీస్.

9. **క్రీ.పూ. 427 - 327 :** ప్లేటో.

10. **క్రీ.పూ. 384 - 322 :** అరిస్టాటిల్.

11. **క్రీ.పూ. 3వ శతాబ్ది :** జుడాయిజం యూదులలో అవతరించింది. మోజస్ మతం అని కూడా పిలుస్తారు. ఆ తర్వాత ఇందులో ఎక్కువభాగం క్రైస్తవంలోనూ, కొంతభాగం ఇస్లాంలోనూ కలిసిపోయింది.

## బౌద్ధాన్ని రూపొందించిన సామాజిక పరిస్థితులు

బుద్ధుడు జ్ఞానోదయం పొంది ఈ ప్రపంచాన్ని జ్ఞాన దృష్టితో చూసేనాటికి భారతీయ సామాజిక వ్యవస్థలో "పాత"ని తోసిరాజని కొత్త సిద్ధాంతాలు పుట్టుకొస్తున్నాయి. వేదాలకు వ్యతిరేకమైన ఒక భావ విప్లవం నడుస్తూన్నకాలం అది. వీటి ప్రభావంలోంచి బుద్ధుడు ఒక మధ్యే మార్గాన్ని ప్రతిపాదించాడు. దుఃఖాన్ని పోగొట్టే ధర్మమార్గాన్ని కనుగొన డమే బుద్ధుడు పొందిన జ్ఞానోదయం. అందుకే ఆయన బుద్ధదేవుడు అయ్యాడు.

ఆనాటి సామాజిక పరిస్థితులు ఇవి :

1. ఆర్థిక పరిస్థితుల్లో మార్పులు ఏర్పడ్డాయి. వర్తక వాణిజ్యాలు విస్తరించిన కారణంగా స్థితిమంతులు పెరిగారు. ప్రైవేట్ ఆస్థులు, వ్యక్తిగత సంపద పెరిగింది. తెగలుగా జీవించిన వ్యవస్థలోంచి వ్యక్తులుగా జీవిచే వ్యవస్థగా సమాజం పరిణమించసాగింది.

2. ఒక వైపు వ్యవసాయం ఇంకొకవైపు వ్యాపారం ప్రధాన వృత్తులయ్యాయి.
3. ఎవరి భూములు వారివి. ఎవరి పశువులు వారివి. ఎవరి పంటలు వారివి. ఎవరి సంపద వారిది అనుకునే వ్యవస్థ కొత్తగా ఏర్పడింది.
4. క్షత్రియులు పాలనాపరమైన వ్యవహారాలకు అదనంగా పంటభూముల్ని స్వంతం చేసుకొని భూస్వాములై వ్యవసాయం ప్రారంభించారు. వైశ్యులు ఉత్పత్తులు మానేసి వర్తక వాణిజ్యాలలో స్థిరపడ్డారు. శూద్రులు కేవలం శ్రామికులు (Labourers)గా మిగిలి పోయారు. తక్కిన వారు "బానిస"లై పోయారు. వారికి సామాజిక వ్యవస్థలో భాగస్వామ్యం లేదు. "వట్టిబానిస" ..... లంతే !
5. చిన్నచిన్న గణతంత్ర రాజ్యాలలోంచి యోధులు మహాసామ్రాజ్యాలు నిర్మించాలనే తపనతో బయల్దేరసాగారు. గ్రీకుల ప్రభావం బాగా ఏర్పడింది.

ఈ పరిస్థితుల్లో జైనమతం మొట్టమొదటగా మనుషులందరి సమానత్వాన్ని ప్రతిపా దించింది. యజ్ఞయాగాలను నిరసించింది. యుద్ధాలు లేని శాంతియుత సమాజాన్ని ఆశించింది. "జీవహింస" మానడాన్ని కఠినతర నియమంగా చేసింది.

ఇంక బౌద్ధానికి వస్తే -

గౌతమ బుద్ధుడు క్షత్రియుడు. వ్యవసాయదారులైన స్థితి మంతుల కుటుంబం. చిన్న గణతంత్ర వ్యవస్థకు ఆధిపత్యం ఉన్న కుటుంబం అది. ఆయన ఎన్నడూ బ్రాహ్మణ గురువు పాత్ర పోషించలేదు.

సామాజిక సుస్థిరతకు, ప్రపంచశాంతికి వ్యక్తి ఆలోచనలో మార్పురావాలిగాని ఆత్మ-శరీరం-మోక్షాల గురించి ఆలోచించినందువలన ప్రయోజనం లేదని ఆత్మవాదాల్ని పూర్తిగా పక్కన పెట్టి సమాజంలో మనిషి గురించి ఆలోచించమని ప్రబోధించాడు.

వైదిక ధర్మాలలో సామాన్యమానవుడి సంక్షేమం ప్రధానాంశం కాదు. ఆధ్యాత్మికత పేరుతో ఆడంబరాలు, యజ్ఞాలు, బలులు ..... ఇవన్ని వాటిని నిర్వర్తించే వారికి మరుజన్మలేకుండా చేస్తాయని, స్వర్గాధిపత్యాన్ని ఇస్తాయనీ ప్రజల్ని నమ్మించ గలిగాయి. దేవతలంతటివారు యజ్ఞం చేస్తే లొంగిపోతారనే భావన కల్గించారు.

బుద్ధుని కాలానికి "తమసోమా జ్యోతిర్గమయ" అనే ఆలోచన మొదలయ్యింది. మాండూకోపనిషత్తు యజ్ఞాల వలన శాశ్వతసుఖం లభ్యం కాదని చాటింది. ఇవన్నీ బౌద్ధం ఏర్పడటానికి పూర్వరంగం. సృష్టి అవ్యక్తం నుంచి ఏర్పడిందని చెప్పిన సాంఖ్యశాస్త్రం బుద్ధుని బాగా ఆలోచింపచేసింది. కపిల మహాముని పేరుతోనే ఏర్పడిన కపిల వస్తు నగరంలో బుద్ధుడు పుట్టాడు. సాంఖ్యశాస్త్ర ప్రభావం బుద్ధునిమీద బహుశా మొదటినుంచీ ఉండి ఉండాలి.

# వ్రేళ్ళూనుకున్న కుల వ్యవస్థ



మౌర్యుల వ్యక్తిత్వం విచిత్రమైంది. ఒక లక్ష్యంతో రాజ్య స్థాపన చేశారు. ఒక అంకితభావంతో పాలనా విధానాలు పాటించారు.

రాజ్యాన్ని స్థాపించిన చంద్రగుప్తుడు తన జీవిత చరమ కాలంలో జైనుడయ్యాడు. సింహాసనాన్ని వదిలేసి, మామూలు శ్రమణకుడిలా తిరిగాడు. ఉపవాస మార్గంలో క్రమేణా క్షీణించి చివరికి జైనుల మార్గంలో మరణించాడు.

వైశ్యుడిగా మూడవ స్థాయి వర్గానికి చెందిన వాడు ఈ చంద్రగుప్తుడు. వైదిక చాతుర్వర్ణ వ్యవస్థ ప్రకారం బ్రాహ్మణ, క్షత్రియుల తర్వాతే వైశ్యుడు వస్తాడు. జైనం స్వీకరించడం ద్వారా ఈ తక్కువ స్థాయి అనే భావనలోంచి చంద్రగుప్తుడు బైటపడినట్లు రొమిల్లా థాపర్ "అశోకా అండ్ ద డిక్లయిన్ ఆఫ్ మౌర్యాస్" గ్రంథంలో వ్యాఖ్యానించారు.

జనసామాన్యం దృష్టిలో ఇది గొప్ప విషయమే! "తక్కువ వర్ణం" లోపాన్ని అధిగమించ డానికి అత్యంత కఠినతరమైన నియమ నిష్ఠలతో కూడిన జైనాన్ని స్వీకరించి రాజ్య త్యాగం చేసిన ఆ మహాయోధుడి పట్ల ప్రజలకు సానుభూతి, గౌరవం తప్పకుండా కలుగుతాయి..... చాతుర్వర్ణ వ్యవస్థను కోరుకునే కుల తత్త్వవాదులకు తప్ప! క్రీస్తు పూర్వం 3వ శతాబ్ది నాటి విషయం ఇది.

చంద్రగుప్తుడి కొడుకు బిందుసారుడు కూడా జైనం పట్ల సానుభూతిపరుడిగానే వున్నా, బౌద్ధులు, గ్రీసులు కూడా పాటలీపుత్రంలో ప్రముఖపాత్రే నిర్వర్తించారు.

అది బ్రాహ్మణాలు బాగా అభివృద్ధి చెందినకాలం. బ్రాహ్మణ ఋషుల ఆధిపత్యాన్ని కాదనలేకే, మూడవస్థాయి నుంచి బైటపడడం కోసం జైనాన్ని వ్యక్తిగతంగా స్వీకరించాడు చంద్రగుప్తుడు. కాబట్టి బ్రాహ్మణ వ్యవస్థ ప్రభావం అమితంగా వున్నదనే చెప్పాలి.

బౌద్ధ భిక్షువుల్ని అజీవకులనీ, జైన శ్రమణకుల్ని నిగ్రంథులనీ పిలిచారు.

బ్రాహ్మణాలు ప్రబోధించిన అరణ్యవాసం, సన్యాసాలు, జైనం బోధించిన శ్రమణక జీవనం, ఉపవాసం, జీవకారుణ్యం వాటికి భిన్నంగా ధర్మమార్గాన్ని జ్ఞాన మార్గాన్ని బుద్ధుడు ప్రతిపాదించాడు. బుద్ధుడిది మధ్యేమార్గం (Middle Way)..... వాటన్నింటి ప్రభావం బిందుసారుడి పాలన మీద వుంది. అశోకుడు పుట్టినపుడు అజీవకులు (బౌద్ధులు) అతడు భావిసామ్రాట్ కానున్నాడని జోస్యం చెప్పినట్లు చరిత్రకారులు భావిస్తారు.

తాతగారు చంద్రగుప్తుడు యుద్ధాలు మాని జైనమార్గాన్ని స్వీకరిస్తే మనుమడు అశోకుడు బౌద్ధ మార్గాన్ని అనుసరించాడు.

అశోకుడి కాలంలో వర్తక వాణిజ్యవేత్తలు, ధనికులు ఎక్కువగా బౌద్ధులయ్యారు. బ్రాహ్మణాధిపత్యానికి వ్యతిరేకంగా జరిగిన పరిణామాలే ఇవి. బుద్ధుడు కూడా జన్మతః క్షత్రియుడే గాని, బ్రాహ్మణ గురువుకాదు. ఒక క్షత్రియుడు బ్రాహ్మణ గురువు స్థాయిని పొందడానికి విశ్వామిత్రుడు వేదకాలంలో ఎన్ని కష్టనిష్ఠురాలు అనుభవించాడో బుద్ధుడూ వాటిని అనుభవించే ఉంటాడు.

అయితే, బౌద్ధ ధర్మాలలో ఎక్కడా, ఈ విధమైన కులతత్త్వ ధోరణులు కన్పించవు. సమాజాన్ని నాలుగు వర్ణాలుగా విభజించడాన్ని, మిగిలిన బానిస వర్ణాలకు సమాజంలో చోటులేకుండా చేయడాన్ని బుద్ధుడు వ్యతిరేకించడమే మనకి కన్పిస్తుంది.

ఇలా జరుగుతుందనే, వైశ్యులకు కూడా "ద్విజత్వం" ఇచ్చి, బ్రాహ్మణ క్షత్రియులతో సమాన హోదా కల్పించారు బ్రాహ్మణులు. కానీ, "సామాజిక సమానత్వం' ' (సోషల్ ఈక్వాలిటీ) అనే బౌద్ధ ధర్మం పట్ల, వైశ్యులు శూద్రులు వీరేకాకుండా, ఈ సామాజిక వర్గంలో చోటు దొరకని దళిత ప్రజలు బౌద్ధం వైపు ఎక్కువగా మొగ్గుచూపారు. ఇది కీలకమైన సామాజిక పరిణామం. ఒక విధంగా రాజకీయ పరిణామం కూడా!

## ధర్మం శరణం గచ్ఛామి



జన్మతః కులాలుగా మనుషుల్ని విభజించడాన్ని బుద్ధుడు వ్యతిరేకించాడు. అందు కోసం వైదిక ధర్మాల మీద, చాతుర్వర్ణ వ్యవస్థ మీద ఆయన దాడి చేయవలసి వచ్చింది.

బౌద్ధం దాడిని తట్టుకోవడానికి "చాతుర్వర్ణం మయాసృష్టం" అని భగవద్గీతలో భగవంతుడి చేత ఈ "కులవ్యవస్థని నేనే సృష్టించాను" అని చెప్పించారు. కులవ్యవస్థకి రక్షక భటులుగా వ్యవహరిస్తున్న బ్రాహ్మణ వ్యవస్థమీద కూడా బుద్ధుడు తిరుగుబాటు చెయ్యవలసి వచ్చింది. సమాజం అభ్యుదయం చెందాలంటే నైతిక జాగృతి అవసరంని భావించాడు. బౌద్ధ భిక్షువులకే కాదు – మొత్తం సమాజానికే ఐదు నైతిక సూత్రాలను ప్రబోధించాడు. "పంచశీల"లుగా అవి ప్రసిద్ధం.

సాంఘిక దృక్పథం సామాజిక స్పృహని మేధావుల్లో రగిలించడం బుద్ధుడి లక్ష్యం. మానవత్వాన్ని ప్రబోధించుకొంటూ బౌద్ధ భిక్షువులు దేశాటన చేయడం ప్రారంభించారు. ప్రజా సంక్షేమమం కోసం ప్రభువులు విధిగా పాటించవలసిన సామాజిక సేవా ధర్మాల్ని బౌద్ధులు బాగా ప్రబోధంచేశారు. వైదిక ధర్మావలంబకుడైనా, యజ్ఞాలు చేసి సోమయాజులుగా మారినా, పంచశీలాల్ని పాటించడానికి, పాలనా వ్యవహారాలలో బుద్ధుని విధానాల్ని ప్రవేశపెట్టడానికి రాజులకు ఇబ్బంది కలగలేదు. ఆ విధంగా బౌద్ధులు పాలనా వ్యవస్థ మీద తమ దృష్టిని కేంద్రీకరించారు.

శాంతిదేవుడు, భావవివేకుడు, ధర్మకీర్తి, అశ్వఘోషుడు, నాగార్జునుడు, ఆర్య దేవుడు, బుద్ధఘోషుడు వీళ్ళ రచనల్లో సామాజిక దృష్టి కోణం ఆవిష్కృతమౌతుంది.

బుద్ధుని ధర్మ చక్రాన్ని తన పాలనా విధానానికి సంకేతంగా పెట్టుకొని రాజ్యం అంతా బౌద్ధ స్తూపాలు నిర్మించి వాటిపైన ధర్మచక్రాల్ని సృష్టించాడు. అశోకుడి ధర్మాలు సామాజిక వర్గాల-మధ్య సమన్వయం సాధించడానికి ఉద్దేశించినవే! "ధర్మం శరణం గచ్ఛామి" బౌద్ధుల నినాదం కదా! ఏది ధర్మం అనేదే అసలు ప్రశ్న!

## బుద్ధుడు సూచించిన దుఃఖనివారణ మార్గాలు



బుద్ధుడి కాలంలో 62 శ్రమణ పంథాలు వుండేవి. ఇవన్నీ కేవలం ఆత్మగురించి చర్చించే వాదాలే! బుద్ధుడు ఈ ఆత్మ గురించి ఇంచుమించుగా చర్చించడం వదిలేశాడు. శరీరం - ఆత్మలు నిత్యమా అనిత్యమా అనే ప్రశ్నల వలన మనిషికి ఒరిగేదేమీ లేదని గట్టిగా వాదించాడు.

జడత్వం, సంస్పందన, చైతన్యం, సంస్కారం, విజ్ఞానం ..... ఇవన్నీ కలిస్తేనే "ఆత్మ" అని బుద్ధుడు ప్రతిపాదించాడు.

వైదిక ధర్మాల్ని, జైనధర్మాల్ని సమన్వయ పరిచి, ఒక మధ్యే మార్గాన్ని ప్రతిపాదించడం బౌద్ధ ధర్మాలలోని విశేషం.

దుఃఖం అనేది ప్రపంచం అంతా నిండి వుంది. కానీ, దానికి కారణం "ఇది" అనే విషయంలోనే అభిప్రాయ భేదాలన్నీ!

దుఃఖానికి పూర్వ జన్మకృత పాపం కారణం అని, కొందరు.....!

జడ ప్రకృతి నుంచి దుఃఖం పుట్టిందని ఇంకొందరు.....!!

"దుఃఖం ఆకస్మికం" అని మరొకరు.....!!!

ఈ దుఃఖం నాశనం కావాలంటే ఏం చెయ్యాలి..... ఎక్కువ మంది "తపస్సు' ' ద్వారా ఆత్మని దుఃఖాన్నించి రక్షించవచ్చని భావించారు. మళ్ళీ తపోవిధానంలో అనేక అభిప్రాయభేదాలు ఏర్పడ్డాయి.

కానీ "మానవుడి తృష్ణ" అనేది దుఃఖానికి హేతువు అని బుద్ధుడి సిద్ధాంతం. ఒకడి "తృష్ణ" ఎందరి దుఃఖానికో కారణం కావడం మనం చూస్తున్నదే! మనిషిని తృష్ణలోంచి విముక్తుల్ని చెయ్యాలి. ఇందుకు బుద్ధుడు అష్టాంగిక మార్గాన్ని ప్రతిపాదించాడు.

1. సమ్యక్ దృష్టి
2. సమ్యక్ సంకల్పం
3. సమ్యక్ వాక్కు
4. సమ్యక్ కర్మ
5. సమ్యక్ జీవనం
6. సమ్యక్ వ్యాయామం
7. సమ్యక్ స్మృతి
8. సమ్యక్ సమాధి

## మూడు శరణాలు

**"బుద్ధం శరణం గచ్ఛామి**

**ధర్మం శరణం గచ్ఛామి**

**సంఘం శరణం గచ్ఛామి"** అనే త్రిశరణ సిద్ధాంతం క్రీస్తు పూర్వం 3వ శతాబ్ది నుంచి ప్రారంభం అయ్యిందని పరిశోధకులంటారు. బోధించినవాడు బుద్ధుడే అయినా, ప్రధాన నినాదాలుగా తర్వాతి కాలంలో ఏర్పడి ఉంటాయి.

"వినయ పిటిక" అనే బౌద్ధ గ్రంథంలో బౌద్ధ ఉపాసకుల వివరాలు చాలా వున్నాయి.

"పథమమ్ ఉపాసకో" అంటే, మొట్టమొదటి ఉపాసకుడు గహపతి శెర్థి అనివుంది. ఈయన త్రిశరణాల్ని స్వీకరించిన మొదటి ఉపాసకుడన్నమాట!

అప్పటి వరకూ శిష్యులుగా చేరిన వారిలో బ్రాహ్మణ ఋషులుగా కొంతకాలం తపోసాధన చేసినవారు సహజంగానే బౌద్ధ సంఘాలకు నాయకులయ్యారు.

వీరు బ్రాహ్మణాలలో చెప్తున్న విషయాలను బాగా సంస్కరించి బౌద్ధ ధర్మాలుగా రూపొందిం చడంలో సహకరించారు! బౌద్ధ సంఘాలనేవి కొత్త విషయం ఏమీ కాదని, ఆధునికీకరించబడిన బ్రాహ్మణాలేననీ ఒక వాదన కూడా ఉంది.

పాణిని సూత్రాలు గానీ, గౌతమ ధర్మసూత్రాలుగానీ మోక్ష సన్యాసాలకు ప్రాధాన్యత నివ్వకుండా జ్ఞాన సిద్ధిని నొక్కిచెప్పాయి.

భిక్షువులు ఒక సంఘంగా ఏర్పడడం అనేది గ్రీకు పైథాగరస్ వగైరా సిద్ధాంత కర్తల ప్రభావాన కావచ్చుననే ఒక ఆలోచన వుంది. రిపబ్లిక్ తరహాలో మనుషులు సంఘాలుగా జీవించడం వేరు. కానీ, ఒక మత ధర్మానికి చెందిన వ్యక్తులు "సంఘం"గా ఏర్పడడం వేరు. అసోసియేషన్, యూనియన్, క్లబ్ అనే అర్థాలలోనే ఈ సంఘాలు ఏర్పడ్డాయి. వీటి రూపశిల్పి బుద్ధుడు.

## భౌతికవాదం పునాదులమీద బౌద్ధం

ఉపనిషత్తులు ఏర్పడే కాలానికి హేతువాదం ప్రబలడం ఒక యాదృచ్ఛిక పరిణామం ఎంతమాత్రమూ కాదు. భౌతిక వాదానికి బలమైన పునాదులు ఏర్పడటానికి ఆనాటి సామాజిక అంశాలే కారణం.

1. కులవ్యవస్థ ఈ నాటికన్నా అత్యధికంగా వున్నది.
2. ఆర్థిక వ్యవస్థ అనూహ్యమైన మార్పుల్ని పొందింది.
3. పట్టణాలు కొత్తగా ఏర్పడ్డాయి. నాగరకత పెరిగింది.
4. ఉత్పత్తి పెరిగింది. ఉత్పత్తిదారులు కొత్త ధనవంతులు అయ్యారు.
5. ఉత్పత్తిదారులు సంఘాలు (traders' guild)గా ఏర్పడ్డారు.
6. వ్యవసాయంకూడా బాగా పెరిగింది. భూమిమీద హక్కు ఏర్పడసాగింది.
7. వర్తక వాణిజ్యాలు ప్రముఖస్థానాన్ని ఆక్రమించాయి. డబ్బుసంపాదించే దేశంగా వుంది ఆనాటి భారతదేశం ! ఒకవిధమైన పెట్టుబడిదారీ సమాజం లాంటిదే అది!
8. పెట్టుబడిదారీ సమాజంలో "జన్మతః ఉన్నత స్థాయి"ని ఇచ్చే వర్ణవ్యవస్థ కొత్త ధనవంతులకు ఇబ్బంది కారణం అవుతుంది. జన్మతః తక్కువ స్థాయి నుండి ఎక్కువ ధనికులైన వారికి ఇది ఇబ్బందినే కల్గిస్తుంది! అందుకని, వర్ణవ్యవస్థకు భిన్నమైన ధర్మాలు ప్రబలిన ప్రతిసారీ కొత్త ధనికులు సానుకూలంగా స్పందించేవారు.
9. నూతన భాషా స్రవంతి మొదలయ్యింది.

బుద్ధుడు జ్ఞానోదయం పొందేనాటికి భావ విప్లవాన్ని సాధించిన ఐదుగురు మహర్షులు ప్రముఖంగా కన్పిస్తారు. పూర్ణకాశ్యపుడు, కాత్యాయనుడు, అజిత కంబకేళి, సంజయుడు, గోశాలుడు - ఈ ఐదుగురిని భావ విప్లవకారులనేవారు.

పూర్ణ కశ్యపుడు, పృధ్వి, జలం, తేజస్సు, వాయువు ఈ నాలుగు పంచమహా భూతాలనీ, సుఖం, దుఃఖం, ఆత్మ అనే మూడు కూడా వీటితో కలిసి మొత్తం ఏడు మహా భూతాలుగా వర్గీకరించాడు. శూన్యం నుంచి ఏదీ ఉద్భవించదని ప్రకటించాడు. బుద్ధుని శిష్యునిగామారి బౌద్ధధర్మ ప్రచారంలో ముఖ్యపాత్ర పోషించాడు.

సంజయుడు సందేహవాది. ఆత్మ జ్ఞానం అలభ్యం అని అతని మతం. గోశాలుడు కర్మ సిద్ధాంతాన్ని కాదన్నాడు. వీళ్ళంతా భౌతిక విప్లవానికి దోహదపడ్డావాళ్ళే. వీరిలో ఎక్కువ మంది బుద్ధుని మార్గానికే వచ్చారు.

అదేకాలంలో "లోకాయత వాదం" కూడా ఏర్పడింది. సుఖానికి ప్రాముఖ్యత నిచ్చే ఈ భౌతికవాదం క్రమేణా కాపాలిక మతానికి చేరువయ్యిందని అంటారు. కాపాలికులు భోగలాలసులు. తాత్త్వికత, దార్శనికతలు నశించి పోయి తాంత్రిక కార్యకలాపాలు కాపాలికుల వలన ఏర్పడ్డాయి. ఈ పరిణామం బౌద్ధంలోకూడా చోటుచేసుకోవడమే విచిత్రం.

## బౌద్ధుల స్వర్గలోకం సుఖవతి

"నిర్వాణం చెందితే ఏమౌతుంది? అందువలన లాభం ఏమిటీ.....??" ఇది సామాన్య ప్రజల్లో కలిగే సందేహం. వైదిక కర్మకాండల మార్గంలో వెడితే స్వర్గానికి వెళ్ళవచ్చు. అక్కడ ఇంద్రుడుంటాడు. రంభ ఊర్వశి మేనకలు ఉంటారు. బౌద్ధమార్గంలో నిర్వాణం చెందితే ఏం కలుగుతుంది....?

బౌద్ధులక్కూడా ఒక స్వర్గాన్ని సృష్టించుకోక తప్పలేదు. అమితమైన భోగ సంపదలున్న "సుఖవతి" అనే స్వర్గలోకాన్ని ప్రతిపాదించారు. పవిత్ర ఆత్మలు మాత్రమే అక్కడకు చేరుతాయని పేర్కొన్నారు. ఈ స్వర్గ సౌఖ్యాలు అనుభవించే వ్యక్తి తిరిగి ఈ భూమిమీద అవతరిస్తాడు. బుద్ధుడిగా జీవించి లోకోద్ధరణకావించి అప్పుడు నిర్వాణం చెందుతాడని ప్రకటించారు.

## బౌద్ధులకూ నరక లోకం వుంది

"బౌద్ధ స్వర్గం" అంటూ వున్నప్పుడు నరకలోకం కూడా వుండాలి గదా..... బుద్ధ ధర్మాల్ని వ్యతిరేకించిన వారెవరైనా ఈ నరకానికి పోతారని, అక్కడ చిత్రహింసలు అనుభవిస్తారని పేర్కొన్నారు. ఇతరుల దాడినుండి తమని తాము రక్షించుకోవడానికి ఈ నరకలోక భయం కన్పించడం తప్పనిసరే కావచ్చు అనాడు !

ఇలాంటి మార్పులన్నీ బౌద్ధంలోని దార్శనికత, తాత్త్వికతల్ని మార్చి "మతం" రంగు పులిమే పరిస్థితులు తెచ్చి పెట్టాయి. తెలుగు వారి ప్రాంతం ఇందులో ఎక్కువగా వుందనడమే ఒక ముఖ్య విషయం.

## తొలి బౌద్ధ గ్రంథాలు

ధమ్మ; చక్క; ప్పవత్తన; సుత్త; అనత్తా; లఖణ ..... ఇవన్నీ పాళీ భాషలో వున్న బౌద్ధ గ్రంథాలు. అరంభదశలో బౌద్ధానికి, **బుద్ధుడి జీవితకాలం** - భావ అభ్యాసక్రమంలో ఆయన కొత్తగా చేర్చినవీ, పాతవి తొలగించినవీ తులనాత్మక పరిశీలనకు ఈ తొలినాటి బౌద్ధగ్రంథాలు దొరికినట్లయితే ఉపయోగించి వుండేవి.

ఇప్పుడు మనకుదొరికే త్రిపిటకాలు ఆరంభ బౌద్ధానికి యథాతథ రూపాలు కావు.

## బౌద్ధ త్రిపిటకాలు

బౌద్ధ ధర్మాల మౌలిక స్వరూపం తెలియడానికి త్రిపిటకాలు ఆధారభూతం. పాళీ భాషలో రాసిన ఈ త్రిపిటకాలు శ్రీలంకలో సురక్షితంగా వున్నాయంటారు.



క్రీస్తుపూర్వం 1వ శతాబ్ది నాటి కాలానికి చెందిన ఈ త్రిపిటకాలు మూడురకాల గ్రంథాలు. "పిటక" అంటే బుట్ట. "కలగూరగంప" లాంటి పదం ఇది. దానికి సంబంధించిన రకరకాల విశేషాల్ని ఒక చోటకు తెచ్చిన సంకలనాన్ని పిటక అన్నారు! పీఠిక (Preface) పదాన్ని ఇంచుమించుగా ఇదే అర్థంలో ఇప్పటికీ మనం వాడు తున్నాం. వీటిమీద వ్యాఖ్యానాల్ని "అర్థ కథ"లంటారు. "అర్థ కథలు" ఆయా గ్రంథాల్ని, వాటిలోని సారాన్ని వెలికి తెచ్చి చూపించే సాధనాలుగా ఉపయోగపడతాయి. పుస్త కానికి వేసే అట్ట (ముఖచిత్రం - Title Page) అనే అర్థంలో తెలుగువారు ఇప్పటికీ ఈ పదాన్ని ఉపయో గిస్తున్నారు.

త్రిపిటకాలకు తెలుగువారు ఆ రోజుల్లో వ్రాసిన ప్రాకృత లేదా పాళీభాషలోని వ్యాఖ్యానాలు అర్థ కథలు. అవి సింహళానికి ఆ రోజుల్లోనే తరలివెళ్ళాయి. వాటిని పరిశీలిస్తే ఆనాటి తెలుగు బౌద్ధ సంఘాల సామాజిక పిరిస్థితులు కొంతమేర తెలియవచ్చు. త్రిపిటకాలు మూడు. ఇవి :

1. **వినయ పిటకం :** బౌద్ధ సంఘాలలో విధిగా పాటించవలసిన క్రమ శిక్షణ గురించిన వివరాలు (Basket of Discipline)
2. **సుత్త పిటకం :** బుద్ధుడి సంభాషణలు, సామెతలు,సూక్తులు (Basket of Discourses).
3. **అభిదమ్మ పిటకం :** భౌతిక విషయాలకు సంబంధించి బౌద్ధ సంఘాలలో లోతుగా చేసిన చర్చలు (Basket of Metaphysics)

## పొగడ్తలొద్దు

ఒకసారి సారిపుత్రుడు బుద్ధుని కీర్తించాడు. ఈ పొగడ్తలు, జయజయధ్వానాలు బుద్ధునికి ఇష్టం వుండేవి కాదు. చాలాసార్లు చెప్పిచూశాడు ఇలా చెయ్యొద్దని. అయినా మార్పురాలేదు. ఒకరోజు అసహనం ప్రదర్శించాడు బుద్ధుడు. సారిపుత్రా... "నీకు గతంలో వచ్చిన అనేకమంది బుద్ధులు తెలుసా!" అనడిగాడు. తెలియరన్నాడు - సారిపుత్రుడు.

"భవిష్యత్తులో రానున్న బుద్ధులు తెలుసా?" అనడిగితే, తెలియదని సమాధానం చెప్పాడు. 'పోనీ, ఇప్పుడున్న బుద్ధుని గురించి పూర్తిగా తెలుసా?" అని అడిగితే, అదీ తెలియదన్నాడు. "మరిఏమీ తెలియనివాడివి అందరికన్న గొప్పని నన్ను ఎందుకు పొగుడుతావు?" - అని ప్రశ్నించేసరికి సారిపుత్రుడు ఖంగుతిన్నాడు.

## సంఘాలకు నియమాలు - వాటి ఆచరణ

మిగిలిన పరివ్రాజకులకన్నా బౌద్ధ పరివ్రాజకులు జనాదరణ పొందడానికి ముఖ్యకారణం, ధర్మం, సత్యం, వినయం. వాటికి వీరు ప్రాధాన్యత నివ్వడమే!

"ధమ్మిక సుత్త" "ధర్మసూత్రం" అనే భాగంలో, "సుత్త నిపాత" గ్రంథంలో బౌద్ధ సంఘాలకు సంబంధించిన అనేక విశేషాలున్నాయి. సంఘాలు పెరుగుతున్న కొద్దీ సంఘ నిబంధనలు కొత్తవి చోటుచేసుకోసాగాయి.

"మహాపరినిబ్బాణ సుత్తాంతం" అనే గ్రంథంలో బుద్ధుడే స్వయంగా తను ప్రతిపాదించిన నియమావళికి మినహాయింపు నిచ్చినట్లుంది. మరొకసారి నా నియమాలను నేనెలా కాదన గలుగుతాను? అని ప్రశ్నించినట్టొ కన్పిస్తుంది. అంటే, ఎక్కువగా సంఘాలు,

ఎక్కువగా శిష్యులు రావడం కోసం తొలిదశలో కొంచెం చూసీ చూడనట్లు వ్యవహరించాడనీ బౌద్ధ సంఘాలు వృద్ధి చెందుతున్నకొద్దీ నియమనిబంధనలను కఠినతరం చేశాడనీ అంటారు!

ఎప్పటికప్పుడు ఈ నిబంధనలను రూపొందించుకోవడం కోసం అనేక బౌద్ధ మహాసభలను నిర్వహించేవాడు బుద్ధుడు. "Buddhist Councils" అనవచ్చు వీటిని.

మార్గం బుద్ధుడు చూపించిందే. కానీ, నియమాలను బౌద్ధులు స్వయంగా చర్చించుకొని, తమకు తామే ఏర్పరచుకున్నారు. "జ్ఞానం" అనేది బౌద్ధ ధర్మాలలో ముఖ్య మైంది కాబట్టి, బౌద్ధ సంఘ జ్ఞానాన్ని బట్టి ప్రవేశం, వినయాన్ని బట్టి అర్హతలు ఏర్పడతాయి. సంఘాల నిర్వహణ అత్యున్నత స్థాయిలో జరిగేలా ఈ మహాసభలు విధానాలు రూపొందించేవి.

## పార్లమెంటరీ విధానం

తన నిర్యాణానికి ముందు ఆనందుడితో బుద్ధుడు అంటాడు – "సంఘాది దేశ పాటిమొఖ్ఖ సంఘాది....." "నేను లేకపోయినా, ఆనందా, సంఘం కోరుకున్న పక్షంలో కోరుకున్న మార్పుల్ని చేసుకోవచ్చు –"

తాను బౌద్ధ సంఘాలకు ఎల్లకాలం మేనేజరుగా వుండలేననీ, బౌద్ధ సంఘాలు తమదైన శైలిలో స్వతంత్రంగా నిర్ణయాత్మక శక్తులుగా ఎదగాలనీ బుద్ధుడు కోరుకున్నాడు.

కఠినతర నియమాలతో బౌద్ధ సంఘాలను సమర్థవంతంగా నిర్వహింపచేయ గలిగాడు బుద్ధుడు.

బౌద్ధ సంఘాలలో చర్చలు ఈ నాటి మన అసెంబ్లీ, పార్లమెంట్లకు ఏమీ తీసిపోని రీతిలో వాడిగా వేడిగా జరిగిన సందర్భాలూ వున్నాయి. ఒక్కోసారి ఉద్వేగాల్ని అదుపు చెయ్యడానికి బుద్ధుడు స్వయంగా కల్పించుకోవాల్సి కూడా వచ్చేదిట – అయినా సభ అదుపులోకి రానప్పుడు బాధగా బుద్ధుడు సభను వదిలివెళ్ళిపోయిన సంఘటనలు కూడా వున్నాయి!

మూడు సార్లు హెచ్చరించి, మూడో సారికూడా అదే తప్పు చేసినప్పుడు బహిష్కరించిన సందర్భాలూ వుండేవని బౌద్ధ గ్రంథాల్లో వుంది.

వివాద పరిష్కారాలకు, చర్చలు శాస్త్రీయంగా జరగడానికి బుద్ధుడు అనుసరించిన మార్గం గొప్పది. ఈనాటికీ ప్రపంచ వ్యాప్తంగా సంఘాల నిర్వహణ, సభల నిర్వహణలు బుద్ధుడి మార్గానే జరుగుతున్నాయి..... పార్లమెంటరీ విధానానికి ఆయనే రూపశిల్పి !

# బౌద్ధ సంఘాలలో ప్రోటోకాల్

బౌద్ధ సంఘాల నిర్వహణకు పాలనాపరమైన పటిష్ట వ్యవస్థని ఏర్పరిచాడు బుద్ధుడు. కఠినమైన నియమాలను పాటించడంలో అలసత్వం ప్రదర్శించిన బౌద్ధ సంఘాలకు గుర్తింపు రద్దు (Charter withdrawn) ప్రకటించేవాడు. అంత కఠినతరంగా నిర్వహించ గలిగాడు కాబట్టే బౌద్ధ సంఘాల్ని, బౌద్ధ ధర్మాల్ని, బౌద్ధుల్ని ఆశ్రయించి, వారు సూచించిన మార్గంలో నడవవలసిందిగా ప్రజలను కోరాడు బుద్ధుడు. బుద్ధం శరణం గచ్ఛామి సంఘం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, - అనడంలో బౌద్ధ సంఘాల్ని, వాటి నిర్ణయాల్ని ఈ సంఘాలలోని సభ్యుల్ని నమ్మవలసిందిగా కోరడమే!

అంత నమ్మకమైన రీతిలో బౌద్ధ సంఘాలు పనిచేయాలంటే వాటి పాలనా విధానం చాలా పటిష్టంగా వుండితీరాలి. అందుకోసం "అర్హత" కల్గిన వ్యక్తుల్ని వివిధ హోదాల్లో నియ మించాడు. ఆ హోదాలు ఇలావున్నాయి-

★ భాండాగారికుడు (Overseer of stores)

★ కప్పియకారకుడు.

★ సంఘ భట్ట (Ration Distributor)

★ చివ భాజకుడు (Arments Distributor)

★ యాగు భాజకుడు (Light food distributor) "యవాగు" అంటే చిక్కనైన బియ్యపు గంజి. బహుశా "యాగు" యవాగుకు పూర్వరూపం కావచ్చు.

★ ఫలభాజకుడు (Fruits Distributor)

★ ఖజ్జక భాజకుడు (Food Distributor)

★ సెనాసన పన్నాపకుడు (సభలలో ప్రోటోకాల్ ప్రకారం బౌద్ధ భిక్షువుల్ని ఆయా స్థానాలలో అలంకరింపచేసే కార్యదర్శి)

★ **చివార పటిగ్గాహాపకుడు :** భిక్షువులు ధరించే "అంగీ"లపై పర్యవేక్షకుడు బహుశా బౌద్ధ భిక్షువులు ఒకే విధమైన డ్రెస్ - కోడ్‌ని పాటించే విధంగా ఈయన వారి వస్త్రధారణని పర్యవేక్షిస్తూ వుండివుండవచ్చు. సమాజంలో బౌద్ధుల క్రమశిక్షణ పట్ల గౌరవ భావం కలగడానికి ఇవి తోడ్పడతాయి.

★ **సతీయగాహాపకుడు :** "లో దుస్తులు" ధరించే విషయంలో కూడా అదనపు పర్యవేక్ష కుణ్ణి నియమించారు (Distributor of undergarments). ఈ దుస్తుల్ని భిక్షువులకు బౌద్ధ సంఘమే సరఫరా చేస్తుండేది కాబోలు.

★ **పత్తగాహాపకుడు** : భిక్షువులు భిక్షకోసం వెళ్ళేందుకు ఉపయోగించే పాత్రల్ని అందించేవాడు (Distributor of Alms - Bowl)

★ **అప్పమట్టకుడు - విన్యజ్జపుడు** : సూదులు, కత్తెరలు, తేనె ఇలా ఉపయోగించుకొనే వస్తువుల్ని అందించేవాడు.

★ **నేవ - కమ్మికుడు** : కొత్త బౌద్ధారామాల నిర్వహణాధికారి (Incharge of new buildings)

★ **ఆరామిక పేశకుడు** : ఆరామాలలో ఉద్యోగులు వీరు ఆరామాల నిర్వహణ బాధ్యతలు కల్గినవారు. వాటిని శుభ్రంగా వుంచడం, సందర్శకులకు సౌకర్యాలు కల్పించడం వంటివి చేసేవారు.

★ సామనేర పేశకుడు : సామానేరలు - కొత్త కార్యక్రమాలకు బాధ్యుడు.

## సభాధ్యక్షుణ్ణి వినయధరుడంటారు

ప్రతి బౌద్ధ సంఘానికీ ఒక అధ్యక్షుడుంటాడు. సాధారణంగా ఈ అధ్యక్షుడే ఆ సంఘం సభలకు కూడా అధ్యక్షత వహిస్తాడు. ఈ అధ్యక్షుణ్ణి వినయధరుడంటారు. వినయాలంటే నియమాలు. నియమప్రకారం సంఘాన్ని సభను నడిపించే వాడు కాబట్టి వినయధరుడన్నారు. వినయధరుడనేది ఒక అధికార పదవే గాని వ్యక్తిపేరు కాదు.

## కోరమ్ నిండిన సభ - సమగ్ర

సంఘం తీవ్రంగా ఒక విషయం మీద చర్చించి నిర్ణయించాలంటే సంఘం సభ్యులు సభకు హాజరు కావాలి కదా! ఎంతమంది హాజరుకావాలి.....? వారివారి స్వంత కారణాలవలన కొందరు రాలేకపోవచ్చు కదా..... అందుకని కనీసం "ఇంత మంది సభ్యులు" సభలో పాల్గొన్నప్పుడే నిర్ణయాధికారం ఆ సభకు కలుగుతుందని బౌద్ధులు కోరమ్ పద్ధతిని ప్రవేశపెట్టారు. కనీసం 10 మంది సభ్యులు కూడా హాజరుకాని సభ చేసిన నిర్ణయాలు చెల్లవు - అని ప్రకటించాడు బుద్ధుడు.

కోరమ్ విషయంలో బుద్ధుడు చాలా కఠినంగా వుండేవాడు. సభలకు హాజరుకానివాడు బౌద్ధ సంఘాల్లో సభ్యుడిగా వుండి సాధించేదేముంది ?

పట్టుమని పదిమందైనా లేని సభలు నిర్వహించిన రెండు బౌద్ధ సంఘాల గుర్తింపుని ఆయన రద్దుచేశారట కూడా!

ఇక్కడ, ఆచరణలో కొన్ని ఇబ్బందులు ఏర్పడ్డాయి. వైశాలి లాంటి నగరంలో

ఆ రోజుల్లో బౌద్ధ భిక్షువులు చాలా సునాయాసంగా సభలు జరుపుకోగలిగేవాళ్ళు. కానీ, దూర ప్రాంతాల విషయానికొస్తే, ఒక వూళ్ళో బౌద్ధ సంఘం వుంటే, దాని సభ్యులు ఎక్క డెక్కడో వుండేవారై వారివారి ధర్మప్రచారాలు చేసుకుంటూ వుంటారు. కొన్ని బౌద్ధ సంఘాలలో పది మంది సభ్యులు దొరకడమే గగనం అవుతుంది. ఎవరు కనిపిస్తే వారిని చేర్పించడానికి బౌద్ధ సంఘాల్లో అవకాశాలు కుదరవు కదా..... అందుకని బుద్ధుడే మరో ఏర్పాడు చేశాడు-

సంఘంలో సభ్యుల సంఖ్యని బట్టి, ఆ సంస్థ స్థాయిని నిర్ణయించేవారు. ఆ స్థాయిని బట్టి "కోరమ్"ని ఏర్పరిచారు. ఈ మార్పువలన కలిగిన ప్రయోజనాలు ఇవి -

1. ఐదుగురు సభ్యులు కోరమ్‌గా వుండే సంఘాలు, 10 మంది కోరమ్‌గా వుండేవి, ఇరవై మంది కోరమ్ అవసరమైనవి అంటూ ఆ సంఘం స్థాయిని దాని కోరమ్‌ని బట్టి నిర్ణయించడం మొదలు పెట్టారు.
2. ఐదుగురు సభ్యులే కోరమ్‌గా వున్న సంస్థలు నిర్ణయాలు తీసుకునే అంశాలకు కూడా ఒక స్థాయిని నిర్ణయించారు.
3. ఎవరు ఏదైనా మాట్లాడవచ్చుననే అలుసు బౌద్ధ సంఘాల్లో ఏర్పకుండా బుద్ధుడు ఈ ఏర్పాటుచేశాడు.
4. సభాధ్యక్షుడితో కలిపి హాజరయిన సభ్యులు కోరమ్ అవుతారు.
5. స్త్రీ సభ్యులు, సేవకులు, ఇతర బౌద్ధ సంఘాలకు చెందినవారు "కోరమ్"లోకి రారు.

కోరమ్ చక్కగా సరిపోయినప్పుడు, ఆసభ నిర్వహణ యోగ్యం అవుతుంది. కోరమ్ లేని సభకు విలువ వుండేది కాదు.

కోరమ్ పూర్తయ్యిందన్న తర్వాతే సభాధ్యక్షుడు సభను ప్రారంభించే వాడు. సభ జరిగినంత సేపూ ఈ కోరమ్ వుండాలి. నిర్ణయాలు తీసుకొంటున్నప్పుడు, చర్చలు జరుగుతున్నప్పుడు, తీర్మానాల్ని అంగీకరిస్తున్నప్పుడు కోరమ్ వుంటే, ఆ నిర్ణయం లేదా తీర్మానం "సమగ్ర" అవుతుంది. కోరమ్ లేని నిర్ణయం "వ్యగ్ర" (లేదా) అసమగ్ర అవుతుంది.

అసమగ్రంగా సభను నిర్వహిస్తే ఆ అధ్యక్షుడికి శిక్ష వుండేది. ఆ సంఘం గుర్తింపు రద్దు చేసేవారు. అలాంటి సభని "అకమ్మమ్" అన్నారు. "అకమ్మమ్ నచ కరణీయం" అని స్పష్టంగా చెప్పారు..... అలాంటి అకమ్మమ్ (అకర్మ)లు చెయ్యవద్దని !!

## నిర్ణయాలు తీసుకునే విధానం

ఏ విషయాన్నయినా ఒక పద్ధతి ప్రకారం సభలో ప్రవేశపెట్టి, దానిమీద సమగ్రంగా చర్చించి నిర్ణయాలు తీసుకోవడానికి 5 ముఖ్య విధానాలను బౌద్ధులు అనుసరించారు.

1. సభలో "సమగ్రత" (కోరం) వుండాలి.
2. సభలో సభ్యులు అర్హత (quality) కల్గిన వారై వుండాలి.
3. నిర్ణయాలు లేదా తీర్మానాలు ఏకాభిప్రాయం ద్వారా జరగాలి లేదా ఓటింగ్ ద్వారా తీసుకోవాలి.
4. సభానిర్వహణకు తగిన కార్యక్రమ వరుసని (ఎజెండాని) ముందే ప్రకటించాలి. దాన్ని సభ మొదటగా ఆమోదించాలి. అలా ఆమోదించిన ఎజెండా ప్రకారం సభ జరుగుతుంది!
5. సభతీసుకున్న నిర్ణయాన్ని ఒక తీర్మానం రూపంలో మూడుసార్లు సభాధ్యక్షుడు చదవాలి. మూడోసారి కూడా చదివిన తర్వాత తీర్మానం నెగ్గినట్లు ప్రకటించాలి.

## ఎజెండా రచన

సభను నిర్వహించడం ఆషామాషీ వ్యవహారం కాదు. చర్చనీయాంశాల పట్ల సంఘం అధ్యక్షుడికి పూర్తి అవగాహన వున్నప్పుడే చర్చల్ని హుందాగా నిర్వహించ గలుగుతాడు.

ఏ క్రమంలో ఏ అంశాన్ని ఎప్పుడు చర్చకు పెట్టాలనేది ముందుగానే నిర్ణయించ గలిగి వుండాలి. అలా ఒక వరుసని ఏర్పరచాలి. దీన్ని "పచ్చనుసిత్త వచనా"లంటారు. అంటే, "ఆర్డర్" (ఎజెండా)ను ఎంపిక చేయడం అని అర్థం.

అలా ఎంపికచేసిన "ఆర్డర్"ని సభలో చదివి వినిపిస్తారు. ఈ వరుసక్రమాన్ని సభ ఆమోదించినట్లయితే కార్యక్రమాలు (proceedings) అప్పుడు ప్రారంభం అవుతాయి.

## మినిట్స్ రికార్డు చెయ్యడం

ఒక్కోసారి సభల్లో వాడిగా వేడిగా కూడా చర్చలు జరగవచ్చు. ఎవరు ఏ విషయం మీద ఏం మాట్లాడారో ఎప్పటికప్పుడు రికార్డు చెయ్యవలసి వుంటుంది. వాటిని ఉత్తాన వచనాలంటారు పాళీభాషలో! ఉత్తానవచనాల్ని రికార్డు చేసేందుకు చెకచెకా రాయగలిగిన వ్రాయసకాండ్రు కూడా సంఘాలలో వుండేవారు. వాళ్లు సభలో జరిగిన చిన్న విషయాన్ని కూడా రికార్డు చేయడానికి అలవాటుపడి వుండేవారు.

## విధిగా హాజరు కావాలని "విప్"

బౌద్ధ సంఘంలో సభ్యత్వం సరదాకోసమో, కాలక్షేపంకోసమో తీసుకునేది కాదు కదా..... భవబంధాలన్నింటిని మహాపరిత్యాగం చేసి బౌద్ధ దీక్ష తీసుకొని సంఘంలో సభ్యుడౌతాడు. అతని ప్రవర్తన కూడా అందుకు తగ్గట్టుగా హుందాగా వుండాలి. తాను

ఏ ధర్మం కోసం త్యాగం చేశాడో ఆ ధర్మం పట్ల ఆయనకు గౌరవం, అంకితభావం వున్నప్పుడే ఆ త్యాగానికి సార్థకత ఏర్పడుతుంది.

బౌద్ధ సంఘాలలో సభ్యులకు రెండు ప్రధాన బాధ్యత లుంటాయి. ఒకటి నిర్ణయాలు చెయ్యడం. రెండు వాటిని ప్రచారం చెయ్యడం. ఈ రెండింటిలో ఏ ఒక్కదాన్ని ఏ ఒక్క సభ్యుడు అశ్రద్ధచేసినా ఆ బౌద్ధ సంఘం నగుబాటు పాలవుతుంది.

అందుకని, విషయ ప్రాధాన్యత రీత్యా సంఘం అధ్యక్షుడు సభకు తప్పనిసరిగా హాజరు కావాల్సిందిగా సభ్యులమీద విప్ జారీచేసే అవకాశం కూడా వుండేది.

అప్పుడు సభ నిండుగా వుండేది. నిండు సభని "గుణపూరక మహావగ్గ" అని పిలిచేవారు.

## తీర్మానాల్ని ప్రవేశ పెట్టే విధానం

"అంతా మనమే కదండీ..... బైటవాళ్ళెవరున్నారు - ఏం ఫర్వాలేదు - నో ఫార్మాలిటీస్....." అంటూ వుంటాం మనం. కానీ, ఐదుగురే సభ్యులు వున్న సంఘం కూడా విధిగా ప్రతి చిన్న విషయాన్ని పాటిస్తూ క్రమశిక్షణాయుతంగా సభను నిర్వహించి తీరాలి. అలా నిర్వహిస్తేనే వారు చేసే తీర్మానాలకు విలువనిస్తారు ప్రజలు. బౌద్ధ సంఘాల నిర్వహణ, సభల నిర్వహణ ఈనాటి పార్లమెంటరీ విధానాలకు ఏ మాత్రం తీసిపోనివిగా వుండేవన్న సంగతి ఈ పాటికి మీరు గమనించే వుంటారు.

తీర్మానాల్ని ప్రవేశపెట్టేందుకు కొన్ని పద్ధతులు చెప్పారు. చర్చనీయాంశాలు తీర్మానం రూపంలో రాయాలి. అందుకు అవసరమైన పారిభాషిక పదాల గురించిన అవగాహన తీర్మానాన్ని ప్రవేశపెట్టే వారికి వుండాలి.

తీర్మానాన్ని జ్ఞప్తి అంటారు. జ్ఞప్తి అంటే, motion అని ! మోషన్ రూపంలో తీర్మానాన్ని ప్రతిపాదిస్తారు. లేదా ప్రవేశపెడతారు. దాన్ని పరిశీలించి, చర్చకు పెట్టదగినదిగా వున్నదని దాని యోగ్యతని నిర్ణయించాకే అది తీర్మానం రూపంలో చర్చకు అనుమతించబడేది.

చర్చకు తీర్మానాన్ని అనుమతించడాన్ని జ్ఞప్తి స్థాపనం అన్నారు.

జ్ఞప్తి స్థాపన జరిగిన తర్వాత ఇంక దాని మీద చర్చ ప్రారంభం అవుతుంది. చర్చించడాన్ని జ్ఞప్తి కర్మ అని పిలిచారు.

చర్చించేప్పుడు ఆ అంశం మీద మాట్లాడే వ్యక్తికి దాని మీద స్పష్టమైన అవగాహన వుండాలి. తనకు పరిజ్ఞానం లేని విషయాల మీద కూడా ఏదో ఒకటి

మాట్లాడేస్తుంటారు..... సభల్లో చాలా మంది. బుద్ధుడు వాచాలత్వాన్ని ప్రయోగించడాన్ని క్రమశిక్షణారాహిత్యంగా భావించాడు. అలాంటి వ్యక్తుల్ని సంఘంలోంచి బహిష్కరించవచ్చు కూడా! అర్ధరహితంగానూ, అసంబద్ధంగానూ చర్చల సందర్భంలో మాట్లాడడాన్ని "అనగ్ర" అంటారు.

సభాధ్యక్షుడు తీర్మానాన్ని తనచేతిలోకి తీసుకొని, జ్ఞప్తిని (తీర్మానాన్ని) పైకి బిగ్గరగా చదువుతాడు.

1. తీర్మానం ప్రతిపాదించిన వ్యక్తిపేరు చదువుతాడు.
2. తీర్మానంలోని విషయాన్ని వివరిస్తాడు.
3. దీని అవసరాన్ని సభ్యులందరికి అర్థమయ్యేట్లు విశ్లేషిస్తాడు.
4. దీన్ని ఈ విధంగా అమలుచేయాలని ఆ ఫలానా సభ్యుడు ప్రతిపాదిస్తున్నట్లు పేర్కొంటాడు.
5. దానిమీద చర్చిందానికి సభ ఆమోదం మొదట కోరతాడు.
6. చర్చకు అనుమతి తీసుకున్నాక, సభ్యుడు సూచించే విధానం అంగీకారయోగ్యం అనుకున్న వాళ్ళని మౌనంగా వుండవలసిందిగా కోరతాడు. వ్యతిరేకించే వారికి మాత్రమే మాట్లాడే అవకాశం మొదట ఇస్తాడు.

## తీర్మానానికి సభ ఆమోదం

సభలో ఎవరు అంగీకరిస్తున్నారో, ఎవరు అంగీకరించడంలేదో ఇప్పుడు తేలి పోతుంది. ఎవ్వరూ మాట్లాడటానికి లేచి ముందుకు రాకపోతే ఆ తీర్మానం ఏకగ్రీవ ఆమోదం పొందినట్టే లెక్క

అలాగని, సభ్యులు మౌనంగా వున్నంత మాత్రాన అంగీకరించినట్లు కావాలని లేదు గదా.....

అందుకని, సభాధ్యక్షుడు తీర్మానాన్ని రెండోసారి చదువబోతున్నట్లు ప్రకటించి చదువుతాడు. "జ్ఞప్తి ద్వితీయం" అంటారు దీన్ని. తాను రెండోసారి చదివినట్లు ప్రకటిస్తాడు కూడా!

అప్పుడైనా ఎవరైనా లేచి మాట్లాడేందుకు ముందుకొస్తే సభాధ్యక్షుడు అనుమతించవచ్చు. అయినా, ఎవరూ లేవకపోతే మచ్చటగా మూడోసారి తీర్మానాన్ని చదువుతాడు. "జ్ఞప్తి తృతీయం" అంటారు మూడోసారి చదవడాన్ని.

"ఈ తీర్మానం అందరికీ ఆమోదమేనా?" అని మళ్ళీ అడుగుతాడు. సంఘంలోని అందరి సంతృప్తితో, సమ్మతితో దీన్ని ఆమోదిస్తున్నాను– ".....క్షమతి సంఘస్య తస్మాత్ తుష్ణిమ్ ఏతేమ్ దారయతి" అని ప్రకటిస్తాడు.

తృతీయమ్ ఏతదర్థమ్ వదాని - - మూడవసారికూడా దీన్ని సభ గ్రహించేలా చదవడం జరిగిందని ప్రకటిస్తాడు.

ఈ మూడుసార్లు ప్రకటించే అలవాటు తెలుగువారిలో ఈనాటికీ వుంది. ఇది బౌద్ధుల నుంచి సంక్రమించిన ఆచారమే మనకి !

## వ్యతిరేకత తెలిపే విధానం

సభాధ్యక్షుడు మూడుసార్లు ప్రకటించేప్పుడు ఏ సభ్యుడైనా లేచి, తన అభ్యంతరాన్ని లేదా వ్యతిరేకతని వ్యక్తపరచవచ్చు. ఎందుకు వ్యతిరేకించవలసి వస్తోందో చెప్పగలిగి వుండాలి.

1. **భండన :** ఇది మంచి చేయకపోవచ్చని తన వ్యతిరేకతని వ్యక్త పరచడాన్ని భండనం అంటారు.
2. **కలహం :** ఇలాంటి తీర్మానం పూర్తిగా అసంబద్ధమైంది - అసలు దీన్ని ప్రతిపాదించడమే సరికాదు - అంటూ తన విరోధాన్ని ప్రకటించడాన్ని కలహం అంటారు.
3. **వివాదం :** ఇది అలాగే ఎందుకుండాలి - ఇంకోలా ఎందుకుండ కూడదు ? అంటూ అభిప్రాయభేదాన్ని ప్రకటించడం వివాదం.

వ్యతిరేకతని వ్యక్తపరచిన సభ్యుడు భండనమో, కలహమో, వివాదమో ముందుగా ప్రకటించాలి. దాన్ని బట్టి ఆయనకు మాట్లాడే అవకాశాన్ని సభాధ్యక్షుడు కల్గిస్తాడు.

## సమన్వయ సంఘం

తీర్మానం మీద సభలో ఎక్కువమంది అభ్యంతరాలు వ్యక్తపరిచినప్పుడు ఈ సంఘం కన్నా పై స్థాయినున్న "ఆవాసం" సభ్యుల్లో పెద్దలు లేదా సీనియర్లు వచ్చి, మాట్లాడి ఏకాభిప్రాయం సాధించడం కోసం ప్రయత్నిస్తారు.

అన్ని ప్రయత్నాలూ విఫలమై ఎవరూ తమతమ అభిప్రాయాల్ని మార్చుకోవడానికి ఇష్టపడని పరిస్థితుల్లో ఏకాభిప్రాయం అసాధ్యం అవుతుంది. నలుగురిలో కూర్చుంటే చర్చలు ఎప్పటికీ పూర్తికావు కాబట్టి, ఒక సమన్వయ సంఘాన్ని నియమిస్తారు. ఈనాటి పార్లమెంటరీ పద్ధతిలో "సెలెక్ట్ కమిటీ" అంటారు దీన్ని. ఈ సమన్వయ సంఘాన్ని "ఉద్వాహక సభ" అని పిలిచారు.

రెండు వర్గాలవారినీ ఒక్కొక్కరి చొప్పున, తటస్థుల్లోంచి ఒకరిని కూర్చోబెట్టి, ముగ్గురితో "ఉద్వాహక సభ"ని నిర్మిస్తారు. ఈ ఉద్వాహక సభ విధిగా ఒక నిర్ణయానికి రావలసి వుంటుంది. ఆ నిర్ణయానికి ఇరు పక్షాలూ బద్ధులు కావాలి. అంతేకాదు, ఉద్వాహక సభ తీసుకున్న నిర్ణయాన్ని ప్రశ్నించే అధికారం కూడా ఎవరికీ వుండకూడదు.

ఇలా తీసుకున్న నిర్ణయాన్ని "సమ్ముఖ వినయ" అంటారు.

## ఓటింగ్

సాధారణంగా సమన్వయ సంఘం వేసేంత దాకా విషయాన్ని రానివ్వకపోవచ్చు. అయినా, మేథావుల కూటమి కాబట్టి కొంత ఇబ్బంది కలిగితే కలగవచ్చు. ఒకసారి బుద్ధుడే స్వయంగా సభాధ్యక్షుడిగా వుండి, ఏకాభిప్రాయం కుదరక, ఆగ్రహించి సభను విడిచి అడవుల్లోకి వెళ్ళిపోయాడు. సభ్యులు తమలో తాము సమాధానపడి ఒక నిర్ణయానికి వచ్చాక అప్పుడు తిరిగి వచ్చాడు. ఇలాంటి పరిస్థితులు రావచ్చు కూడా!

అలాంటప్పుడు ఓటింగ్‌కు పెట్టే విధానాన్ని కూడా సూచించారు. "యద్భూయ శికాక్రియ" అంటారు దీన్ని. ఎక్కువ మంది ఎటు మొగ్గితే అటువైపు మొగ్గడం లాంటి దన్నమాట..... ఓటింగ్ అంటే ! దీనివలన మైనారిటీ అభిప్రాయాన్ని గొంతు నులిమి వేయవలసి వస్తుంది. కాబట్టి ఓటింగ్‌ని బుద్ధుడు ఆఖరి అస్త్రంగా తీసుకొన్నాడు.

ఓటింగ్‌ని ఎవరు నిర్వహించాలి.....?

పాక్షిక మనస్తత్త్వం (చ్ఛంద) లేనివాడు, తప్పుడు ఆలోచనలు చెయ్యనివాడు (దోష), ఏదో ఒక వ్యామోహంతో, ప్రలోభంతో ఒక వైపు లొంగిపోనివాడు (మోహ), ఎవరైనా తనని ఏమైనా చేస్తారేమోననే భయం లేనివాడు (భయం)..... ఛంద, దోష, మోహ, భయాదులు లేని భిక్షువుని ఎన్నికల కమీషనర్‌గా కూర్చోబెడతారు. ఆయన ఓటింగ్‌ని నిష్పాక్షికంగా నిర్వహిస్తాడు.

ఓటింగ్‌ని గుహ్యక, స్వకర్ణ జల్పక, వివృత్తక - అనే మూడు విధానాల్లో జరుపుతారు.

గుహ్యక విధానం అంటే రహస్య బ్యాలెట్‌పద్ధతి. స్వకర్ణ జల్పకం అంటే, ఎన్నికల అధికారికి మాత్రమే తెలిసేలా తన అభిప్రాయాన్ని చెవిలో చెప్పివెళ్లడం. ఎక్కువ మంది దేన్ని సమర్థిస్తున్నట్లు ఆ అధికారి భావిస్తాడో అది గెలిచినట్లు లెక్క! ఇంక మూడోది వివృత్తకం. అంటే, అంగీకరించే వారు చేతులెత్తండి - అని బహిరంగంగా మేజువాణి ఓటుతో గెలిపించడం..... ఇలా రకరకాల పద్ధతులలో ఓటింగ్ జరిపేవారు.

ఎరుపు, ఆకుపచ్చ - ఇలాంటి రంగుల పుల్లలిచ్చి, అంగీకరించేవారిని ఫలానా రంగు పుల్లని బ్యాలెట్ పెట్టెలో వెయ్యవలసిందిగా కోరేవిధానాన్ని రహస్య బ్యాలెటింగ్‌లో పాటిస్తారు. శలాక విధానం అంటారు దీన్ని.

ఈ విధంగా ధర్మబద్ధమైన బౌద్ధసంఘం, ధర్మబద్ధులైన ఆ సంఘ సభ్యులు ధర్మబద్ధమైన తీర్మానాన్ని చర్చించి, నిగ్గుతీసి, "ధర్మం"గా ప్రకటిస్తారు కాబట్టి తీర్మాన ఆమోదాన్ని "ధర్మేణ సమగ్ర కర్మ" అంటారు.

"సంఘం" అంటే, గుర్తింపుపొందిన (qualified) బౌద్ధ బిక్షువులు సభ్యులుగా వున్న ఒక యూనియన్ లాంటిది. ఇటువంటి బౌద్ధ సంఘం అది రక్షణనిస్తుంది. సంఘం శరణం గచ్ఛామి - అన్నాడు బుద్ధుడు.

ఈ సంఘంలో చేసిన నిర్ణయమే ధర్మం. అది కాపాడుతుంది. ధర్మం శరణం గచ్ఛామి - అన్నాడు బుద్ధుడు.

సంఘంలో గుర్తింపు పొందిన మేధావులే సభ్యులుగా వుంటారు. వీరే బుద్ధులంటే! ఈ బుద్ధులు ఎప్పుడూ మంచినే కల్గిస్తారు. అందుకని బుద్ధం శరణం గచ్ఛామి - అన్నాడు బుద్ధుడు!

## మొదటి సంగీతి

నిజానికి బుద్ధుడి జీవితకాలంలోనే "దేవదత్తుడు" 500 మందిని బయటకు తీసుకొచ్చి చీలిక తెచ్చాడు. దేవదత్తుడి తర్వాత బుద్ధుడి జీవితంలో రెండో విలన్ సుభద్రుడు. ఈ సుభద్రుడు, మరికొంతమంది భిక్షువులు బుద్ధుని క్రమశిక్షణ నియమాలని సహించలేక పోయారు. బుద్ధుడు మరణించాడని తెలిసి ఈ సుభద్రుడు - "ఇంక స్వేచ్ఛగా బతకొచ్చు' 'నని సంతోషం ప్రకటించినట్లు పండితులు చెప్తారు.


మహాకాశ్యపుడు

ఇలాంటి వ్యక్తులతో బౌద్ధ సంఘాలకు అపకారం జరిగే ప్రమాదం వుంది కాబట్టి బౌద్ధం స్వీకరించ డానికన్నా ముందే ప్రసిద్ధు డైన మహాకాశ్యపముని తక్షణం ఒక మహాసభని (General Body) ఏర్పాటు చేయవలసిందిగా సూచించాడు. బుద్ధుడి మరణానంతరం జరిగిన ఈ మొదటి మహాసభని "సంగీతి" అన్నారు.

రాజగిరి దగ్గర వైభవగిరి మీద "సప్తపర్ణి గుహ"లో ఈ సంగీతి జరిగింది. మగధ ప్రభువైన అజాతశత్రువు ఈ

కార్యక్రమానికి ఆతిధ్యం ఇచ్చాడు. కాశ్యపుడు అధ్యక్షుడిగా వ్యవహరించాడు. 500 మంది భిక్షువులు అధికారికంగా హాజరయ్యారు. చాలా సుదీర్ఘంగా వాదోపవాదాలు సాగాయి. "ఉపాలి" వినయపిటకాన్ని, ఆనందుడు "సుత్త పిటకాన్ని" పఠించారు. విభేదాలు ఎక్కడివక్కడ సర్దుకున్నాయి. కొంతకాలం నిశ్శబ్దంగా వుంది.

## చీలికలకు దారితీసిన భేదాభిప్రాయాలు ఇవి .....

బుద్ధుడి జీవిత కాలంలోనే "నిగంధ నాతపుత్త" అనే జైన ప్రవర్తకుడు మరణించ గానే, జైన సంఘారామాలు ఎలా పతనం అయ్యాయో అందరూ కళ్ళారా చూశారు. అందుకని, బౌద్ధ సంఘాల్ని వ్యక్తిగా తానుకాక, ధర్మం, వినయం ఇవే నడిపించేలా ఒక విధానాన్ని తప్పనిసరిగా అనుసరించే ఉపాయాలు ఆలోచించాడు బుద్ధుడు.

ఏమైనా బుద్ధుడంతటివాడు పెద్ద తలకాయగా వున్నప్పటి పరిస్థితి వేరు. ఆయన తర్వాత ఈ మేథావుల కూటాలకు సంరక్షణ సాధ్యమయ్యేదేనా..... ? ప్రతీ బౌద్ధ సంఘానికీ ఒక సంఘ పితరుడు (President of the Unit) వుండేవాడు. ఆయన బుద్ధుడి వచనాల్నే ప్రవచించేవాడు. కానీ, తనదైన శైలిలో వాటిని వివరించేవాడు. ఎవరి శైలి వారిది. ఎవరి అభిప్రాయం వారిది. ఎవరి నిర్ణయం వారిది అయ్యింది ఇందువలన !

బౌద్ధంలో ఇలా అనేక శాఖలు ఏర్పడ్డాయి (Branches of the Dhamma). ఈ ప్రతీశాఖకూ ఒక ప్రవర్తకుడెవరో వుంటాడు, ఆయన వెనక కొందరు సంఘ పితరులు వుంటారు. వీరంతా కలిపి ఒక వర్గం (Group) అవుతారు. ఈ వర్గం ప్రవర్తకుణ్ణి "థేరా" అనేవారు.

సారిపుత్త, మొగ్గల్లాన, అనురుద్ధ.... వీళ్ళంతా "థేరా"లుగా వ్యవహరించిన వారే! ఒక్కో థేరా దగ్గర కనీసం 30-40 మంది సంఘ పితరులుండేవారు.

"సారిపుత్త" శిష్యుల్ని "మహా పణ్ణావంతా" అని పిలిచారు. మొగల్లాన శిష్యుల్ని "మహి ద్ధికా" అన్నారు. అంటే మహిమాన్వితశక్తులు (Miraculous Powers) కల్గిన వారని అర్థం.

మహా కాశ్యపుడి శిష్యుల్ని ధూత వాదులన్నారు. ఆయన సిద్ధాంతం ధూత సిద్ధాంతం! అనిరుద్ధుడిది దివ్య చక్షు సిద్ధాంతం. దేవదత్తుడి సిద్ధాంతానికి "పాపిచ్ఛా" అని పేరట. "పాపానికే మొగ్గు" అని దీని అర్థం.

మౌలిక బౌద్ధ సిద్ధాంతాల్లో మార్పులేకపోయినా, రోజులు గడుస్తున్న కొద్దీ సామాజిక జీవనంలో వచ్చే మార్పులకు అనుగుణంగా ప్రాంతాల్ని బట్టి, భావాల్ని బట్టి, జాతుల్ని బట్టి కూడా ఇలాంటి తేడాలు ఏర్పడేందుకు సహజంగా అవకాశం వుంది.

ఈ సిద్ధాంతాలు కూడా కాలక్రమంలో మరిన్ని మార్పులకు లోనయ్యాయి. అభిధమ్మికులు సర్వాస్తివాదులుగా మారారు. ధూత వాదులు మహా సాంఘికులుగా మారారు. మహాకచ్ఛాయనులు సమ్మితీయులుగా మారారు.

ఇవన్నీ ఆలోచనా విధానాలలో పరిణామ క్రమంగా ఏర్పడిన మార్పులు. "బౌద్ధం" ఆలోచనలకు సంబంధించినదే కాబట్టి ఈ మార్పులు సహజం!

## రెండవ సంగీతి

ఈ పరిస్థితుల్లో బుద్ధుని నిర్యాణం తర్వాత ఒక శతాబ్దానికి రెండో సంగీతి జరిగింది. వైశాలికి చెందిన భిక్షువులు 10 నియమాల్ని ప్రతిపాదించారు. దానిమీద చర్చించేందుకు (దశవత్థూని), అలాగే మహాదేవుడు ప్రతిపాదించిన 5 నియమాలను చర్చించేందుకు ఈ సంగీతిని నిర్వహించారు.

ఈ సదస్సు వైశాలిలోనే జరిగింది. అప్పుడు శిశునాగ కాలాశోకుడు పరిపాలిస్తున్నాడు. ఇందులో వైశాలి భిక్షువులు ఓడిపోయారు. వారిని సంఘంలోంచి బహిష్కరించారు. ఈ సంగీతికి ముందుగా "సభాగా" అంటే, ఇంచుమించు ఒకే అభిప్రాయం కల్గిన వివిధ ప్రవర్తకుల్ని ఒకచోట చేర్చి ఒకే వాదంగా తీర్చిదిద్దే ప్రయత్నం చేశారు. సుత్తాంతికులు, వినయధరులు, ధమ్మ కథియలు కలిసిపోవడానికి అంగీకరించడంతో వీరందరికీ ఒకేచోట భోజనం, పడక ఏర్పాట్లు చేశారట. అంటే, వివిధ వాదాలకు చెందిన బౌద్ధులు ఒకరితో ఒకరికి అంత బద్ధవైరాన్ని భావించుకునే వారని, కనీసం కలిసి తినడానికి, కలిసి పడుకోవడానికూడా ఇష్టపడేవారు కాదని దీన్నిబట్టి మనం అర్థం చేసుకోవచ్చు.

మొత్తం మీద, చీలడం కలవడంగా సాగి, రెండు ప్రధాన వర్గాలు మిగిలాయి. ఒకటి స్థవిరులు. స్థవిరులంటే పెద్దలని! రెండవది మహాసాంఘికులు. ఎక్కువమంది బౌద్ధులు ఇటువైపు ఉన్నారని సూచించడానికి బహుశా మహాసాంఘికులు అని పిలుచుకొని వుండవచ్చు.

## మౌలికమైన విభేదాలు ఇవీ .....

స్థవిరులకు, మహాసాంఘిక వాదులకూ మధ్య ఏర్పడిన మౌలిక విభేదాలు ఇలా వున్నాయి. ఇవి పరిశీలించండి.

1. **శింగిలోనకప్ప :** శింగి అంటే కొమ్ము (horn). ఉప్పుని కొమ్ములో భద్రపరిచి దాచుకునే విషయంలో ఈ రెండు సంఘాలు విడిపోయాయి.

2. **ద్వంగుళకప్ప :** మధ్యాహ్నం కావడానికి ముందు భోజనం చేయాలా... మధ్యాహ్నం అయిన తర్వాత భోజనం చెయ్యాలా... అనే రెండు విషయాల్లో ఏకాభిప్రాయం కుదరలేదు.

3. **గామాంతర కప్ప :** ఈ ఊరునుంచి ఇంకో ఊరు వెళ్ళినప్పుడు ఒకే రోజులో రెండోసారి భోజనం చెయ్యవచ్చా - చెయ్యకూడదా .....

4. **ఆవాసకప్పో :** ఒకే ఆవాసంలో (బౌద్ధ ఆరామం) రెండు వేర్వేరు బౌద్ధ సిద్ధాంతాల భిక్షువులు "సంఘ కమ్మ" నిర్వహించవచ్చా ? సంఘకమ్మ అంటే బౌద్ధ సంఘానికి సంబంధించిన జనరల్ బాడీ సమావేశం. దీన్ని వేర్వేరు బౌద్ధ సంఘాల వాళ్ళు ఒకే ఆవాసం (కమ్యూనిటీ హాలు)లో జరుపుకోవడం ఒక వివాదం.

5. **అనుమతి కప్పో :** ఒక్కోసారి తీర్మానం లేకుండానే ఒక నిర్ణయం తీసుకొని దాన్ని అమలు చేసి, ఆ తర్వాత జనరల్ బోడీలో పెట్టి ఆమోదింప (ratify) చేసుకొంటూ వుంటాంకదా..... అలా "సంఘ కమ్మ" అయిపోయిన తర్వాత సభ్యులైన భిక్షువులు అనుమతి కోరడం మీద ఏకాభిప్రాయం కుదరక ఈ రెండు బౌద్ధ సిద్ధాంతాలు ఒక దానితో ఒకటి విభేదించాయి.

6. **ఆసిణ్ణకప్పో :** గతంలో ఇలాంటప్పుడు ఇలాంటి నిర్ణయం తీసుకున్నాం అని ఉదహరించి దాని ప్రకారం ఇప్పుడుకూడా ఇలానే నిర్ణయించాలి అనడాన్ని ప్రిసీడెన్సీ అంటారు. పూర్వాచారాన్ని బట్టి నడవడం అని! అలా కుదరదని విభేదించింది ఒక సిద్ధాంతం.

7. **అమధిత కప్పో :** అమధితం అంటే చిలకని పెరుగు. దీన్ని భోజనంలోగాని ఆ తర్వాత గాని తీసుకునే విషయంలో స్పర్ధ ఏర్పడింది. పెరుగు కన్నా మజ్జిగ మంచిది కదా..... ఆ విషయాన్ని ఈ ఇద్దరూ ఆలోచించి ఉండరు.

8. **జలోగిపాత కప్పో :** కల్లుతాగవచ్చా లేదా అనే విషయం మీద వివాదం.

9. **అడసక నిసిదాన కప్పో :** కూర్చునేప్పుడు చాపని ఉపయోగించాలా - కంబళి లాంటిదాన్ని వినియోగించాలా అనేది ఇంకో స్పర్థ.

10. **జాతరూప రజత కప్పో :** బంగారాన్ని గానీ వెండిని గాని భిక్షగా స్వీకరించడం.

మహా సాంఘికులు ఇలాంటి మౌలికమైన బౌద్ధ విషయాల్ని తేలికగా తీసుకుని ఇష్టారాజ్యంగా ప్రవర్తిస్తున్నారని థేరవాదులు లేదా స్థవిరులు ఆరోపించారు. థేరవాదుల్ని పరమ ఛాందసవాదులుగానూ, హాస్యాస్పదమైన విషయాల గురించి అర్థంలేని వితండ వాదనలు చేస్తారని మహాసాంఘికులు విమర్శించారు.

# మహాదేవుని సవరణలు

1. ధ్యాన స్థితిలో వుండి బాహ్య ప్రపంచ స్పృహలేని స్థితిలో వున్న బౌద్ధ భిక్షువు కారణంగా తెలియక ఏదైనా తప్పు జరిగితే అది తప్పుకాదు.
2. ఏ విధిని, ఏ నియమాన్ని ఎందుకు పాటిస్తున్నామో స్పష్టంగాతెలిసి దానిని పాటించాలి.
3. బౌద్ధ గ్రంథాలలో చెప్పిన విషయాలను అర్హతుడు సందేహించవచ్చు.
4. గురువు సహాయం లేకుండా ఎవరికి వారే స్వంతంగా అర్హతులు కాలేరు.
5. ధ్యాన స్థితిలో వున్నప్పుడు పొందగలిగేదే అసలైన జ్ఞానం.

ఈ సవరణల్ని ఛాంసవాదులు అంగీకరించలేదు. ఉదారవాదం వలన బౌద్ధం తన రూపురేఖల్ని కోల్పోయి చివరికి నశించిపోతుందనీ, బుద్ధుడు గీసిన గీత దాటడానికి వీల్లేదని వాదించారు. అవి వందేళ్ళనాటివి – రోజులు మారాయి – మనంకూడా కొంత మారాలి – అని వాదించారు ఉదార వాదులు. శుద్ధ బౌద్ధవాదుల్ని అర్హతులనీ, థేర వాదులని కూడా పిలిచేవారు. థేర అంటే 'పెద్ద' (elder) అని!

ఇవన్నీ బౌద్ధపరమైన క్రమశిక్షణకు సంబంధించిన విభేదాలు. విడిపోయేటంత గొప్ప ఇబ్బందులేమీ కాకపోవచ్చు – కానీ, ఒక వర్గానికి తగిన ప్రాధాన్యత లేనప్పుడు ఆ వర్గం మర్యాదగా పక్కకు తప్పుకుంటేనే మంచిది. ఆవిధంగా చీలిక తప్పులేదు. చీలికకు కారణాలు కావాలి. ఇష్టం లేనప్పుడు ప్రతిదీ చీలిపోయేంత కారణమే అవుతుంది.

అర్హతులు మహాదేవుని ఉదారవాద ప్రతిపాదనల్ని తిరస్కరించి కుదరదని తేల్చిచెప్పేశారు. ఉదారవాదులు తమని మహాసాంఘికులుగా చెప్పుకున్నారు.

అర్హతులు బౌద్ధ సంఘంలో ఆధిపత్య భావంతో ప్రవర్తించే వారని, సాటి భిక్షువుల పట్ల చిన్నచూపుతో వ్యవహరించే వారనీ, మహాసాంఘికులు ఒక విధంగా అర్హతుల పట్ల తిరుగుబాటు చేసినట్లేనని పండితులు భావిస్తారు.

బ్రాహ్మణులు తామే అధిక భక్తులైనట్లు ఇతరులపట్ల చిన్న చూపుతో ఎలా ప్రవర్తించేవారో అలాగే అర్హతుల ప్రవర్తనని కూడా ఉదారవాదులు బ్రాహ్మణుల కాలంనాటి కొందరు వైదిక ఋషుల ప్రవర్తనతో పోల్చుకున్నారు.

కానీ, సభలో అర్హతులదే పై చెయ్యి అయ్యింది. ఆ సంగీతిలో అర్హతులు మాత్రమే వుండాలని, అర్హతులు కానివారికి ఆ సభలో వుండే అర్హత లేదని మహాదేవుడి వర్గాన్ని సభలోంచి బైటకు వెళ్ళగొట్టారు. దాంతో విధిలేక ఉదారవాదులు స్వంతంగా విడిగా ఇంకో సంగీతి జరుపుకున్నారు.

ఈ సంగీతి (మహాసభ)లో "మహా సాంఘిక వాదం" ఏర్పడింది. బౌద్ధ ధర్మాలలో ఇది ఒక కొత్త పార్టీ లాంటిది!

## అశోకుడు ప్రచారం చేసిన మహాసాంఘికం



బుద్ధుడి తర్వాత తొలి రెండు శతాబ్దాల కాలాల వరకూ వెలువడిన బౌద్ధ గ్రంథాలు మూల బౌద్ధం లేదా ఆదిమ బౌద్ధానికి చెందినవిగా వున్నాయి. దక్షిణ ఆసియా దేశాలలో వీటి అనువాదాలు ఎక్కువ వ్యాప్తిలో వున్నాయి. తొలినాటి బౌద్ధం వివరాలు వీటిలో బాగా దొరుకుతాయి.

ఉత్తర భారతదేశంలో ఒక్కొక్కరే బౌద్ధంలోకి ప్రవేశిస్తున్న కాలంలో దక్షిణ భారతదేశంలో మూకుమ్మడిగా ప్రజలు బౌద్ధాన్ని స్వీకరించి వుంటారని మనం ఊహించ వచ్చు. ముఖ్యంగా కృష్ణా గోదావరి తీర ప్రాంతాల్లో బౌద్ధ క్షేత్రం కాని ప్రాచీన గ్రామం లేదంటే అతిశయోక్తి కాదు. ఉత్తర భారతీయులకన్నా తెలుగువారు, సింహళీయులు ఎక్కువగా బౌద్ధులయ్యారు. అశోకుడు ఇక్కడ బౌద్ధ మత ప్రచారం చేపట్టే వరకూ ఆదిమ బౌద్ధమే వ్యాప్తిలో వుంది. బహుశా చీలికకు కారణమైన వారిలో తెలుగు ప్రముఖులు కూడా వుండి వుండవచ్చు.

ఛాందసవాద బౌద్ధుల్ని సూత్ర భారకులని కూడా పిలిచారు. వారిది సిద్ధాంత (theory) ప్రధానం . మహాసాంఘికులు ఆచరణకు ప్రాధాన్యత నిచ్చారు. బౌద్ధ కర్మాచరణని "వినయం" అంటారు. అందుకని వాళ్ళని "వినయ భారకులు" అంటారు వారికి కర్మాచరణం (practicality) ముఖ్యం. మౌర్య అశోకచక్రవర్తి మహాసాంఘికుల పక్షం వహించాడు. మొదటి విడతగా తెలుగు ప్రాంతాలు, సింహళానికి తన కన్న బిడ్డల్ని, తన తమ్ముడు మహాదేవుణ్ణి కూడా పంపించాడు. మహాసాంఘిక బౌద్ధాన్ని ప్రచారం చేశాడు. చైత్య వాదాన్ని ప్రబోధించి మహాచైత్య స్థూపాల్ని పెద్దపెద్ద నిర్మాణాలుగా పునర్నిర్మించాడు.

## మహాసాంఘిక బౌద్ధం

"దీపవంశ" అనే బౌద్ధ గ్రంథంలో పేర్కొన్న వివరాల ప్రకారం కొత్తగా ఏర్పడిన మహాసాంఘికులు పోటీగా నిర్వహించిన మహాసభ పేరు మహా సంగీతి. అందులో అనర్హతులు, అర్హతులు, బౌద్ధ సంఘాలలోని అధికారిక సభ్యులందరినీ ఆహ్వానించారు.

పూర్వపు "వినయ" నియమాలన్నింటిని సమీక్షించి, అప్పటి పరిస్థితులకు అనుగుణంగా కొన్ని మార్పులు చేశారు. పరివార, అభిదమ్మ ప్రకరణం, పతి సంబిధ, నిద్దేశ, ఇంకొన్ని జాతక గ్రంథాల్ని పూర్తిగా తిరస్కరించారు.

మహాసాంఘికులు బుద్ధుడి పట్ల గౌరవ ప్రపత్తులు ప్రదర్శిస్తూ, 5 పిటక గ్రంథాల్ని ఒకచోట చేర్చారు. సూత్రం, వినయం, అభిధమ్మం, ఇతరేతరాలు, ధారణీయాలు - ఈ ఐదు అధ్యాయాల్ని పిటకలంటారు. మహాసాంఘికులు వీటిని బాగా ప్రాచుర్యంలోకి తీసుకువచ్చారు. మహాసాంఘిక బౌద్ధ ధర్మాల్ని అత్యధికంగా ప్రచారం చేసింది తెలుగువారు. అత్యధిక గ్రంథాలు వెలువరించింది కూడా తెలుగువారే. అమరావతి, నాగార్జున కొండలలో క్రీస్తుశకం 3వ శతాబ్ది నాటి శిలాఫలకాలలో మహాసాంఘిక విషయాలు చాలా లభించాయని పరిశోధకులు పేర్కొన్నారు.

యువాన్‌త్స్యాంగ్ మహాసాంఘిక అభిదమ్మ గ్రంథాలలో కొన్నింటిని ఇద్దరు బౌద్ధ పండితుల దగ్గర శిష్యరికం చేసి ధాన్యకటకంలో నేర్చుకున్నట్లు రాసుకున్నాడు.

మహాసాంఘిక అభిదమ్మ సూత్రాలలో కూడా ధాన్యకటకంలో రెండు వైరివర్గాలున్నాయి. "పుబ్బశెలికా" (పూర్వ శైలికులు) అనీ, అపర శెలికా (అపర శైలికులు) అనీ.....!

తూర్పు పడమర కొండల పేరుతో ఈ సిద్ధాంతాల్ని పిల్చుకున్నారు. తూర్పున వున్న ఒక కొండమీద, పడమరన వున్న ఇంకొక కొండ మీద, బహుశా ఆయా సిద్ధాంతాల కేంద్ర స్థానాలు నడుస్తూ వుండి వుంటాయి..... అప్పట్లో! ఇవి కృష్ణానది తీరంలోనే వుండి వుంటాయని పరిశోధకుల భావన.

బెజవాడ మొగల్రాజపురం కొండను కేంద్రంగా చేసుకున్న బౌద్ధులు తూర్పు శైలికులు (పుబ్బశెలికా) గానూ, కృష్ణకు ఆవలి తీరంలో ఉండవల్లికొండ కేంద్రంగా చేసుకొన్న బౌద్ధులు అపర శైలికులు గానూ పిలవబడ్డారని కొందరు పరిశోధకుల భావన. శ్రీశైలం, నాగార్జున కొండలపైన పూర్వ, అపర శైలికుల కేంద్రాలుండేవని మరికొంద రంటారు.

నాగార్జున కొండలో దొరికిన క్రీస్తు పూర్వం 3వ శతాబ్దినాటి శాసన ఫలకాలలో "పంచమాతుక" అనే పదం కన్పించిందిట! డా॥ యన్. దత్ "మాతిక" అంటే "వినయ పిటిక" మొదలైన ఐదు బౌద్ధ గ్రంథాలుగా పేర్కొన్నారు.

బుద్ధుడి ప్రధాన శిష్యుడు "తిస్సామొగ్గాలి పుత్త" రాసిన "మహావస్తు" గ్రంథమే ఈ వినయ పిటికకు మాతృక అనీ, దీన్ని అనుసరించే వారిని లోకోత్తర వాదులు అంటారనీ, లోకోత్తరవాదులు మహాసాంఘిక బౌద్ధ విధానంలో ఒక ముఖ్యశాఖ అనీ ఒక వివరణ ఉంది.

పిటక అంటే, పాళీభాషలో బుట్ట లేదా గంప అని అర్థం. ఆయా భావాలన్నింటినీ ఒక చోట చేర్చి దాన్ని పిటక అని పిలిచారు.

## వ్యక్తిగత విభేదాలే సైద్ధాంతిక విభేదాలైనాయి

బౌద్ధం మౌలికంగా మేథావుల కూటమి. రెండు గడియారాల్లాగానే ఇద్దరు మేథావులు ఏకీభవించడం అరుదుగా జరిగే వ్యవహారం. ఇంక కంటికి కనిపించని అంటే, ప్రత్యక్ష ప్రమాణానికి లొంగని పారమార్థిక విషయాల మీద ఏకాభిప్రాయం సహజంగానే అసాధ్యం అవుతుంది. చాలా సందర్భాల్లో వ్యక్తిగత విభేదాలే సైద్ధాంతిక విభేదాలుగా రంగు పులుముకుంటాయి.

కాశ్యపీయ, వాత్సిపుత్రీయ, బహుశ్రుతీయ వంటి బౌద్ధ శాఖలు సుప్రసిద్ధ బౌద్ధాచార్యుల పేర్లను అనుసరించే ఏర్పడినట్లు కన్పిస్తోందంటారు హనుమంతరావుగారు.

బుద్ధుడు జీవించిన కాలంలోనే దేవదత్తుడు తిరుగుబాటు చేసి బౌద్ధాన్ని చీల్చడానికి ప్రయత్నించాడు, బుద్ధుడిపైనే అసంతృప్తి ప్రకటించి ఆయనకు ఏమీ రాదని అన్న వాళ్ళుకూడా ఆయన శిష్యుల్లో వున్నారు.

బుద్ధుడి నిర్యాణానంతరం జరిగిన సంగీతిలో థేరవాదుల ఆధిపత్యం కారణంగా బహిష్కృతులైన భిక్షువులు అమరావతిలోని ధనకటకానికి చేరారని వూహించేందుకు ఆస్కారం వుంది. ధనకటకంలోని ఒక శాసనంలో కన్పించే పాటలీపుత్ర భిక్షువు ఇలా చేరినవాడే!

తెలుగువారైన బౌద్ధులు బౌద్ధంలోని అంశాలన్నింటినీ ప్రజాపరం చేయడంలో పోటీ పడ్డారు. ఉదాహరణకి నిర్వాణాన్ని ఎవరికి వారు వ్యక్తిగతంగా సాధించుకోవాల్సిన విషయం అనడంలో ప్రత్యేకత ఏమీలేదు. అది సహజం కాబట్టి! కాని, తెలుగు బౌద్ధులు దాన్ని కూడా ప్రజాపరం చేసి, "అమృత పదం సంపత్తి" గా పేర్కొన్నారు. సామూహికంగా ప్రజలంతా నిర్వాణం సాధించవచ్చు నన్నారు.

## నాలుగో సంగీతి

క్రీస్తుశకం రెండో శతాబ్దం నాటికి ఆంధ్రదేశంలో స్వర్ణయుగంగా వెలుగుతున్న మహాయాన బౌద్ధం ఆఫ్ఘనిస్తాన్, పంజాబ్ సరిహద్దుల వరకూ విస్తరించడం మొదలయ్యింది.



కనిష్కుడు జలంధర్‌లో నాలుగవ సంగీతిని నిర్వహించాడు. థేరవాదులు (ఛాందసవాద బౌద్ధులు) ఈ సంగీతిలో మహాయాన బౌద్ధాన్ని తీవ్రంగా నిరసించారు.

కనిష్కుడు ఈ వివాదాలకు అతీతంగా వ్యవహరించాడు. 500 మంది భిక్షువుల్ని కాశ్మీరు నుంచి రప్పించి వసుమిత్రుడి నాయకత్వంలో త్రిపిటకాలపై వ్యాఖ్యానాలు రాయించాడు.

3 లక్షల సూత్రాలతో, 90 వేల అంశాలతో వున్న త్రిపిటక సంకలనాన్ని పూర్తి చేయడానికి ఈ భిక్షువులకు 12 సంవత్సరాలు పట్టింది. వ్యాఖ్యానాలు చేసుకొంటూ పోతున్నప్పుడు, అనేక కొత్త అంశాలు వీటిలో చోటుచేసుకున్నాయి. వీటన్నింటిని కలిపి తిరిగి సంస్కృత భాషలోకి అనువదింపచేయించాడు కనిష్కుడు. బుద్ధిజాన్ని చాలా తేలికగా దేశం అంతా, విదేశాల్లో కూడా వ్యాపింపచేయడానికి ఈ సంస్కృత అనువాదాలు బాగా ఉపయోగపడ్డాయి.


కనిష్కుడు నిర్మించిన బుద్ధ విగ్రహాలు ఇటీవలే విధ్వంసానికి గురైనాయి.

అఫ్ఘనిస్థాన్‌లో అకారణ మతద్వేషంతో బిన్‌లాడెన్ విధ్వంసకులు కనిష్కుడు నిర్మింపచేసిన బుద్ధుడి అపురూప మహావిగ్రహాల్ని అకారణంగా ధ్వంసం చేశారు. క్రీ.శ. 100 నుంచి 2000 సంవత్సరాల పాటు చెక్కుచెదరకుండా నిలిచి వుండి, మనందరం టీవీల్లో చూస్తుండగానే కూలగొట్టబడి ముక్కలయి పోయాయి.

7వ శతాబ్దిలో శ్వేత హూణులు, 1193లో మహమ్మద్ ఖిల్జీ బౌద్ధం మీద కన్నెర్రచేసి స్తూపాల్ని, బౌద్ధ విగ్రహాల్ని సర్వనాశనం చేశారు. బీహార్‌లో బౌద్ధం లేదు అన్నంతగా ధ్వంస రచనచేశారు.

## బౌద్ధం ఇలా పతనం అయ్యింది.....!

హేతువాదాన్ని ఊపిరిగా పోసుకు పుట్టిన బౌద్ధం చీలిక తర్వాత భారతదేశంలో అనేక మార్పులకు లోనయ్యింది. ఇక్కడ జరిగిన పరిణామాల్ని ఒకసారి పునస్సమీక్ష చేద్దాం.

1. మహాయానంలోంచి చైత్యారాధన ప్రారంభం అయ్యింది. చైత్యానికి దేవుడి హోదా కల్పించడం లోనే హేతువాదానికి బౌద్ధం తిలోదకాలిచ్చేసినట్లయ్యింది. బౌద్ధంలోకి భక్తి ప్రవేశించింది.
2. భౌద్ధ మేధావుల్లో హేతువాద దృష్టి లోపించడంవలన విగ్రహారాధన కూడా ప్రవేశించింది. బుద్ధుడి విగ్రహాలు, బుద్ధుడి జాతక కథలు బౌద్ధం మౌలిక లక్ష్యాన్ని తొలగదోశాయి.



3. కాలక్రమంలో పంచశీలాల్ని వదిలేసి, మంత్రయానం, తంత్రయానం, వజ్రయానం, ఇలాంటివి వచ్చాయి.
4. సిద్ధి పొందడం మీద బౌద్ధులకున్న ఆసక్తి బుద్ధత్వం పొందడం మీద లేకపోవడం వలన బౌద్ధం దానికదే నశించింది. ఎవరో నశింపచేసివుంటారని వాటి ఆధారాల్ని వెదకడం కన్నా అర్థం లేని ప్రయాస ఇంకొకటి వుండదు. చచ్చే పాముమీద ఎవరైనా ఒకదెబ్బ వేస్తే వేసి వుండొచ్చు. చావుకు అది ప్రధాన కారణం కాదు కదా !
5. మగధ శుంగరాజులు, వంగదేశపు శశాంకులు, తెలుగు నేలనేలిన అనేక వైదిక రాజులు బౌద్ధుల్ని కొంత హింసించారు గాని, వారి వలన బౌద్ధం నశించిపోలేదు. 12-13 శతాబ్దాల దాకా బౌద్ధం అమరావతి తదితర చోట్ల బతికే వుంది.
6. క్రీ.శ. 8వ శతాబ్ది తర్వాత బౌద్ధం పూర్తిగా తాంత్రిక మార్గంలోకి మళ్ళింది. ఆ దశలో ఆది శంకరుడు భ్రష్టుపడ్తున్న బౌద్ధ మార్గాన్ని ఎత్తిచూపి, వ్యతిరేక ప్రచారం చేశాడు. బుద్ధుడికి 13 వందల ఏళ్ళ తర్వాతి వాడైన శంకరుడు "నిర్యాణం" అనే బౌద్ధ పదాన్ని "ముక్తి మోక్షం"గా మార్పుచేసాడు. ఆనాటికి ఆధునికీకరించిన బౌద్ధ ధర్మాలుగా శంకరుడి ప్రబోధనలు వ్యాప్తిలోకి వచ్చాయి. మనుషుల మధ్య సమానత్వమే గాని, భిన్నత్వం లేదనే "అద్వైత" దృష్టిని ప్రతిపాదించాడు శంకరుడు. ప్రచ్ఛన్న బౌద్ధుడిగా ఆయన్ని పిలిచారు.
7. బౌద్ధ సంఘారామాలు పోషకులు లేక నిర్జీవంగా తయారయ్యాయి. అవి చెయ్యగలిగిన మత ప్రచారాలు గానీ, సామాజిక కార్యకలాపాలు గానీ కొత్తగా ఏమీ లేకపోయాయి. మేధావి సామాజిక వర్గాలు బౌద్ధానికి దూరం కావడంతో వాద ప్రతివాదాల్లో బౌద్ధాన్ని సమర్థించగలిగే వారు కరువయ్యారు. అసమర్థుల కేంద్ర స్థానాలుగా బౌద్ధ సంఘారామాలు మారిపోయాయి.
8. క్రమేణా మహమ్మదీయుల దండయాత్రకు భారతదేశం గురికావడం మొదలయ్యింది. శివాలయాలు, బౌద్ధారామాలు వాళ్ళ కన్నెర్రకు కారణం అయ్యాయి. బౌద్ధవిహారాల్ని కూలగొట్టడం, సంఘారామాల్ని తగలబెట్టడం చేశారు. అలాగే జైన, బౌద్ధ విగ్రహాలు కూడా బలిఅయిపోయాయి. బౌద్ధ భిక్షువులు నేపాల్, టిబెట్, చైనాల వైపు వలసపోయారు.

ఇన్ని కారణాలతో బౌద్ధం నశించిందని పరిశోధకులు విశ్లేషిస్తారు. ఇక్కడో ముఖ్య విషయం చెప్పాలి.....

పరదేశాలకు పోయిన వారు పోగా బౌద్ధ ధర్మాన్ని, పంచశీలాన్ని పాటించే బౌద్ధ అభిమానులైన ప్రజలు-వారు చాలా కొద్దిమంది మాత్రమే అయినా, మరో మార్గాంతరం లేక శైవంలోకో, వైష్ణవంలోకో మారిపోయారు. వర్ణాశ్రమ వ్యవస్థలో వారూ భాగం అయిపోయారు. మరికొంతమంది మహమ్మదీయులుగా కూడా మారిపోయారని అంటారు.

## గ్రీకు బౌద్ధులు


ఒక గ్రీకు బౌద్ధుడు, మైత్రేయుడు, బుద్ధుడు మరో ఇద్దరు భిక్షువులు

ఆసియా దేశాల్లో బౌద్ధం విస్తరణ జరుగుతున్న సమయంలోనే అశోకుడి కారణంగా గ్రీకులు అనేక మంది బౌద్ధధర్మాల్ని స్వీకరించారు.

సెల్యూసిడ్ రాజ వంశీకుడు (క్రీ.పూ. 261-246), యాంటియోకస్ II, ఈజిప్ట్‌కు చెందిన టోలెమి II, ఫిలడెల్ఫాస్ (క్రీ.పూ. 285-247), మెసిడోనియాకు చెందిన యాంటిగోనస్ గోనటాస్ (క్రీ.పూ. 276 - 239), సెరిన్‌కు చెందిన మగాస్ (క్రీ.పూ. 288 - 258), ఎపిరస్‌కు చెందిన అలెగ్జాండర్ (క్రీ.పూ. 272 - 255)..... వీళ్ళు బౌద్ధులైనట్లు అనేక శాసనాధారాలను బట్టి కనుగొన్నారు.

"ఇది ధర్మానికే విజయం. ఆరువందల యోజనాల దూరాన (4000 మైళ్ళు) గ్రీకురాజు యాంటియోకస్ పరిపాలించే దేశం సరిహద్దులు దాటి ధర్మం" ప్రవేశించింది. ఇంకో నలుగురు రాజులు టోలెమి, యాంటిగోనస్, మగస్, అలెగ్జాండర్ అలాగే దక్షిణాన చోళులు, పాండ్యులు,..... తామ్రపర్ణి (సింహళం) దాకా బౌద్ధాన్ని తనకారణంగా విస్తరించినట్లు అశోకుడి ఒక శాసనంలో వుంది.

ఈ శాసనంలో ఆంధ్రుల ప్రస్తావన లేదు. ఎందుకంటే, అశోకుడి కాలానికే ఇక్కడ బౌద్ధం విస్తరించివుంది కాబట్టి!

కాబూల్‌లో అశోకుడిది గ్రీకు, బర్మా రెండు భాషాపదాలు కలగలిసిన శాసనం ఒకటి దొరికింది. క్రైస్తవానికి ముందే కొన్ని దేశాలలో క్రైస్తవ తరహాలో మొనాస్టరీలు వుండటానికి కారణం బౌద్ధమేనంటారు.

క్రీస్తు పుట్టనున్నాడని భవిష్యత్తు పలికి, నక్షత్రం మార్గం చూపిస్తుండగా జుడీ ప్రాంతంలోకి వచ్చిన వేదాంతులలో (Philosophers) బౌద్ధులు, బ్రాహ్మణులూ వున్నారని క్లిమెంట్ ఆఫ్ అలెగ్జాండ్రియా సాక్ష్యం!

మొదట గ్రీసులు, తర్వాత వరుసగా ఈజిప్షియన్లు, డ్రూయిదులు, గౌలులు, బాక్ట్రియన్లు, సెల్ట్‌లు, పర్షియన్ "మాగీ"యులు..... వీళ్ళకు చెందిన బౌద్ధ భిక్షువులు ఈ వేదాంతుల్లో వున్నా రంటారు. పాశ్చాత్య దేశాలలో భావవిప్లవాన్ని సాధించిన క్రైస్తవానికి బౌద్ధం ప్రేరణగా నిల్చిందని పండితులంటారు.

## బౌద్ధాన్ని పరిరక్షించడానికి గ్రీకుల దాడి



గ్రీకో బాక్ట్రియన్ రాజు డిమెట్రియస్ I క్రీ.పూ. 180 లో పాటలీపుత్రం (పాట్నా) వరకూ భారతదేశపు ఆర్యావర్తాన్ని జయించాడు. ఆవిధంగా గ్రీకు రాజ్యం డెమెట్రియస్ ఆధ్వర్యంలో ఉత్తరప్రదేశ్, బీహార్ రాష్ట్రాల్లో ఏర్పడింది.

సుంగులు (క్రీ.పూ. 185-73) చేస్తున్న బౌద్ధ విధ్వంసాన్నుంచి రక్షించడానికే తాము ఇక్కడ రాజ్యం స్థాపించినట్లు గ్రీకులు చెప్పుకొన్నారు.

ఇండో గ్రీకు చక్రవర్తుల్లో మెనాండర్ (క్రీ.పూ. 160 - 135) స్వయంగా బౌద్ధుడిగా మారాడు. నాగసేనుడితో మెనాండర్ జరిపిన దీర్ఘ సంభాషణ "మిలింద పన్హా"లో కన్పిస్తుం దంటారు. మెనాండర్ మరణించినప్పుడు, దాన్ని నిర్వాణంగా భావించి, అతని చితాభస్మాలపై అనేక నగరాల్లో బౌద్ధ స్తూపాలు నిర్మించారు. ఈ అపురూప గౌరవం భారతదేశంలో ఈ గ్రీకురాజుకే దక్కింది. ఎనిమిది ఆకుల ధర్మ చక్రం ముద్రించిన మెనాండర్ I నాణాలు బ్రిటిష్ మ్యూజియంలో వున్నాయి.

## రోమ్‌లో ఆత్మాహుతి చేసుకున్న భారతీయ బౌద్ధుడు!



క్రీస్తు శకం 13వ సంవత్సరం...

ఏథెన్స్‌లో ఒక భారతీయ బౌద్ధ భిక్షువు బౌద్ధ ప్రచారం చేస్తున్నాడు. అతను బౌద్ధంపట్ల తన అంకిత భావం ఎలాం టిదో నిరూపించుకోదలిచాడు. త్యాగానికి బౌద్ధం ఎంత ప్రాముఖ్యత నిస్తుందో చాటిచెప్పాలనుకున్నాడు. ప్రజలందరి సమక్షంలో అగ్నిప్రవేశం చేసి ఆత్మాహుతి చేసుకున్నాడు.

ఈ సంఘటన రోమ్‌లో గొప్ప సంచలనాన్ని కల్గించింది. ప్రజలు ఆయన పట్ల సానుభూతి చూపించారు. ఆయన నమ్మిన "ధర్మం" గొప్పదని భావించారు. ఆయన

గౌరవార్థం స్తూపం ఆకారంలో ఒక సమాధిని నిర్మించారు. దాని మీద "ఇండియాలో బారిగాజా నుంచి వచ్చిన ఒక శ్రమణకుడు" [ZA MMANO XHTA Σ EINAΔ OΣ AT 10 BAPTO Σ HΣ] అని రాసివుందిట. ఇప్పటికీ ఏథెన్స్‌లో ఈ సమాధిని చూడ వచ్చుంటారు. క్రీస్తు జీవించివున్న కాలంలో జరిగినదిగా భావిస్తున్న సంఘటన ఇది.

## గ్రీకు భాషలో బౌట్టా అంటే బౌద్ధ !

క్లిమెంట్ ఆఫ్ అలెగ్జాండ్రియా వెలువరించిన క్రైస్తవ గ్రంథాలలో ది స్ట్రొమోటా (లేక) మిస్సెలేనాస్ ఒకటవ భాగంలో బుద్ధుడి ప్రస్తావన వుంది. భారతీయ వేదాంతులు బౌట్టా సిద్ధాంతాల్ని గౌరవిస్తారని, బౌట్టా (BOUTTA)ని దేవుడిగా ఆరాధిస్తారని, అసాధారణ పవిత్రతని ఆయన ప్రదర్శించాడనీ పేర్కొన్నాడు. "బౌట్టా" అంటే గ్రీకుభాషలో బౌద్ధ అని అర్థం!

బుద్ధుడు, ఏసుక్రీస్తు ఒకే విధంగా కన్నెలకు జన్మించారని పవిత్రాత్మ (HOLY GHOST)ని సందర్శించడానికి వెళ్ళినప్పుడే ఇద్దరి విషయంలోనూ ఇలా జరిగిందనీ ఓ గ్రీకు బౌద్ధ గ్రంథంలో వుంది.

"ఓల్డ్ వరల్డ్ ఎన్‌కౌంటర్స్" గ్రంథంలో బెంట్లీ తొలి క్రైస్తవం మీద బౌద్ధంప్రభావం గురించీ, కరుణ, సత్యవాక్పాలన, ఆశ్రమ జీవితం, శ్రమణక జీవనం..... వాటి విషయంలో క్రైస్తవానికి బౌద్ధం బాగా తోడ్పడిందని రాసినట్లు పండితులు చెప్తారు.



కుషాణుల రాజు కనిష్కుడు కాలంనాటి (క్రీస్తు శకం 100 - 126) నాణాలమీద గ్రీకు తరహా బౌద్ధ విగ్రహం వుండి గ్రీకు (ఇంగ్లీషు) అక్షరాల్లో BODDO అని రాసివుంది.

కుషాణులు ఇండోసిథియన్లు. కనిష్కుడు ఈ రాజవంశాల్లో ప్రముఖుడు.

## తెలుగు నేలపై విదేశీ యాత్రికులు

1. గ్రీకురాయబారి మెగస్థనీస్ : క్రీ.పూ. 300 కాలం నాటివాడు. చంద్రగుప్తుడి ఆస్థానంలో గ్రీకురాయబారిగా వుంటూ తెలుగు నేలను సందర్శించి ఇక్కడ 30 రాజ్యాలున్నట్లు పేర్కొన్నాడు.
2. క్రీ.శ. 1వ శతాబ్దిలో "ప్లినీ" అనే గ్రీకు యాత్రీకుడు "పెరిప్లస్" అనే గ్రంథంలో ఆనాటి తెలుగు భూభాగాల గురించి ఎన్నో విశేషాలు రికార్డు చేశాడు.

3. టోలెమీ అనే యాత్రికుడు క్రీ.శ. 2వ శతాబ్దిలో భౌగోళికంగా తెలుగు ప్రాంతాల గురించి చాలా వివరాలు రాశాడు.




4. ఫాహియాన్ క్రీ.శ. నాలుగో శతాబ్దిలో కృష్ణాతీరం సందర్శించినపుడు అనేక విశేషాలను రికార్డు చేశాడు. ఈ గ్రంథంలో ఆ వివరాలను అందించడం జరిగింది.
5. హ్యూన్‌త్సాంగ్ క్రీ.శ. 6–7 శతాబ్దాలలో తెలుగు నేలమీద అనేక బౌద్ధ క్షేత్రాల్ని సందర్శించాడు. స్వయంగా ఇక్కడ వుండి మూల అభిదమ్మ సూత్రాలు అధ్యయనం చేశాడు.
6. ఇ–త్సింగ్ కూడా 7వ శతాబ్దిలో తెలుగువారి ప్రాంతాలను సందర్శించాడు.

## బెజవాడలో హ్యూన్‌త్సాంగ్

హిందువుల సాహిత్య శిల్పకళా సంపదలతోపాటు బౌద్ధ, జైన సంపదలు కూడా కేవలం పరస్పర మతవిద్వేషాల కారణంగానే ఒకరినొకరు నాశనం చేసుకున్నారు. ఇందులో ఒక మతాన్ని ఎక్కువగానూ, ఒక మతాన్ని తక్కువగానూ తప్పుపట్టేదేమీ లేదు. పరమతద్వేషాలు మన నేలమీద కొత్త విశేషమేమీ కాదు.



ఒకరి రికార్డుల్ని వేరొకరు ధ్వంసం చేసుకోగా చైనా యాత్రికుడు హ్యూన్‌త్సాంగ్ చైనాభాషలో రాసిపెట్టిన చైనా ఆధారాల రీత్యా-క్రీ.శ. 7వ శతాబ్దినాటి కృష్ణా తీరంలోని ఆంధ్రప్రాంతం వివరాలు కొన్ని తెలుస్తున్నాయి.

క్రీ.శ. 4–5 శతాబ్దాల కాలం నుంచీ పల్లవులు ఆంధ్రదేశాన్ని "వేంగి" రాజధానిగా పాలన సాగించారు. వేంగో రాష్ట్రం అనీ, "ఆంధ్రపధా" అనీ ఆనాటి శాసనాల్లో కన్పించిన పేర్లు ఈ వేంగికి సంబంధించినవే! వేంగినాడు నేటి ఏలూరు ప్రాంతం!

హ్యూన్‌త్సాంగ్ దక్షిణ కోసల నుంచి "ఆం–టో–లో" (ఆంధ్ర)కు, కృష్ణానదీ తీరం వెంబడే ప్రయాణిస్తూ మార్గమధ్యంలో బెజవాడ చేరుకున్నాడు. ఇది క్రీ.శ. 7వ శతాబ్దినాటి సంగతి. "వేంగిని హ్యూన్‌త్సాంగ్ "పింగ్–చీ" అన్నాడు. పింగ్‌చీ రాజధానిగా వున్న ఆంధ్రరాజ్యంలో ఆనాటికి ఇరవై బౌద్ధారామాలు వున్నాయని హ్యూన్‌త్సాంగ్ పేర్కొన్నాడు.

హ్యూన్‌త్సాంగ్ బెజవాడకు వచ్చేనాటికి ఈ ఇరవై బౌద్ధారామాల్లో చాలా భాగం అప్పటికే శిధిలమై నిర్మానుష్యంగా వున్నా కొన్ని ఇంకా సజీవంగా వున్నాయి.

అలా సజీవంగావున్న వాటిలో రెండు ప్రసిద్ధ బౌద్ధారామాలు లేదా బౌద్ధ విహారాలు వున్నట్లు హ్యూన్‌త్సాంగ్ పేర్కొన్నారు.

మొదటిది "పుపో-షిహ్-లో". ఈ చైనా పదానికి పూర్వశిల అని అర్థం. అంటే తూర్పుకొండ! ఇది బెజవాడలో తూర్పుదిశగావున్న మొగల్రాజపురం కొండ గుహ అయి ఉంటుందని, అక్కడ "పూర్వశిల" అనే బౌద్ధ సిద్ధాంతాన్ని ప్రతిపాదించే విశ్వవిద్యాలయం వంటి బౌద్ధ కేంద్రం వుండేదని చరిత్రకారుల ఊహ. కస్తూరిబాయిపేట, మొగల్రాజపురాలలో విస్తరించిన ఈ కొండ ప్రాంతంలో ఆనాటి గుహల శిధిలాల అవశేషాలు ఇప్పటికీ కన్పిస్తాయి. పూర్వశిల సిద్ధాంతానికి చెందిన బౌద్ధుల్ని "పూర్వ శైలికులు" అని పిలిచేవారు.

బౌద్ధ సిద్ధాంతానికి సంబంధించిన మరో బౌద్ధ కేంద్రం గురించి కూడా హ్యూన్‌త్సాంగ్ రాశాడు. దాని పేరు "అ-ఫాలో-షిహ్-లో". ఈ చైనా పదానికి "అపరశిల" అని అర్థం. ఉండవల్లి కొండ అయిన ఈ "అపరశిల" లేక "అవరశిల" బౌద్ధ సిద్ధాంతానికి సంబంధించినదని చరిత్రకారుల ఊహ.

సూయెల్ అనే పరిశోధకుడు పూర్వశిల, అవరశిల బౌద్ధకేంద్రాలు బెజవాడకు సంబం ధించినవేనవి వాదించిన వారిలో ప్రముఖుడు.

హ్యూన్‌త్సాంగ్ బెజవాడ కొచ్చేసరికి ఇక్కడ ఈ రెండు బౌద్ధకేంద్రాలూ సజీవంగా వున్నాయి. అప్పుడు "తె-నా-కా-చెన్", "ధాన్యకటకం" అనే దేశానికి ఈ బెజవాడ ప్రాంతం రాజధానిగా వుండేదట.

విజయదేవపురం అనే ప్రాంతం విజయవాడకు అరమైలు దూరంలో వుండేదని, ఆనాడు అది మంచి బౌద్ధకేంద్రం అనీ, అక్కడ ఇటుకలతో నిర్మించిన బుద్ధదేవాలయం వుండేదనీ, అందులో రెండు తలల బుద్ధుని విగ్రహానికి పూజలు జరిపేవారనీ అంటారు. "ఎడ్మినిస్ట్రేషన్ అండ్ సోషల్ లైఫ్ అండర్‌ది పల్లవాస్" అనే గ్రంథంలో డా॥ జి. మీనాక్షి ఈ విజయదేవపురాన్ని ప్రస్తావించారు. బహుశా ఆనాటి బెజవాడకు విజయదేవపురం అనేపేరుకూడా వుండి వుండవచ్చు.

బౌద్ధారామాలకు రాజపోషణ లభించినంతకాలం అవి బౌద్ధ భిక్షువులతో కళకళలాడాయి!. క్రీ.పూ. 100 నాటికే వీటిలో చాలా కేంద్రాలు నిర్మితమైవున్నాయని అంటారు.

“ఫాంగ్-చి” అనే నామాంతరం కల్గిన బౌద్ధభిక్షువు భావ వివేకుడు వజ్రధారణి మంత్రం జపిస్తూ, చాలాకాలం క్రూరమృగాల బాధలేకుండా ఈ బౌద్ధారామంలో నివసించాడని ప్రతీతి. హ్యూన్‌త్సాంగ్ మొగల్రాజపురం బౌద్ధగుహలలో మహాసాంఘిక శాఖకు చెందిన ఇద్దరు బౌద్ధభిక్షువుల దగ్గర కొన్ని మూల అభిదమ్మ సూత్రాల్ని నేర్చుకొన్నాడనీ, అందుకోసం ఇక్కడ రెండునెలలపాటు ఉన్నాడనీ చెప్తారు. మూల అభిదమ్మ సూత్రాలు నేర్పినందుకు బదులుగా వారికి మహాయాన సిద్ధాంతాలను బోధించాడట హ్యూన్‌త్సాంగ్! అదీ మోగల్రాజపురం బౌద్ధగుహల ప్రశస్తి !

మహాసాంఘిక పంథాలోనే మహావని సెలియ (నాగార్జునకొండ)లో అపర మహావని సెలియ, రాజశిల, చైత్య (చైత్యవాదం) సిద్ధాంతిక (సిద్ధార్ధికవాదం), బహుశృతీయవాదం మొదలైన బౌద్ధవాదాలు (సూళ్లు) ఆ రోజుల్లో వుండేవని బౌద్ధగ్రంథాలు పేర్కొంటున్నాయి.

ఆంధ్రదేశానికి చెందిన మహాసాంఘికుల్ని అంధకులని పిలిచేవారు. “అంధక రట్టం” అంటే ఆంధ్రరాష్ట్రం అనే ! ఆంధ్రప్రదేశ్ అంతా ఈ అంధకరట్టంలో భాగమే!

## బౌద్ధాన్ని ఆకర్షించిన తెలుగు నేల

బుద్ధుడు జీవించిన కాలం -

క్రీస్తు పూర్వం 5వ శతాబ్ది నాటికి తెలుగు ప్రాంతాలు కొందరు చరిత్రకారులు భావించినట్లు అనాగరక ఆటవిక జాతులతో నిండిన అడవులుగా వున్నాయనుకోనవసరంలేదు. మనం గుర్తించవలసిన ముఖ్యవిషయాలు కొన్ని ఉన్నాయి.

1. తెలుగువారు ఆర్యులు ఎంతమాత్రమూ కారని ఐతరేయ బ్రాహ్మణంలో చెప్పిన విషయాన్ని ప్రమాణంగా తీసుకుందాం.
2. తమిళ, కన్నడ, మళయాల ప్రాంతాలకన్నా ముందే ఆర్య సంస్కృతులు ఉత్తర భారతదేశం నుంచి తెలుగు ప్రాంతం మీదే ప్రసరించాయి. కొన్నిసార్లు శ్రీకాకుళం మీదుగా కోస్తా జిల్లాలోకి ప్రవేశిస్తే, కొన్నిసార్లు విదర్భ మీదుగా తెలంగాణాలోంచి ప్రవేశించాయి. చాలాసార్లు సముద్ర మార్గాన కృష్ణా గోదావరి నదుల ముఖద్వారాలలోంచి తెలుగునేల మీదకు ప్రవేశించాయి.
3. మగధతోనూ, కోసలతోనూ తెలుగు వారికి సంబంధాలున్నాయి.
4. విష్ణుపురాణంలో అస్యక, ములక రాజ్యాలను గోదావరి దగ్గర ఇక్ష్వాకులు నిర్మించు కున్నట్లుంది.

5. యశోధర్ముడనే ఇక్ష్వాకుడు గుంటూరు జిల్లా భట్టిప్రోలులో "ప్రతీపాలపురం" పేరుతో రాజధాని నగరాన్ని నిర్మించుకొని రాజ్యం చేశాడు. ఈయన జైన చక్రవర్తి అని జైన గ్రంథాల్లో వుంది.

6. వాతాపి, ఇల్వల, మారీచ, సుబాహు..... వీళ్ళంతా తెలుగునేల మీద సంచరించిన రాక్షసులు. బహుశా యక్ష జాతివారు కావచ్చు. శత్రువులైన వాళ్ళందరినీ రాక్షస సంజ్ఞతోనే వ్యవహరించారు.

7. అప్పటికి ఇక్కడ అధికారంలో వున్నది నాగజాతీయులు అయి వుండాలి. వారి భాష తెలుగుగాని, తెలుగుకు దగ్గరగా గాని ఉండాలి.

8. తెలుగువారు వస్త్ర పరిశ్రమతోపాటు; ఇనుము గురించి బాగా తెలిసినవారు. లోహ పరిశ్రమలు అప్పటికే ఏర్పడి ఉండాలి. బంగారం, రాగి గురించి, వాటి వినియోగం గురించి బాగా తెల్సిన వారు. కాబట్టి తెలుగువారు ఖచ్చితంగా అప్పటికే నాగరకులు అని చెప్పవచ్చు.

9. చంద్రగుప్తుడి కాలానికి 30 తెలుగు రాజ్యాలున్నాయని గ్రీకులు పేర్కొన్నారు. ఇవి గణరాజ్యాల వంటివని చరిత్రకారులంటారు. మెగస్తనీస్ చెప్పిన 30 దుర్గాలు 30 రాజధాని నగరాలు కావచ్చు.

10. ఆ రోజుల్లో రాజధాని నగరం అంటే, పెద్ద వాణిజ్య కూడలి అయి వుంటుంది. రకరకాల ప్రజల రాకపోకలకు వీలైన స్థావరం. కాబట్టి, శైవం, వైష్ణవం, జైనం, బౌద్ధం అన్ని ధర్మాల ప్రవర్తకులు ఇలాంటి వాణిజ్య కేంద్రాల దగ్గర కేంద్రీకరించి వుండటం సహజం.

11. గోదావరి దగ్గర ఇక్ష్వాకు వంశీకుల రాజగురువు బావరికి ఆనోటా ఈనోటా మగధలో బుద్ధుని కార్యకలాపాల గురించి తెలిసి, బుద్ధుని విషయం పరిశీలించ వలసిందిగా రాజగురువు తన శిష్యుల్ని పంపించాడట. అలా వెళ్ళిన బావరి శిష్యులు బుద్ధుని బోధనలకు ముగ్ధులై అక్కడికక్కడే బౌద్ధులుగా మారిపోయారని, ఆ శిష్యుల్లో బావరి మేనల్లుడు కూడా ఉన్నాడని, అతను తిరిగివచ్చి బావరికి విషయం నివేదించడం, బావరి గోదావరి తీరం నుంచే బౌద్ధ ధర్మాల్ని స్వీకరించి, "అనాగమి" దశను పొందినట్లు "సుత్తనిపాత" గ్రంథంలోని విషయాన్ని చరిత్రకారులు పేర్కొంటూ వుంటారు.



12. బౌద్ధ పాళీ గ్రంథాల్లో శ్రావాస్తి బౌద్ధారామంలో "అంధక వనం", "అంధక వింద" లున్నట్లు తెలుస్తోంది. ఇవి రెండూ ఆంధ్ర బౌద్ధులకు ప్రత్యేకించిన విడిది గృహాలుగా భావించ వచ్చునని కీ.శే. బి.యస్.యల్.యన్. హనుమంతరావుగారు రాశారు.

13. అంధక శబ్దంతో పిలువబడిన "ఆంధ్రులూ" తెలుగువారూ వేర్వేరు అనీ, ఆంధ్రులు తెలుగువారితో కలిసిపోయారనీ ప్రొఫెసర్ యార్లగడ్డ బాలగంగాధరరావు గారంటారు. అయితే అశోకుడు నిర్వహించిన మూడవ బౌద్ధ సంగీతిలో అంధక శాఖలైన చైత్యక, శైలవేతుల్య వాదులు ప్రముఖ పాత్ర నిర్వహించినట్లు, బౌద్ధ గ్రంథాల్లో వుంది. బౌద్ధ ధర్మాన్ని బాగా లోతుగా అధ్యయనం చేసిన తెలుగు ప్రాంత ప్రజలే ఈ చైత్యక వాదులని హనుమంతరావు గారి అభిప్రాయంగా కనిపిస్తుంది.

14. "తెలివాహ నది" కృష్ణానది అని, "అంధపథం" రాజధాని ధనకటకం అమరావతేనని, ఆంధ్రనగరి అనే నామాంతరం దీనికి వుందనీ అంతేకాక, బౌద్ధక్షేత్రంగా ప్రసిద్ధికెక్కినందునే ధాన్యకటకానికి, ఆంధ్రనగరికి జాతకకథల్లో ప్రశస్తమైన స్థానం లభించిందని హను మంతరావు గారు పేర్కొన్నారు.

15. అమరావతి స్థూపం ఊహాచిత్రాన్ని మాత్రమే ఇప్పుడు మనం చూస్తున్నాం. మొదట ఇది చాలా చిన్న స్థూపం కావచ్చని, అశోకుడు దాన్ని పెంచి పెద్దదిగా నిర్మించి వుంటాడని పరిశోధకులు భావిస్తున్నారు. పునర్నిర్మాణ కాలంలో వాడిన మట్టి, చెక్క, రాయిలలో తెలుగుదనం తక్కువగా వుండడం ఈ ఊహకి ఒక ఆధారం. ఈ విషయాన్ని వివరిస్తూ "శ్రీ ధాన్యకటక చైత్య జినథాతుర్థరేభువి" అని, మంజుశ్రీ మూల కల్ప వాక్యాన్ని అనుసరించి, రామగ్రామంనుంచి సేకరించిన బుద్ధ ధాతువులు నిలిపి, అశోకుడు, ధనకటక చైత్యాన్ని పునర్నిర్మించి వుంటాడంటారు.

16. బుద్ధుని దంతాన్ని నిక్షిప్తంచేసి వజ్రాల దిన్నెలో స్థూపం నిర్మించాడని సింహళ గ్రంథం "దళద వంశ"లో వుంది. వజ్రాల దిన్నె కృష్ణాతీరంలోదయితే ధనకటకం అవుతుంది. సముద్ర తీరానిదైతే భట్టిప్రోలు అవుతుంది. శ్రీకాకుళం దగ్గర వున్నదయితే "ఓదంతపురి" అవుతుంది. గోదావరీ తీరంలోనిదయితే, కోటిలింగాల అవుతుంది. ఏదయినా తెలుగు వారికి గర్వకారణమే.

తెలుగునేలపై విస్తరించిన బౌద్ధుల గురించి మనలో కొన్ని ఆలోచనలను కల్గించేందుకు ఉపయోగించే సమాచారం మాత్రమే ఇది ! వీటిలో ఎక్కువ భాగం ఊహాగానాల మీదే సాగింది.

# బౌద్ధ గ్రంథాలు చెప్పిన అంధపురం

"సిరివణిజ జాతకం" బౌద్ధ జాతక గ్రంథంలో "అంధపురం" అనే నగరం గురించిన ప్రస్తావన వుంది.

బహుశా అంధపురం ఆంధ్రులనబడేవారి తొలి రాజధాని కావచ్చు. ఇదెక్క డుంది.....? తెలివాహ నది ఒడ్డున వుంది! ఈ నది ఏది.....??

భండార్కర్ గారు ఇది మహానదికి ఉపనది కావచ్చునన్నారు. బస్తర్ - ఛత్తీస్‌గఢ్ ప్రాంతాల్లో తొలి ఆంధ్రులు నివసించారని, మహానది ఉపనదుల్లో ఒకటి తెలివాహ కావచ్చని ఆయన అభిప్రాయపడ్డారు. అంధపురం వారి రాజధాని !

రాయ్ చౌధురి అనే పరిశోధకుడు భండార్కర్ గారి వాదనలతో విభేదిస్తూ, తెలివాహ అనేది కృష్ణానదికి మరో పేరుగా స్పష్టీకరించాడు.

తెలి అంటే, నువ్వుకు సంబంధించిన నూనె. నువ్వుకీ కృష్ణానదికీ సంబంధం ఏమిటీ? విఖ్యాతా కృష్ణవేణీ అనే శ్లోకంలో కృష్ణ శబ్దాన్ని తైల స్నేహోపలబ్ద సరళత కలిగినదిగా పండితులు వ్యాఖ్యానిస్తారు. దీని ఆధారంగా నూనె జర్రున జారినంత సరళతరంగా, కృష్ణానదీ ప్రవాహం వుంటుంది కాబట్టి దాన్ని "తెలివాహ నది" అని పిలిచారని రాయ్ చౌధురి సమర్థించారు.

ఈనది ఒడ్డున నగరం అంధపురం. అయితే అటు అమరావతి గాని, కాకపోతే ఇటు బెజవాడ గాని కావచ్చని చరిత్రకారుల ఊహ. బి.యస్.యల్. హనుమంతరావు గారు ధనకటకం అన్నారు.

తెల్ ధాతువుకు వెలుగు అని అర్థం చెపుతూ తెల్లని నది గోదావరి కావచ్చనీ, "తెల్" ధాతువే తెలంగాణాకు తెలుగుకూ మూల పదంగా మరికొందరు చరిత్రకారులు వ్రాశారు. గోదావరి నది ఒడ్డున కోటిలింగాలను అంధపురంగా భావించి అక్కడ శాతవాహనుల రాజధాని వుండేది కాబట్టి అదే అంధపురం కావాలని ఒక పరిశోధకుడు ఆశించారు. అయితే, అదే కాలంలో "కళింగ" ప్రాంతంలో కూడా తెలుగు మాట్లాడిన ప్రజలు ఉండేవారన్న సంగతి ఈ పరిశోధకులు మరిచిపోయారు. తెలుగు మాట్లాడిన ప్రజలు నివసించిన ప్రాచీన భూమి అంతా తెలంగాణమే..... తెలింగాణా, కళింగలు తర్వాతి కాలంలో వేర్వేరు రాజవంశాల పాలన కారణంగా ఏర్పడినవే ! మాజీ నిజాం రాజ్యాన్ని మాత్రమే తెలంగాణా అనడం అన్యాయం!

# ! బుద్ధుడికి గొడుగుపట్టిన ఆంధ్రుడు !

బుద్ధగయతో జ్ఞానసిద్ధి పొంది, శిష్యుల కోసం అన్వేషణలో పడి కాశీవైపు కాలినడకన బయల్దేరాడు బుద్ధుడు. అది బుద్ధత్వం పొందిన 16వ రోజు -

మార్గమధ్యంలో ఓ పెద్ద తుఫానులో ఇరుక్కున్నాడు బుద్ధుడు. అప్పుడు "ముచి విందనాగుడు" అనే పేరుగల నాగజాతికి చెందిన ఆంధ్రుడు, తన గొడుగుపట్టి, బుద్ధుని రక్షించాడు. బుద్ధుడికి శిష్యులైన వారిలో ఈ ముచివిందనాగుడు బహుశా మొదట



వాడు కావచ్చు. అప్పటివరకు గౌత ముడిగాను, గౌతమసిద్ధార్థుడిగానూ వున్న బుద్ధుడు బుద్ధత్వం పొంది బుద్ధుడిగా పరిణామం చెందిన సమయం అది.

"ముచివిందనాగు" అంధక రట్టానికి చెందినవాడని బౌద్ధ గ్రంథాలలో స్పష్టంగా వుంది. కొన్ని శిలాఖండాల మీద ముచివిందనాగు గొడుగుపట్టిన దృశ్యాన్ని చెక్కారు కూడా. సయాంలోనూ, విజయపురి నాగార్జునకొండలోనూ, అమరావతి బౌద్ధ స్తూపంలోనూ దొరికిన శిల్ప ఖండాలలో ఈ దృశ్యం కూడా కన్పిస్తుంది.

బుద్ధుడికి తెలుగువారితో నేరుగా సంబంధాలు నడిచాయి. బుద్ధుడికి కుడిభుజంగా వ్యవహరించిన వారిలో ఆనాటి ఆంధ్రులున్నారనేది వాస్తవం.

ఉత్తర భారతదేశంలోంచి ఆనాటి కృష్ణా తీరానికి దిగుమతి అవుతోన్న వైదిక సంస్కృతిని, వైదిక మతానుయాయులైన రాజవంశాల్ని వ్యతిరేకించిన నాగులు, యక్షులు తదితర స్థానిక జాతుల వారు బుద్ధుని సిద్ధాంతాల వైపు ఆకర్షించబడ్డారు. బుద్ధుని సమాదరించడమే కాదు ఆయనని కృష్ణాతీరానికి తీసుకురావడం కూడా జరిగి వుంటుందని పండితుల ఊహ. కృష్ణాతీరంలో విస్తృతించిన బౌద్ధానికి కారణం బుద్ధుడు స్వయంగా ఈ ప్రాంతాలతో సంబంధాలు పెట్టుకోవడమే !

## ! తెలుగువారి ఏడు తలల పాము విగ్రహాలు !



"విగ్రహారాధన" అనేది శివలింగాలతోనే ప్రారంభం అయివుండొచ్చు. సింధునాగరికతలో దొరికిన అమ్మతల్లి బొమ్మ, ఊర్ధ్వలింగయోగి బొమ్మలు ఆరాధన కోసం వుద్దేశించినవి అవునో కాదో తెలియదు. అతిప్రాచీన విగ్రహాలు ఆరాధనకోసం వినియోగపడినవి శివలింగాలే! అయితే, తెలుగు ప్రాంతాలలో ఐదు (లేక) ఏడు తలల పాము విగ్రహాలు ప్రాచీన గ్రామాలన్నింట్లోనూ దొరుకుతాయి. మహానాగ విగ్రహాలు తెలుగు వారి పూజలందుకున్నాయి. ఇప్పటికీ నాగారాధన తెలుగువారి ప్రత్యేకతే! నాగదేవతానుయాయులైన ప్రజలు బౌద్ధ మతానుయాయులుగా మారినప్పుడు బుద్ధుడికి ఐదు తలల పాము నీడపడ్తున్న విగ్రహాలు ఏర్పడి వుంటాయి.

మహానాగ దేవతని అర్చించిన ప్రజలు బౌద్ధంలోంచి శైవులుగా మారినప్పుడు శివలింగం పైన గాని, శివలింగానికి గానీ నీడపడ్తున్న ఐదు పడగల పాము విగ్రహాలూ ఏర్పడ్డాయి. ఇది చారిత్రకమైన ఒక సంధికాలం. క్రీస్తుపూర్వం 6 లేక 5 శతాబ్దాల కాలంలో తెలుగునేల అనేక పరిణామాలను చవిచూసింది.

బుద్ధుడి కాలానికే తెలుగు నేలమీద శివలింగార్చన విరివిగా సాగిందనడానికి నాగార్జున కొండలోని పుష్పభద్రస్వామి, ఏలేశ్వర క్షేత్రంలోని పాలరాతి శివలింగాలే సాక్ష్యం అంటారు.

★ "అమరావతి తొలిదశలోని చిత్రాల్లో జటిలుల బౌద్ధమతావలంబనమూ, బుద్ధుని అస్తికల కోసం జరిగిన యుద్ధమూ, లక్ష్య పరీక్ష కనబడుతున్నాయి. వృక్ష చైత్యమూ, మెలికల పూలదండా, గోపాలురూ, హంస అంచులూ బౌద్ధాంధ్ర శిల్పకళ అమరావతిలో సరస్వతి అయినట్లు సాక్ష్యమిస్తాయి" - అన్నారు శ్రీపాదవారు.

★ బుద్ధ విగ్రహ నిర్మాణం అమరావతి రెండోదశలో ప్రధాన లక్ష్యంగా కనబడుతుంది. ప్రాచీన భారత సాంప్రదాయాత్మకమైన "పూర్ణకుంభం" బౌద్ధుల అర్చన విధానాలలో ముఖ్యమైన అంశంగా మారిందని శ్రీపాదవారు పేర్కొన్నారు. ఇవి రెండూ తెలుగువారైన బౌద్ధులు ప్రవేశపెట్టినవేనని ఆయన అభిప్రాయం.

★ రెండోదశని అశోకుడు పూర్తిచేస్తే శాతవాహన ప్రభువు హాలుడి కాలంలో స్తూపం మూడో దశ నిర్మాణం జరిగి వుండవచ్చునంటారు.

## సింహళానికి బుద్ధుడు మూడుసార్లు వెళ్ళాడు

మహావంశ అనే బౌద్ధ గ్రంథం ఆధారంగా బుద్ధుడు 3 సార్లు లంకని సందర్శించినట్లు తెలుస్తోంది.

మొదటి పర్యటనలో "మహానాగ" వనంలో విడిదిచేశాడు. రెండవసారి వచ్చినప్పుడు నాగద్వీపం అనే చోట ఆగాడు. ఇది శ్రీలంకకు వాయువ్యంగా వున్న ఒకదీవి. మూడవసాది వచ్చినప్పుడు కళ్యాణపురం (ఈనాటి కేలనీయ)లో విశ్రమించాడు.



"మహానాగ" వనానికి ఆయన వచ్చినప్పుడు దేవతలకు బౌద్ధ ధర్మాల్ని బోధించాడట. మహియాంగన స్తూపాల్ని అక్కడ నిర్మించే ఆలోచనని అప్పుడే చేశారట! సమ్యకూట పర్వతానికి చెందిన ఈ దేవతల రాకుమారుడు మహాసుమనుడికి బుద్ధుడు పట్టంకట్టించాడట. అలాగే నాగద్వీపానికి వచ్చినప్పుడు, కళ్యాణ పురానికి వచ్చినప్పుడు కూడా ఆయన బౌద్ధ ధర్మాలగురించి బోధించాడు. తనను ప్రశ్నించిన వారిని వాదంలో గెలిచి, వారికీ బౌద్ధదీక్ష ఇచ్చాడట!

ఇక్కడ ముఖ్యమైన ప్రశ్న ఏమంటే, బుద్ధగయ నుంచో, వారణాసి నుంచో బుద్ధుడు ఓడమీద గానీ, తెలుగు ప్రాంతాల గుండా నేలమీదగానీ ప్రయాణంచేసి శ్రీలంకకు చేరాలి.

ఏమార్గాన వెళ్లినా తెలుగునేలకు ఆయన రాకుండా సింహళానికి వెళ్లడం అసాధ్యమే ఆనాటి పరిమితమైన ప్రయాణ సాధనాలరీత్యా!

"మహావంశ"లో పేర్కొన్నట్లు బుద్ధుడు లంకకు మూడుసార్లు వెళ్లింది నిజమైతే, అన్నిసార్లూ తెలుగు నేలమీదకు కూడా వచ్చేవుంటాడని మనం తప్పనిసరిగా భావించవచ్చు.

## విశ్వామిత్రుని సంతతి "ఆంధ్రులు" ఎవరు ?

విశ్వామిత్రుడు తన నూర్గురు కొడుకులకు రాజ్యాధికారం లేదని శాసించాడని, వాళ్ళలో ఆంధ్రుడనే వాడున్నాడనీ, ఆంధ్రులు ఆ విధంగా శాపగ్రస్తులైన విశ్వామిత్ర సంతతేననీ పురాణ కథలు.

"ఆంధ్రాః బహవః" సూక్తి ప్రకారం, ఆంధ్రుల్లో చాలా జాతుల వారున్నారు. వారిలో విశ్వామిత్ర సంతతి కూడా వుండి వుంటుంది. వారెవరు?

క్రీ.శ. తొలి శతాబ్దాలు :

సాలంకాయన గోత్రీకులైన రాజులు "వేంగి"ని రాజధానిగా చేసుకుని పాలించారు. వీరు వేంగి నగరాన్ని మాత్రమే పాలించారా..... వేంగి రాజ్యాన్ని పాలించారా..... అనే వివాదం ఉంది.

ఈ గోత్రీకులకు గోత్ర ఋషులు సాలంకాయన పేరుతో ముగ్గురు కన్పిస్తున్నారు. విశ్వామిత్ర రుషి, కాట్టరుషి, అత్కిల రుషి !

ఈ విశ్వామిత్ర ఋషి సంబంధిత సాలంకాయనులే ఆంధ్రదేశాన్ని పరిపాలించి వుంటారని పండితుల అభిప్రాయం.

కొన్ని పురాణాలు రూపొందించిన కాలం అది... ఆ సమయానికి అధికారంలో వున్న సాలంకాయనుల ప్రభావం కొంత అనుకూలంగా, కొంత ప్రతికూలంగా వుండటం కారణంగా ఇలాంటి కథలు ఏర్పడి వుంటాయి!

సాలంకాయనుల గురించి మరిన్ని విశేషాలున్నాయి.

గుజరాత్‌లోని సోలంకీలుకూడా తమది ప్రాచీన సాలంకాయన గోత్రంగానే చెప్పుకొంటారట! కల్నల్ టాడ్ అనే పరిశోధకుడు సౌరాష్ట్రలోని అన్హిలవాడ ఈ సోలంకీల ఏలుబడిలోని పట్టణంగా పేర్కొన్నాడు.



వీరే, దక్షిణాదికి సముద్ర మార్గాన తరలి వచ్చి కృష్ణా ముఖద్వారం నుండి తెలుగు ప్రాంతంలోకి ప్రవేశించారనీ కల్నల్ గారి భావన.

టోలెమీ క్రీ.శ. 130లో కృష్ణాతీరం గురించి చెప్పిన విశేషాల్లో "సాలకేనోయ్"ల ప్రస్తావన కూడా ఉంది.

టోలెమీ తర్వాత రెండు శతాబ్దాలకు, సాలంకాయనులు వేంగి నుండి రాజ్యాధికారానికి వచ్చారు. టోలెమీ కాలానికి వేంగి, సాలంకాయనుల ప్రధాన వర్తకకేంద్రంగా వుండి వుంటుంది. తర్వాతి కాలంలో అదే వారి రాజధానిగా మారివుంటుంది.

త్రికాండ శేషం, మేదినీ కోశం గ్రంథాల ప్రకారం సాలంకాయన (లేక) శాలంకాయన అంటే "నంది" అని అర్థం. వీరి జెండాపైన "నంది" అధిరోహిస్తాడు అందుకే వీరు పరమ మహేశ్వరులు, శివభక్తులే కాకుండా, చిత్రరథస్వామి భక్తులు కూడా! అంటే బహుశా సూర్యారాధకులు కూడా కావచ్చు.

ఇదీ స్థూలంగా సాలంకాయనుల కథ. విశ్వామిత్ర ఋషి గోత్రీకులు వీరిలో వుండడాన, విశ్వామిత్ర సంతతకీ, ఆంధ్రులకూ గల సంబంధంరీత్యా ఈ సాలంకాయనుల ప్రసక్తి వచ్చింది.

సాలిగోత్రీకులు, ఆర్యులు, బ్రాహ్మణులూ అయిన సాలంకాయనులు (సోలంకీలు) చేనేత వృత్తిని చేపట్టడం కారణంగా కులభ్రష్టత్వాన్ని పొంది కృష్ణాతీరానికి తరలి వచ్చారేమో..... ఏమో..... చరిత్రకారులే చెప్పాలి! ఆ మేరకు విశ్వామిత్ర శాప వృత్తాంతంలో చారిత్రక ప్రాధాన్యత వుండే అవకాశం ఉంది!

సాలంకాయనులు కృష్ణాతీరంలో వస్త్ర పరిశ్రమని వ్యాపింపజేయడమేకాదు, పాశ్చాత్య దేశాలలో ప్రజలు అసూయపడేలా వస్త్రాలను ఎగుమతులు చేసి ఖండాంతర ఖ్యాతి గడించినప్పటికీ, సాలంకాయనులు తమ వంశ మూలపురుషుడు విశ్వామిత్రుని వదులుకోలేదు.

వీరు ఆంధ్రులనీ, కృష్ణాతీరంలోని తెలుగువారితో కలిసిపోయి వుంటారనీ మరొక ఊహ!

ఆ వివరాలు మనం విడిగా పరిశీలిద్దాం!!

## మహాసాలిపట్నమే మచిలీపట్నమా ..... ?

క్రీ.శ. 50 -

పెరిప్లస్ ఆఫ్‌ది ఎరిత్రియాస్ అనే గ్రీకు గ్రంథం రెండువేల ఏళ్ల క్రితం కృష్ణాజిల్లా, దాని పరిసర ప్రాంతాల్ని గురించి కొన్ని వివరాలు పేర్కొంది. ఈనాటి కృష్ణా, పశ్చిమ గోదావరి, గుంటూరు జిల్లాల్లో కొంతభాగాన్ని "మసాలియా" ప్రాంతంగా పేర్కొంటూ, ఇక్కడ వర్తక వాణిజ్యకేంద్రాలూ, పరిశ్రమలూ వర్ధిలుతున్నట్లు పేర్కొంది.

ఆ తర్వాత ఎనభై ఏళ్ళు గడిచాయి.

క్రీ.శ. 130 -

టోలెమీ అనే గ్రీకు యాత్రికుడు ఈ ప్రాంతం అంతా తిరిగాడు. ఆయన గ్రీకు భాషలో మైసోలోస్ అనే నగరం (మెసోలియ) గురించి, మరికొన్ని ఇతర నగరాలు ..... కంట కోసిల (కంచకచర్ల), కొడ్డూర (బందరు దగ్గరి గూడూరు), పితుండ్రా (బహుశా ఈ నగరం ధ్వంసం కావడమో, సముద్రంలో మునిగి పోవడమో జరిగి వుంటుంది) ..... వీటి గురించి కూడా పేర్కొన్నాడు.

ఇంతకీ, మచిలీపట్నం సంగతి ఏమిటీ ?

పెరిప్లస్ గ్రంథం పేర్కొన్న మసాలియా గానీ, టోలోమీ పేర్కొన్న మైసోలోస్ గానీ, నామ సామీప్యతరీత్యా మచిలీపట్నానికి దగ్గరగా వున్నప్పటికీ, మచిలీపట్నమే మైసోలెస్ అని ఎవరూ ప్రకటించినట్లు కన్పించదు.

ఇక్కడో చక్కని చర్చనీయాంశం వుంది.

"సాలి" గోత్రానికి చెందిన సాలంకాయన బ్రాహ్మణులు మహాసాలిపట్నం కట్టుకొన్నారని, చేనేత పనిని వీరు వృత్తిగా స్వీకరించారనీ, "సాలీలు" అనే కులవృత్తి పదం వీరినుంచే వచ్చి వుంటుందనీ ఎం.డి. రాఘవన్ అనే పరిశోధకుడు రాశాడు. కృష్ణాతీరంలో క్రీస్తుపూర్వానికి విస్తరించిన వస్త్ర పరిశ్రమకు వీరు మూల పురుషులు. తర్వాత కాలంలో – ఈ సాలిగోత్రీకులే సింహళద్వీపంలో కూడా చేనేత వృత్తిని వ్యాపింపచేశారనీ, వీరి సాలిగాను జెండా (ఎద్దు ముద్ర వేసి వుంటుంది) ఇప్పటికీ శ్రీలంక మ్యూజియంలో భద్రంగా వుందనీ ఎం.డి. రాఘవన్ "ఇండియా ఇన్ సిలనీస్ హిస్టరీ, సొసైటీ, కల్చర్" గ్రంథంలో పేర్కొన్నాడు. టోలెమీ గానీ, పెరిప్లస్ గ్రంథకర్త గానీ కృష్ణానదీ తీరంలోని ఆనాటి పెద్ద వస్త్ర పరిశ్రమ కేంద్రానికి – మహాసాలిపట్నానికి వచ్చి వుంటారు. గ్రీకు భ్రష్టరూపంలో "మహాసాలి" పదమే "మసాలియా", మై సోలోస్, మైసోలియాలుగా ఉచ్చరించబడి వుండవచ్చని ఇక్కడ మనం తేలికగానే వూహించవచ్చు.

## మహానావికుడు శివకుడు

క్రీస్తుపూర్వం రెండవ శతాబ్ది – ఇంకా అంతకు పూర్వం – కృష్ణాతీరంలో ఇంత సముద్రాంతర వర్తనాన్ని రెండేవేల ఏళ్ళకన్నా ముందు తెలుగు ప్రజలు చేయగలిగారని చరిత్ర చెప్తోంది గదా..... తాజ్‌మహల్‌కు రాళ్ళెత్తిన కూలీలెవరని శ్రీశ్రీ ప్రశ్నించినట్లు ..... అన్ని ఓడలు నడిపిన నావికుల పేర్లు అంతగా మనకు తెలియదు – ఎందుకని?

క్రీ.శ. 2వ శతాబ్దిలో కృష్ణాజిల్లా ఘంటసాలలో దొరికిన ఒక బౌద్ధ స్థూపంపైన శివకుడు అనే నావికుడి ప్రస్తావన కన్పించింది. ఈ శివకుడు ఓడ కెప్టెన్ కావచ్చు. లేదా ఓడరేవు రక్షకుడు కావచ్చు.

అతని గురించి మనకేమీ తెలియకపోయినా, సముద్రమే ప్రపంచంగా జీవించిన ఆనాటి నావికా జీవులకు ప్రతినిధిగా ఈ శివకుడు చిరంజీవిగా మిగిలాడు!

వస్త్ర పరిశ్రమకు సంబంధించి ఘంటసాల ఆ రోజుల్లో గొప్ప వాణిజ్య కూడలి కూడా.

ఆ రోజుల్లో వర్తక సంఘాలు – అంటే, వ్యాపారుల కూటములు (గిల్డ్స్ వంటివి) వుండేవి. వాటిని శ్రేణులు అనేవారు.

ఈ శ్రేణులే వాణిజ్య వ్యవహారాలతోపాటు, అవసరం అయితే, నగర పాలనా బాధ్యతల్ని కూడా నిర్వహించాయి. ఆ విధంగా వ్యాపారులు ఆర్థికంగానూ, రాజకీయంగా కూడా ఎదిగారు. నావికులు లేకపోతే సముద్రాంతర వాణిజ్యం అనేది సాధ్యం కాదు.

కాబట్టి నావికులతో వ్యాపారులకు మంచి సంబంధాలు నడిచేవి!

ఓడరేవునీ, సముద్రజలాన్ని సంరక్షించే బాధ్యత కూడా వీరిదే కావడంతో నావికులు తన భుజబలంతో సాహసులుగా పేరెన్నిక గన్నారు.

బృహత్ఫలాయన గోత్రీకులు - శాతవాహనుల కాలంలోనూ, వారి తర్వాతి ఇక్ష్వాకుల కాలంలోనూ క్రీ.శ. 3వశతాబ్ది వరకూ ఇలా సముద్రజలాల్ని, ఓడరేవుల్ని సంరక్షించే బాధ్యతలే నిర్వహించారు. ఘంటసాల, గూడూరు రేవులు వీరి ఆధీనంలో వుండేవి. ఆ తర్వాత స్వతంత్రం ప్రకటించుకొని, జయవర్మ నాయకత్వంలో కృష్ణాతీరంలో రాజ్యం చేశారు కూడా !

శివకుడు ఇలాంటి పాలకుడు కూడా అయి వుండొచ్చు!

రాజుల్ని, రాజవంశాల్ని కీర్తించే చరిత్రలు మనకు చాలా దొరుకుతాయి. కానీ, ఆనాటి ప్రజలు ఎవరు? వాళ్ళు ఏం తిని ఎలా బతికారనే విషయాలకు చరిత్ర ఎప్పుడూ ప్రాధాన్యత ఇవ్వదు.

అందుకే తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీ లెవరు అని ప్రశ్నించ వలసి వచ్చింది. ఈ శివకుడు అలాంటి ప్రజాపాత్ర నిర్వహించిన గొప్ప నావికుడు, అంతే అంతకు మించి వివరాలు తెలియవు.

## అశోకుడి మీద తెలుగువారి ప్రభావం



అశోకుడు కళింగ దేశాన్ని జయించిన తర్వాత యుద్ధాలు ముగించి తన జీవితశేషాన్ని బౌద్ధధర్మాల వ్యాప్తికి అంకితంచేశాడు. మహాసాంఘికుల్ని ఎక్కువగా ఆదరించాడు. మహాసాంఘికులు ప్రవేశపెట్టిన సంఘు సంస్కారాల్ని అమలుపరిచాడు. చైత్యారాధనపట్ల అశోకుడికి మోజుపెరగడానికి కారణం ఇదే! ఈ మోజును పెంపొందించిన వారు తెలుగువారే! మహాయాన బౌద్ధానికి ప్రధానప్రేరకులు తెలుగువారే కావడం విశేషం.

చైత్యాలను ఆరాధించడం ప్రారంభించిందికూడా తెలుగు వారేనంటారు! క్రమేణా ఈ అలవాటు బౌద్ధుల్లో చాలా ప్రాంతాల్లో విస్తరించింది. మొదట్లో ఎనిమిది చైత్యాలు మాత్రమే బుద్ధుని అస్తికలున్నవి వున్నాయి. అశోకుడు, అతని ప్రతినిధులూ కృషిచేసి, చైత్య నిర్వాహకుల్ని అంగీకరింపచేసి, మూలస్తూపాల్ని తెరిపించి, అందులోని అస్థికల్ని చిన్నచిన్నముక్కలుగా చేసి తన రాజ్యం అంతా ఈ ముక్కలు ప్రతిష్టాపించి 84 వేల స్తూపాలు నిర్మించినట్లు ఒక ఐతిహ్యం, వాటిలో జగ్గయ్యపేట, భట్టిప్రోలు, ఘంటశాల, గుడివాడ వంటివి ఎన్నో వున్నాయి. బుద్ధుడి అస్థికలతో సమానంగా అతిముఖ్యమైన బౌద్ధ భిక్షువుల అస్థికలను నిక్షిప్తంచేసి కట్టిన చైత్య స్తూపాలు కూడా కొన్ని వున్నాయి.

## తెలుగునేలమీద బౌద్ధాన్ని వ్యాపింపచేసిన మహాదేవుడు

సింహళ దేశపు రాజు "దేవానాంప్రియ తిస్సా" అనే ఆయనకి అశోకుడు ఒక లేఖ రాస్తూ "నేను బౌద్ధం స్వీకరించాను. మీరుకూడా స్వీకరించండి" అని కోరాడు. మహేంద్రుడు ఈ లేఖని స్వయంగా తీసుకువెళ్ళి సింహళ రాజుకి అందించాడు.

నిజానికి మహేంద్రుడు శ్రీలంకలో బౌద్ధాన్ని ప్రవేశపెట్టడానికి ముందే అక్కడ బౌద్ధమూ వుంది - బౌద్ధ భిక్షువులూ వున్నారు.

మహేంద్రుడే పల్లవ బొగ్గం అని పిలవబడిన పల్నాడుకు వచ్చి కృష్ణాతీరంలో అనేక బౌద్ధస్తూపాల నిర్మాణానికి కారణం అయ్యాడనికూడా బౌద్ధగ్రంథాలలో వుంది.

ఈ ఇద్దరు మహేంద్రులూ ఒక్కరే అనేది స్పష్టమే! కృష్ణాతీరం నుంచి ఆయన అనేకమంది తెలుగు భిక్షువుల్ని లంకకు తీసుకెళ్ళినట్లు లంకలోని బౌద్ధ గ్రంథాల్లో వుంది.

అశోకుడికాలంలో బౌద్ధమతానికి కీలకమైన వ్యక్తి మహాదేవ భిక్షువు. ఇతడు అశోకుడి చిన్నతమ్ముడని రొమిల్లా థాపర్ అంటారు. అశోకుడు ఈయన్ని తెలుగునేలమీద బౌద్ధవ్యాప్తి కోసం పంపించాడు. ఈయన ముందుగా పల్నాడుకు వచ్చాడట. పల్నాడుని ఆరోజుల్లో "పల్లవ బొగ్గం" అనేవారనీ, పల్లవనాడు లేదా పల్లవబొగ్గం నుంచి వచ్చిన రాజులే పల్లవులయ్యారని ఇంకొ ఐతిహ్యం వుంది.

జనసామాన్యంలోకి కూడా బౌద్ధాన్ని తీసుకువెళ్ళడం కోసం అశోకుడు మహాదేవుడనే భిక్షువుని తెలుగుప్రాంతానికి పంపించాడు.

మహాదేవుడి రాకతో తెలుగు బౌద్ధంలో ఉత్తరాది ఛాయలు కొన్ని ప్రవేశించాయి.

శిల్పపరంగా ఉత్తరాది సాంప్రదాయాలైన స్తంభ శిల్పమూ, అర్ధశిల్పమూ దక్షిణానికి వచ్చాయి. కానీ, శిల్పులు మాత్రం దిగుమతికాలేదు. అందుకని ఉత్తరాది పద్ధతుల్ని

చూసివచ్చి తెలుగు శిల్పులు ఇక్కడ బౌద్ధ స్తూపాల్ని నిర్మించి వుంటారని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు రాశారు.

అప్పటివరకూ ఎక్కడో మూలల్లోనో, అడవుల్లోనో, పర్వతగుహల్లోనో వున్న చైత్యాల చుట్టూ విస్తరించిన బౌద్ధం బుద్ధుడి తర్వాత రెండు శతాబ్దాల కాలంలో మహాదేవుడి ప్రేరణతో పల్లెల్లోకి విస్తరించింది.

సాధ్యమైనన్ని గ్రామాల్లో బౌద్ధస్తూపాలు నిర్మించారు. వీటన్నింటిలోనూ బుద్ధుని అస్తికలు ఒకటో రెండో నిక్షిప్తం చేయడం సాధ్యం కాదు కాబట్టి, అస్తికలు లేని చైత్యాల్ని స్మారక చైత్యాలన్నారు.

ఆదిలాబాద్ జిల్లాతో మొదలుపెట్టి, శ్రీకాకుళం జిల్లా వరకూ గోదావరి, కృష్ణానదుల పరీవాహక ప్రాంతాల వెంబడి అలాగే, గోదావరికి ఎగువన శ్రీకాకుళం జిల్లా వరకూ - ఇప్పటిదాకా 50 స్తూపాలు బయట పడ్డాయి.

బౌద్ధం సామాన్య మానవుణ్ణి చేరగల్గిందనడానికి ఇవి సాక్ష్యాలు. ఇందుకు శ్రీకారం చుట్టినవాడు మహాదేవుడు.

## సింహళంలో బౌద్ధాంధ్రులు

"పల్లవ భోగ్గం" అనే పల్నాడులో బౌద్ధధర్మాల్ని వ్యాపింపచేసిన మహేంద్రుడు" అనేక వందలమంది తెలుగు వారైన భిక్షువుల్ని వెంటబెట్టుకుని సింహళం వెళ్ళాడు.

మహేంద్రుడు సింహళ దేశానికి వెళ్ళేనాటికి మహాయానం ఇంకా బాగా వృద్ధి చెందలేదు. "చైత్యారాధన" అనేది మొదలు అయివుండక పోవచ్చు. బౌద్ధ స్మారక స్తూపాలు నిర్మించి బౌద్ధధర్మాల్ని ప్రచారంచేయడమే తొలినాటి - అంటే, అశోకుడి కాలంనాటి లక్ష్యం. కాలక్రమంలో ఈ స్మారక చైత్యాలు లేదా, బుద్ధుడి అస్థికలు నిక్షిప్తం అయివున్న చైత్యాలను ఆరాధించడం ఒక ఆనవాయితీ అయ్యింది. శైవులు శివలింగాన్ని ఆరాధించినట్లు బౌద్ధులు చైత్య స్తూపాన్నే ఆరాధించారు. ఇది క్రీస్తుశకం తొలినాటి కాలానికి జరిగిన ఒక పరిణామం. మహాయాన బౌద్ధంలో సంభవించిన మౌలికమైన పరిణామం. ఆలయాన్ని లేదా ఆయతనాన్ని ఆరాధించే సాంప్రదాయం వైదికంలోనిదే - బౌద్ధులు పాటించడం మొదలు పెట్టారు.

మహాదేవుడు సింహళానికి స్తూపనిర్మాణ కళనే తీసుకువెళ్ళాడు గానీ, స్తూపారాధన విధానాన్ని తీసుకువెళ్ళలేదనేది స్పష్టం. అప్పటినుంచీ సింహళదేశపు బౌద్ధులతో తెలుగువారికి సంబంధాలున్నాయి.

"సిగిరీయ చిత్రకళ" అని, సింహళదేశపు ప్రాచీన చిత్రకళని పిలుస్తారు. "బెంజమన్ రౌలండ్" అనే పరిశోధకుడు మౌర్య సామ్రాజ్యపతనం తర్వాత క్రీ.పూ. చివరి శతాబ్దాలలో ఆంధ్రులతో సింహళానికి (శ్రీలంక) ఎక్కువ సంబంధాలు బలపడినట్లు పేర్కొన్నాడు. "ఇండియా ఇన్ సిలనీస్ హిస్టరీ, సొసైటీ అండ్ కల్చర్ గ్రంథంలో ఎం.డి. రాఘవన్ శ్రీ లంకతో ప్రాచీన తెలుగువారికి ఏర్పడిన సంబంధాలగురించి చాలా వివరాలు పరిశోధిం చారు. మొట్టమొదటి బౌద్ధ స్తూపం, బుద్ధుని విగ్రహాలు కృష్ణాతీరం నుంచే సింహళానికి వెళ్ళాయని ఆయనే అనేక ఆధారాలను ఉటంకించారు.

క్రీస్తుపూర్వం 500 నాటికే సింహళంతో తెలుగువారికి సంబంధాలున్నాయని ఆయన స్పష్టంగా పేర్కొన్నాడు. సింహళంలోని బౌద్ధ ఫలకాలమీద చిత్రించిన స్త్రీలు అమరావతి బౌద్ధ స్తూపానిదిగా భావిస్తున్న ఫలకాలమీద కన్పించిన స్త్రీల మాదిరి వున్నారు గానీ, అజంతా ఎల్లోరా లలో చిత్రాల స్త్రీలమాదిరి లేరనీ, శిల్పకళ ఆధారంగా బెంజమిన్ రోలండ్ నిరూపణల్ని ఆయన ఉంటంకించారు.

అమరావతి స్తూపం మీది స్త్రీలు (maidans) సన్నగా నాజూకుగా తీగలా చలాకీగా కనపడతారనీ, చేతులు పొడవైనవిగా వుంటాయనీ, అప్సరసలు అంటే వీరే అన్నట్లుంటారనీ ఆయన వ్యాఖ్యానించాడు. ఇది తెలుగు శిల్పుల రమణీయతకు రెండువేల మూడువందల ఏళ్ళనాటి సింహళ ప్రజల కితాబుగా భావించాలి. అందుకే, మహాదేవుడి నాయకత్వంలో తెలుగు శిల్పులు, కళాకారులు, పండితులు బౌద్ధ భిక్షువులుగా మారి సింహళం వెళ్ళారు.

నాగదేవతలు, బుద్ధ విగ్రహాలు, బుద్ధుని జీవితం శిల్పాలుగా మలిచినవి సింహళంలోనూ బాగా కన్పించడానికి ఇదే ముఖ్య కారణం. సింహళంలోకి బోధి వృక్షాన్ని వెంటపెట్టుకొని మహాదేవుడితో వెళ్లిన బౌద్ధ భిక్షువుల గురించి "మహావంశ" అనే బౌద్ధగ్రంథంలో కొన్ని వివరాలున్నాయి. ఇవి పరిశీలించండి –

1. 18 మంది రాజవంశీకులు
2. 8 మంది మంత్రుల కుటుంబీకులు
3. 8 మంది బ్రాహ్మణులు
4. 8 మంది వ్యాపారులు
5. కొంతమంది గోపాలురు
6. చేనేత, కమ్మరం, కుమ్మరి, వడ్రంగి తదితర చేతివృత్తులకు సంబంధించినవారు ఒక్కొక్కరు చొప్పున.

ఈ లిస్టులో కన్పించిన వారంతా యక్షులేనని చెప్పింది మహావంశ.

## శ్రీలంకలో తెలుగు శిల్పకళ

క్రీ.శ. 5వ శతాబ్ది -

మౌర్యుల పతనం తర్వాత శ్రీలంకతో సాంస్కృతిక సంబంధాలు చాళ్ళాకాలం కృష్ణాజిల్లా నుండి మాత్రమే నడిచాయని బెంజమిన్ రోలాండ్ అనే పరిశోధకుడు రాశాడు. అందుకు ఆయన పేర్కొన్న సాక్ష్యాలివి :

1. "కృష్ణాజిల్లాలో బౌద్ధులు ఏవిధంగా బుద్ధవిగ్రహాలు, తదితరుల శిల్పాలు, చిత్రాలూ తయారు చేశారో అదే విధమైన కళారీతులు శ్రీలంకలోనూ కన్పిస్తాయి.
2. "అజంతా, ఇతర ప్రాంతాలలోని శిల్ప, చిత్ర కళారీతులకీ, ఆనాటి శ్రీలంక రీతులకీ చాలా తేడా వుంది. శ్రీలంక, కృష్ణాజిల్లా రీతులకి దగ్గరగా కన్పిస్తుంది."
3. "అమరావతి శిల్పాలలోని స్త్రీలకట్టూ, బొట్టూ, శిగముడి, కనుముక్కుతీరూ విలక్షణంగా వుంటాయి. ఇదే రకమైన విలక్షణత ఆ కాలంనాటి శ్రీలంక శిల్పాలలో ప్రతిబింబిస్తుంది."
4. "అజంతా చిత్రాలలోని స్త్రీ మూర్తులకన్నా, అమరావతి శిల్పాలలోని స్త్రీ మూర్తులు పలుచగా, పూలతీగల్లా, సుకుమారంగా కన్పిస్తారు. యక్షనాగకన్యలు కదా! శ్రీలంక శిల్పాల లోని స్త్రీలుకూడా, ఇదే రీతిలో వుంటారు....." ఇలా విశ్లేషించాడు బెంజమిన్ రోలాండ్!

గమ్మత్తేమిటంటే, 1707 నుంచి 1739 దాకా శ్రీలంకను పాలించిన కాండ్యరాజు నరేంద్ర సింహుడు 1747-1780లలో పాలించిన కీర్తిశ్రీ - ఈ ఇద్దరు రాజులు కూడా, శ్రీలంకలో శిథిలావస్థలో వున్న ప్రాచీన దేవాలయాల్ని పునరుద్ధరించడానికి కృష్ణాజిల్లానుంచే శిల్పుల్ని రప్పించారట.

ఇండియా ఇన్ సిలనీస్ హిస్టరీ, సొసైటీ అండ్ కల్చర్ గ్రంథంలో ఎం.డి. రాఘవన్ ఈ విశేషాలు రాశారు.

అమరావతి శిల్పం కృష్ణాతీరంలోని ఆంధ్రుల ప్రత్యేకతకు విశ్వవిఖ్యాతిని తెచ్చింది. శ్రీలంకలోని అనేక బౌద్ధ క్షేత్రాలలోనూ, బోధిసత్వుని విగ్రహాలలోనూ అమరావతి రీతి ప్రతిబింబిస్తుంది !

## రావణుడు బౌద్ధుడా ?

"సధర్మ లంకావతార సూత్ర" అనే బౌద్ధ గ్రంథం లంకలోకి బౌద్ధధర్మ ప్రవేశం గురించి అనేక వివరాలను అందచేస్తుంది. ఇది మహాయాన గ్రంథాలలో ఒకటి. ఈ గ్రంథంలో రావణాసురుడు బుద్ధిమంతుడైన బౌద్ధుడు.

ఈ రావణుడికి 'వైద్యశిరోమణి" అని బిరుదు వుండేది సింహళంలో ! అర్కప్రకాశిక, కుమారతంత్రం అనే రెండు వైద్యగ్రంథాల్ని ఈ రావణుడు రచించినట్లు తెలుస్తోంది. "వైద్యశిరోమణి రావణ కృత అర్కప్రకాశిక" అని రాసి వుంది ఒక పుస్తకం మీద.

హిమాలయాలలో పులస్త్యుడు, నారదుడు, వీరితో పాటు రావణుడుకూడా ఒక వైద్య సమ్మేళనానికి హాజరయినట్లు ఆయుర్వేద గ్రంథాల్లో ఆధారాలున్నాయి. పులస్త్యో నారదో శత్నాహ్యా అని చరకంలో వుంది.

శివతాండవ స్తోత్రాన్ని రావణుడు రచించినట్లు భావిస్తారు. "మహా మయూరి" అనే సింహళ మహాయాన బౌద్ధ గ్రంథంలో విభీషణుడిని ఒక దేవతగా "విభీషణ తామ్ర పణ్యం" అని రాసివుంది. రాజవవంశ అనే మరో సింహళ బౌద్ధ గ్రంథంలో కూడా రావణుడి ప్రస్తావన వుంది.

"లంకాపురం", "శిరిసావత్తు" అనే రెండు సింహళ నగరాలు యక్షుల కేంద్రంగా వుండేవి. నాగులుకూడా వుండేవారు. బుద్ధుడు స్వయంగా లంకని సందర్శించినట్లు "మహావంశ" గ్రంథంలో వుంది. లంకలో కూడా బుద్ధుని సమాదరించింది నాగులే!

"వాలహాస జాతకం" లంకని "తామ్రపర్ణి"గానూ యక్షుల స్థావరంగానూ పేర్కొంది.

నాగులు ఓడలు నడిపేవారు గానూ, యక్షులు ఓడలపై వర్తక వాణిజ్యాలు నిర్వహించేవారు గానూ కన్పిస్తారు. "VEDDAH"లుగా ఈనాటికీ యక్షజాతి ప్రజలు పిలువబడ్తున్నారు.

పులింద శబ్దంకూడా వీరికి సంబంధించిందేనంటారు. యక్ష నాగ జాతుల్ని కూడా అసురశబ్దంతోనే వ్యవహరించారు. మొత్తం మీద అసుర, నాగ యక్ష జాతులకు, బౌద్ధులకూ సంబంధాలు ఉన్నాయనడానికి ఈ నిరూపణలు ముఖ్యం!

## బుద్ధుడి కాలం నాటి ఆంధ్ర రాజధాని నగరం భట్టిప్రోలు

క్రీస్తు పూర్వం 2/3 అశోకుడు పరిపాలిస్తున్న కాలానికి 30 ఆంధ్ర నగరాలున్నాయని శాసనాధారాలు చెప్తున్నాయి. కళింగుని ఓటమి కారణంగా, ఆనాటి ఆంధ్రులు అశోకుని ఏలుబడిలోకి మారి వుంటారని మనం వూహించవచ్చు.

అమరావతి, భట్టిప్రోలు, నాగార్జునకొండ, గుడివాద, ఘంటశాలలతో పాటు బోడపాడు, చందోలు, జగ్గయ్యపేట వంటి అనేక బౌద్ధ కేంద్రాలు కృష్ణాతీరంలో అశోకుని కాలానికే ప్రసిద్ధి పొంది వున్నాయి. కృష్ణానదికి అవలి తీరంలోనూ, ఈవలి తీరంలోనూ బౌద్ధ క్షేత్రం కాని ప్రాచీన గ్రామమే లేదంటే అతిశయోక్తి కాదు.

కొన్ని పరిశోధనల ప్రకారం బౌద్ధ మత విస్తృతికీ, కృష్ణాతీరంలో బౌద్ధ స్తూపాల నిర్మాణానికీ అశోకుడు ప్రేరకుడో, కారకుడో అయి ఉంటాడని తెలుస్తోంది. ఈ బౌద్ధ స్తూపాలలో బుద్ధుని అస్థికల్ని నిక్షిప్తం చేసి, వీటిని మహా చైత్యాలుగా మార్చి ఉంటాడని మరి కొందరంటారు.

భట్టిప్రోలు స్తూపంలో అశోకుని కాలం నాటి దాక్షిణాత్య బ్రహ్మి లిపిలో వున్న శాసనాలు కొన్ని దొరికాయి.

"ధర్మామృతం" అనే ప్రాచీన కన్నడ గ్రంథంలో అంగ దేశాన్ని పాలించే యశోధరు డనే ఇక్ష్వాకు రాజు గురించి ప్రస్తావన ఉంది. ఆయన ప్రతిపాలపురం రాజధానిగా దక్షిణ దేశాన్ని ఒక రాజ్యంగా నిర్మించినట్లు ఈ గ్రంథంలో వుంది.

బౌద్ధ స్తూపమూ, ఇంకా అనేక శాసనాలూ బైట పడిన తర్వాత అలెగ్జాండర్, స్యూయెల్ వంటి పాశ్చాత్య పరిశోధకులే కాకుండా మల్లంపల్లి సోమశేఖర శర్మ వంటి పండితులు, భట్టిప్రోలు గురించి అనేక పరిశోధనలు చేశారు. "ధర్మామృతం గ్రంథంలో చెప్పిన ప్రతిపాలపురం ఈనాటి భట్టిప్రోలు గ్రామమేనని శర్మగారు నిర్ధారించి చెప్పారు. స్తూపం అడుగున కుబేరకుడనే రాజుకు సంబంధించిన ఒక శాసనం కూడా కన్పించింది. ఈ కుబేరకుడు యక్షజాతికి చెందినవాడనీ, కాలక్రమంలో వైశ్య కులానికి మూల పురుషుడయ్యాడనీ పరిశోధకులంటారు.

అమరావతిలో నాగులూ, భట్టిప్రోలులో యక్షులూ ఆ రోజుల్లో ప్రధానంగా వుండి ఉండేవారేమోనని కొందరు పరిశోధకుల వూహ. శాసనాధారాన్ని పరిశీలించినప్పుడు జన సమ్మర్ధంగా వున్న ఒక పెద్ద పట్టణంలో ఈ బౌద్ధ స్తూప నిర్మాణం జరిగి వుంటుందని, బౌద్ధ మతంతో పాటు జైన మతం కూడా బహుళ ప్రచారంలో వుండి ఉంటుందనీ అర్థం అవుతుంది.

"ధర్మామృతం" అను కన్నడ గ్రంథంలో ఇందుకు సాక్ష్యంగా ఓ కథ కన్పిస్తుంది. ప్రతీపాలపురాన్ని రాజధానిగా చేసుకుని పాలించిన ఇక్ష్వాకు రాజుల్లో యశోధరుడి తర్వాత ధనదుడను రాజు పాలనలోకి వచ్చాడు. ఈ ధనదుడు జైన మతం స్వీకరించడమే కాకుండా జైన మత ప్రచారం కూడా చేశాడు.

ధనదుడి రాజ్యంలో "సంఘశ్రీ" అనే బౌద్ధ మత ఆచార్యుడుండేవాడు. "బుద్ధస్తుతి" అనే శ్లోకాన్ని రాసిన ప్రసిద్ధుడు ఈయనేనంటారు. "సంఘశ్రీ"కి కమలశ్రీ అనే అమ్మాయి వుంది. రాజు ధనదుడు ఈమెని ఇష్టపడి పెళ్ళాడతానని కోరాడు. సంఘశ్రీ అనుమతితోనే, కమలశ్రీని జైనమతంలోకి మతమార్పిడి చేయించి పెళ్లి చేసుకున్నాడు. అక్కడితో ఆగకుండా,

సాక్షాత్తూ సంఘశ్రీనే జైనంలోకి రమ్మనమని కూడా ఆహ్వానించాడు. జైనమతం గొప్పతనానికి సాక్ష్యంగా, ఆకాశంలో పురదేవతల్ని స్వయంగా చూపించాడట. దాంతో సంఘశ్రీ జైన మతాన్ని స్వీకరించి కూతురితో పాటు జైనుడిగా మారిపోయాడు.

బౌద్ధ సంఘారామాల్లో ఈ సంఘటన గొప్ప కలకలాన్ని సృష్టించింది. బౌద్ధులు, జైనులు పరస్పరం ఘర్షణలకు దిగారు. రాజ్యంలో మతకల్లోలాలు చెలరేగాయి.

బుద్ధశ్రీ అనే మరో బౌద్ధ మతాచార్యుడు సంఘశ్రీని మందలించి వెనక్కిరప్పించి మళ్ళీ బౌద్ధుడిగా మార్చాడు.

అప్పుడు ధనదుడు సంఘశ్రీని తన రాజ్యసభకు పిలిపించి "జైన దేవతల్ని ఆకాశంలో చూసి నమ్మిన తర్వాత నువ్వు జైనుడిగా మారావు కదా..... మళ్ళీ బౌద్ధంలోకి ఎందుకు వెళ్ళావు?" అని నిలదీసి అడిగాడు. సంఘశ్రీ తనకు ఏ జైన దేవతా కన్పించలేదని అబద్ధం ఆడాడు. రెండుసార్లు మతం మారడమే కాకుండా, అబద్ధం ఆడిన పాపానికి పురదేవతలు సంఘశ్రీ రెండు కళ్ళు పోగొట్టారట. అలా అంధుడైన సంఘశ్రీ వంశంలో ఆ తర్వాత కొన్ని తరాల పాటు అంధులే పుట్టారట. ఈ అంధులు నివసించిన దేశం కాబట్టి ఈ దేశాన్ని అంధకదేశం అన్నారని, అంధకదేశంలో ప్రజలు అంధకులయ్యారనీ, వీరే కాలక్రమంలో ఆంధ్రులుగా పిలవబడ్డారని ధర్మామృతం జైన గ్రంథం వివరిస్తోంది.

తాత్కాలిక ప్రలోభాలతో మతం మార్చుకుంటే కళ్ళు పోతాయని, మతం విషయంలో రాజునైనా లక్ష్య పెట్టవలసిన అవసరం లేదని, తమ మతంలోకి ఇతరుల్ని ఆకర్షించడంలో జైన బౌద్ధాలు పోటీ పడేవనీ ఈ కథ ద్వారా మనకు తెలుస్తోంది.

ధనదుడు తన పేరుతో ప్రతీపాలపురానికి దగ్గరలో ధనదుపురం అనే ఊరినీ, ధనకటకం అనే మరో ఊరినీ నిర్మించాడంటారు. పలనాడులో అనేక జినాలయాలు నిర్మింపచేశాడని కూడా అంటారు. ధనదుపురాన్ని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఈనాటి చందోలు గ్రామంగా గుర్తించారు. "ధన కటకం" ఈనాటి అమరావతి గ్రామమే! ఈ రెండు గ్రామాలు మొదట జైనక్షేత్రాలే కావచ్చు.

ధనదుపురం, ప్రతీపాలపురం, ధనకటకం - ఇవన్నీ క్రీస్తుశకం 5వ శతాబ్ది కాలంలో, త్రిలోచన పల్లవుడి ఏలుబడిలో ఉండి ఆ తర్వాత చోడ రాజుల వశం అయ్యాయి. బౌద్ధ జైన క్షేత్రాల్ని నిర్మూలించి, శైవ క్షేత్రాలుగా మార్చిన మొదటి ఘనత ఈ త్రిలోచన పల్లవుడిది.

భట్టి - విక్రమార్కుల్లో భట్టి సేనాని పేరున ఈ నగరాన్ని విక్రమార్కుడు కట్టించి దానికి భట్టిప్రోలు అనే పేరు పెట్టాడనే మరో నమ్మకం కూడా ప్రజల్లో వ్యాప్తిలో ఉంది.

ధనదుడు కేవలం పలనాటికి పరిమితమైన రాజు కాదు. కృష్ణకు ఈవలి తీరంలో కృష్ణాజిల్లా దివిసీమని జనావాస యోగ్యం చేసింది ధనదుడేనని గణపేశ్వరం శాసనంలో వుంది. ధనకటకం కూడా ఈ ధనదుడి పేరునే నిర్మితమైన నగరం కావచ్చని కొందరి ఊహ!

".....ద్వీపమ్ పురై తద్ధనదేన సృష్టమ్" అంటే, ధనదుడు ఈ ద్వీపాన్ని ప్రజల నివాసయోగ్యమైన పురంగా సృష్టించాడట!

శాసనాలలోనూ, జైన బౌద్ధ గ్రంథాలలోనూ కన్పించే ఈ ఆధారాల్లో ఎంతో కొంత అతిశయోక్తి వుండి వుండవచ్చు. అయినప్పటికీ, కనీసం రెండు వేల ఐదు వందల ఏళ్ళ చరిత్ర ఈ ఆంధ్ర రాజధాని నగరమైన భట్టిప్రోలుకు వుందని మనం విశ్వసించవచ్చు.

శిధిలీ భూతమైనప్పటికీ, అదృష్ట వశాత్తూ అమరావతి శిల్ప కళాసంపద కొంతమేరకైనా భద్రంగా వుంది. ఘంటశాల స్తూపానికి సంబంధించిన శిలాఫలకాలు కూడా కొన్నయినా వెలుగులోకి వచ్చాయి. కానీ, భట్టిప్రోలు స్తూపానికి సంబంధించిన పాలరాతి చెక్కడాలున్న రాళ్లన్నీ వెల్లటూరు లాకు గోడలలోనూ, నేల చప్టాలోనూ నిక్షిప్తమై పోయాయంటారు. మిగిలిన ఇటుకలన్నీ రోడ్డు నిర్మాణం కోసం నలిగిపోయాయి. అందువలన భట్టిప్రోలు స్తూపం పైని శిల్ప సంపద గురించి మనకి ఏమీ తెలియకుండా పోయింది.

నిజానికి పల్నాడులో దొరికే పాలరాయినే ఈ స్తూపంలో విరివిగా వాడారు. ఈ రాయి సహజంగా అందమైంది కాదనీ, నునుపుగా వుండదనీ, బండగా వుంటుందనీ, సిమెంటు పరిశ్రమకు పనికొచ్చేదేగానీ, శిల్ప కళా సంపదని సృష్టించడానికి లొంగేది కాదనీ నార్ల వారు అభిప్రాయపడ్డారు. అయినా, అధమం ఏ స్వల్ప శిల్ప విశేషమో, పద్మమో, ధర్మచక్రమో, పడగవిప్పిన పామో, బోధి లేక శ్రీపాదవృక్షమో ఈ పలకలపైన చెక్కబడి వుండే వుంటుంది. కానీ, ఏ ఒక్కటీ కన్పించక పోవడం దురదృష్టమే !

1894లో "రీ" అనే పరిశోధకుడు "దాక్షిణాత్య బౌద్ధ శిల్పాలు కృష్ణా తీరంలో భట్టిప్రోలు, ఘంటశాల, గుడివాడ పురాతన స్తూపాలు" అనే పేరుతో ఒక నివేదిక సమర్పించాడట!

నార్లవారు పూనేలో తాను ఆ నివేదికను చదివినట్లు రాశారు. భట్టిప్రోలు స్తూపంలో దొరికిన కలశం, గుడివాడ దీపాల దిబ్బలో దొరికిన విదేశీ నాణాలు, ఘంటశాలలో బయటపడిన అమరావతిని పోలిన శిలాఫలకాలు బౌద్ధ క్షేత్రాల యొక్క అత్యంత ప్రాచీనతని చాటి చెప్తున్నాయి.

భట్టిప్రోలు స్తూపం అడుగున దొరికిన అస్థికల కలశాన్ని ఆంగ్లేయులు అధికారంలో వున్న కాలంలో "రోనాల్డ్ షే" అనే అధికారి బెంగాల్లోని బౌద్ధ ఆరామానికి అందజేశాడట!

అస్థికల్ని, ఒక కలశంలో వుంచి, ఆ కలశాన్ని మణులు పొదిగిన ఒక పెట్టెలోను, దాన్ని స్ఫటికంతో చేసిన పేటికలోనూ, దాన్ని ఇంకో బంగారపు పేటికలోనూ భద్రపరచి వుంచారట. బంగారపు పెట్టెలో ఇలాంటివి మూడు స్ఫటికపు పేటికలు వున్నాయట. అస్థికల్ని మూడు పోగులుగా చేసి, వీటిని సంతృప్తి పరచి తర్పణాలు విడిచే వైదిక సాంప్రదాయానికి అనుగుణంగానే బుద్ధుని అస్థికల్ని కూడా మూడు పెట్టెలలో భద్రపరిచారనేది ఇక్కడి ముఖ్య విషయం.

భట్టిప్రోలు చారిత్రక ప్రాధాన్యతలో ఇంకో ప్రముఖ అంశం కూడా వుంది. అశోకుడి కాలంలో మహాదేవుడనే బౌద్ధ గురువు తన వెంట 14 లక్షల మంది యక్షుల్ని, ఈ భట్టిప్రోలు నుంచి సింహళానికి తీసుకెళ్ళాడని 'మహావంశ' బౌద్ధగ్రంథం చెప్తోంది.

అమరావతి నుంచీ శిల్పులు, భట్టిప్రోలు నుంచి కట్టడాల నిర్మాతలు, మచిలీపట్నం నుంచి చేనేత కార్మికులు క్రీస్తుపూర్వం మూడవ శతాబ్ది నాటికే సింహళం వెళ్ళారనడానికి చాలా ఆధారాలున్నాయి. కాబట్టి 14 లక్షల మంది సంఖ్య కొద్దిగా ఎక్కువ అనిపించినా పలనాటి ఆంధ్రులు సింహళానికి వెళ్ళారనే ఆధారం కేవలం అతిశయోక్తి అనడానికి వీల్లేనిది!

క్రీ.శ. 5వ శతాబ్ది వరకూ కృష్ణా తీరం నుంచి సింహళానికి నేరుగానే సంబంధాలు నడిచినట్లు బెంజిమిన్ రోలాండ్ అనే పరిశోధకుడు రాశాడు.

కృష్ణాతీరంలో బౌద్ధ స్తూపాలు ఏ రీతిలో నిర్మించారో, సింహళంలో బౌద్ధ స్తూపాలు కూడా అదే రీతిలో నిర్మితమై వుండటాన్ని ఆయన ప్రస్తావించాడు. అజంతా చిత్రాలలోని స్త్రీ మూర్తుల కన్నా, అమరావతి శిల్పాలలోని స్త్రీ మూర్తులు పలుచగా పూల తీగల్లా సుకుమారంగా కన్పిస్తారు. వీళ్ళు యక్షకన్యలో నాగకన్యలో కావచ్చు. సింహళంలోని బౌద్ధ స్తూపాల పైన కూడా ఈ యక్ష నాగకన్యలే కన్పిస్తారని విశ్లేషించాడు బెంజిమిన్ రోలాండ్.

క్రీస్తుశకం 1707 నుంచి 1780 దాకా సింహళాన్ని పాలించిన కాండ్యరాజులు అక్కడి బౌద్ధస్తూపాన్ని పునరుద్ధరించడానికి పల్నాడు నుంచి శిల్పుల్ని రప్పించారని ఇండియా ఇన్ సిలనీస్ హిస్టరీ, సొసైటీ అండ్ కల్చర్ అనే గ్రంథంలో ఎం.డి. రాఘవన్ రాశారు.

## బౌద్ధాన్ని ఆదరించిన తెలుగు రాజులు శాతవాహనులు

శాతవాహనులు తెలుగు నేలను పరిపాలించే కాలానికి పురాణాలు రూపొందడం మొదలయ్యిందంటారు. అందువలన అనేక పురాణాలలో శాతవాహనుల ఉనికి కన్పిస్తుంది. మౌర్య చక్రవర్తులు సుస్థిర పాలన అందించిన తర్వాత క్రీ.శ.. 240 నుంచి క్రీ.శ. 200

వరకూ నాలుగు శతాబ్దాలపాటు అజ్మీర్ నుంచి హిందూ మహాసముద్రం దాకా వున్న భారత భూభాగాన్ని శాతవాహనులు పరిపాలించారు. వీరిగురించి కొన్ని వివరాలు మనం తప్పకుండా పరిశీలించాలి.



1. శాతవాహన, అనేది ఈ రాజవంశం పేరు. రాయ సిముఖ లేదా శ్రీముఖ శాతవాహనుడు క్రీ.పూ. 240 నుంచి 217 దాకా పాలించాడు. వీళ్ళు జాతి రీత్యా ఆంధ్రులు. ఆంధ్ర జాతీయులని ఆంధ్ర భృత్యులనీ వీళ్ళని పురాణాల్లో వ్యవహరించారు.
2. మౌర్యుల పాలనా కాలంలో వీళ్లు వింధ్యను దాటి పశ్చిమ డెక్కన్ తీరంలోకి ప్రవేశించి వుండాలి.
3. కోస్తా ఆంధ్ర దక్షిణభాగం గుంటూరు జిల్లా భట్టిప్రోలు కేంద్రంగా పాలిస్తున్న కుబేరకుడి ఆధీనంలో వుంది. ఉత్తర కోస్తా ఆంధ్రం కళింగరాజు ఖారవేలుడి పాలనలో వుంది.
4. తొలి శాతవాహనులు విష్ణుభక్తులు. వాసుదేవ కృష్ణుడి మతానికి చెందినవారు. "శ్రీ" అనేమాట ఈ రాజవంశీకులందరి పేరుకు ముందో వెనకో కనిపిస్తూ వుంటుంది. వీరి నాణాలలో చక్రం, శంఖం, పద్మం, చేప, తాబేలు ఇలాంటివి ముద్రించబడి వున్నాయి. వీరి పాలనా కాలంలో వెలువడిన గాథా సప్తశతిలో హరి లేదా త్రివిక్రముడు, ఇతర దేవతలకన్నా ముఖ్యుడిగా కనిపిస్తాడు.
5. వీళ్ళు క్షత్రియులని కొందరు, బ్రాహ్మణులని కొందరు పరిశోధకులు భావించారు. నాగులకు చెందిన బ్రాహ్మణులని మరికొందరు పేర్కొన్నారు.
6. మొదటి శాతవాహన చక్రవర్తి శ్రీముఖ శాతవాహనుడు 23 ఏళ్ళు పాలించాడు. అతని కొడుకు శాతకర్ణి క్రీ.పూ. 198 నుంచి 188 వరకూ పది సంవత్సరాలు అప్రతిహతంగా పాలించి దక్షిణాపథపతిగా పిలువబడ్డాడు. అశ్వమేధయాగం చేసి, వైదిక ధర్మాలకు ప్రాణప్రతిష్టచేశాడు. కానీ, ఖారవేలుడి చేతిలో పరాజయం పాలై ప్రాణాలు కోల్పోయాడని ఒక వాదన వుంది.
7. అతని రాణి నాగానిక తన పుత్రులు వేదిశ్రీ, శత్తిశ్రీ, హోకుశ్రీ, శ్రీశాతవాహనుల్ని వీరులుగా పెంచి, పెద్ద కొడుకు వేదిశ్రీ చేత మళ్ళీ అశ్వమేధయాగం చేయించింది.

   శత్తిశ్రీ (శక్తిశ్రీ)ని విదర్భ ప్రాంతానికి, కుమార శాతవాహనుణ్ణి దక్షిణ ప్రాంతానికి పాలకులుగా నియమించారు. కుమార శాతవాహనుడు ఔరంగాబాద్, హైదరాబాద్, వరంగల్, కరీంనగర్ ప్రాంతాలను పాలించాడు. అతని అప్పటి రాజధాని కోటిలింగాల.

8. ఈ రాజవంశీకులలో ఆపీలకుడు, పులుమావి, కుంతలుడు, హాలుడు, ప్రసిద్ధులు. ప్రతిష్ఠాన పురమే వీరి రాజధాని నగరం. మహారాష్ట్రలో పైఠాన్‌గా పిలుస్తున్నారు దీన్ని. అప్పటికి ఇదంతా తెలుగు ప్రాంతమేనంటారు.

9. కుంతల శాతకర్ణి, హాలుడు స్వయంగా కవులైన చక్రవర్తులు. హాలుడి గాథా సప్తశతిలోని కొన్ని భాగాలు దొరుకుతున్నాయి కూడా ! 700 కథల సంపుటి ఈ గ్రంథం.

10. క్రీ.శ. 54 నుంచి 88 దాకా పాలించిన గౌతమీ పుత్ర శాతకర్ణి రాజ్యానికి వచ్చేనాటికి శాతవాహనులు గుజరాత్, అజ్మీర్, మాల్వా, అపరాంత, మూలక, వైజయంతి, కుంతల ప్రాంతాలన్నింటినీ పోగొట్టుకున్నారు. గౌతమీపుత్ర శాతకర్ణి తనని "బెనకట స్వామి"గా చెప్పుకొన్నాడు అంటే, బెనకటకం రాజధానిగా పాలించిన వాడని ! కోల్పోయిన రథాన్ని తిరిగి సంపాదించాడు. అశ్వమేధయాగం చేశాడు. శాతవాహన యశః ప్రతిష్టాపన కారుడని పించుకొన్నాడు. త్రిసముద్ర - తోయ-పిత-వాహనుడిగా కీర్తిపొందాడు.

11. కొడుకు పులుమావి కాలంలో రాజ్యం తెలుగు ప్రాంతాల్లోకి బాగా విస్తరించింది. పులుమావి కాలంలో అమరావతి, నాగార్జునకొండ వ్యాప్తిలోకి వచ్చాయి. ధాన్య కటకాన్ని తూర్పు రాజధానిగా ప్రకటించాడు.

12. పులుమావి తన దీర్ఘకాల విరోధి, శకమహాక్షాత్రప రుద్ర దామనుడు అనే "శక" రాజవంశీకుడి కూతురుని తన చిన్నతమ్ముడు వాసిష్టీ పుత్ర శాతకర్ణికి ఇచ్చి పెళ్ళిచేసి; తన తర్వాత రాజ్యాధికారం ఇచ్చాడు. వాషిష్ఠీ పుత్ర శాతకర్ణి తర్వాత రాజ్యం తిరిగి పులుమావి కొడుకు శివశ్రీ పులుమావికి వెళ్ళింది. "సంబంధ అవిదురతయ" అంటే, బంధుత్వం వుంది కాబట్టి శకరుద్ర దామనుడు శాతవాహనులతో విరోధం వదులుకున్నాడు.

13. ఆ తర్వాత ఇంచుమించుగా ఐదారు తరాలు మారాయి. శాతవాహనులు ఉత్తర భారత దేశంపైన పట్టు కోల్పోసాగారు. తెలుగు ప్రాంతాల్లో కూడా హైదరాబాద్ తదితర తెలంగాణా ప్రాంతాల నుంచి విదర్భ వరకూ వున్న భూభాగం శకుల ఆధీనంలోనూ, కోస్తా ఆంధ్ర ప్రాంతం శాతవాహనుల ఆధీనంలోనూ ఎక్కువ కాలం వుంది.

శైవం, వైష్ణవం, జైనం, బౌద్ధం అన్ని వైపుల నుంచి ముప్పిరిగొంటున్న ఈ కాలంలో శాతవాహనులు తెలుగు ప్రాంతంలో నిర్వహించిన పాత్రని పరిశీలించడానికి ఈ నేపథ్యాన్ని పరిచయం చేయవలసి వచ్చింది.

# క్రీస్తు పూర్వం నాటికే "తెలుగు" వినియోగం

ఐ. కార్తికేయ శర్మ తెలుగు శాతవాహనుల తెలుగు భాషా వినియోగం గురించి అద్భుతమైన విశేషాలు వెలుగులోకి తెచ్చిన పరిశోధకులు.

శాతవాహనులు మాట్లాడింది తెలుగే అయినా, ప్రాకృతాన్ని, సంస్కృతాన్ని, తమిళాన్ని కూడా ప్రోత్సహించారంటారాయన.

ఆ కాలంలో సంస్కృతం కేవలం కావ్యభాష. ప్రజలు మాట్లాడుతున్న భాష కాదు..... ప్రాకృతం అధికార భాష కావచ్చు. తెలుగు మాతృ భాషగావున్న ప్రజలు కూడా ప్రాకృతంలో రాజ్యవ్యవహారాలు నడిపేవారు. జైనులు, బౌద్ధులు పాళీ భాషను కూడా వినియోగంలోకి తెచ్చారు. అందువలన, పాళీ ప్రాకృత పదాలు కలిసిన తెలుగు జన వ్యవహారంలో వుండి వుండవచ్చు.



కుంతల శాతకర్ణి తన అంతః పురం లోని స్త్రీలు కూడా ప్రాకృతాన్ని ఉపయోగించాలని ఆదేశించాడట ! హాలుడు రాజకవి. 700 కథల్ని ఒక సంపుటంగా గాథాసప్తశతి ("సత్తసతి") పేరుతో గ్రంథాన్ని వెలువరించాడు. హాలుడి ప్రేమకథ కూడా లీలావతి పేరుతో వెలువడింది. గుణాఢ్యుని బృహత్కథ కూడా అప్పుడే వెలువడింది. ఇవన్నీ ప్రాకృత భాషలో వెలువడిన ఆనాటి తెలుగు ప్రజల జీవనాన్ని చాటిచెప్పే సామాజిక రచనలు. వాటిలో కొద్ది భాగాలు మాత్రమే మనకు దొరుకుతున్నాయి.

తెలంగాణా విదర్భలను పాలించిన శకులు ఖరోష్ఠి - బ్రాహ్మీలోనూ, గ్రీకులోనూ రాజ్య వ్యవహారాలు నడిపారు. శాతవాహనులు బ్రాహ్మీ, ప్రాకృతం, తొలి తెలుగు భాషల్ని ఉపయోగించారు.

శాతవాహనులు నాగార్జున కొండ దగ్గర నాణాలు ముద్రించే "టంకశాల"ని నెలకొల్పినట్లు కార్తికేయ శర్మగారు పేర్కొన్నారు.

పులుమావి కాలం నాటి ఒక నాణెం మీద ఒకవైపున "అరహనకు వాహిత్తి మకనకు తిరుపులు మానికు" అని వుంది. వాసిష్ఠి పుత్రుడైన తిరు పులుమావి నాణెం అని దాని అర్థం. శాతకర్ణి-IV కాలంనాటి ఒక నాణెం మీద "అరహనకు వాహిత్తి మకనకు తిరుహాతకానిరు -" అని వుంది. వాసిష్ఠి పుత్రుడైన తిరు శాతకర్ణి అని దాని అర్థం.

యజ్ఞశ్రీ శాతకర్ణి కాలంనాటి ఒక నాణెం మీద "అరహనకు పుత కుహిరుయాన హోత కానికు" అని వుంది. గౌతమీపుత్ర తిరు యజ్ఞశాతకర్ణి పేరు ఇది.

కార్తికేయ శర్మగారి పరిశోధన ప్రకారం "తిరు" అనేది శ్రీ పదానికి ప్రాకృతమార్గం. "హోతకానిరు" అనేది శాతకర్ణికి ప్రాకృత రూపం, "అర్హనకు" అనేది "అర్శనకు" (అర్చనకు) అనే తెలుగు ప్రయోగం అంటూ, క్రీస్తు పూర్వం చివరి శతాబ్ది నాటికి తెలుగు వినియోగంలో వున్నదనడానికి ఇది గొప్ప సాక్ష్యంగా ఆయన పేర్కొన్నారు. ఒక బౌద్ధ శిలా ఫలకం మీద "నాగబు" అనే తెలుగు అక్షరాలు కన్పించడం కూడా తెలుగు అత్యంత ప్రాచీన భాష అని చాటిచెప్పడానికి విలువైన సాక్ష్యం.

బుద్ధుడితో సాహచర్యం, బౌద్ధ ధర్మాల్ని అనేక మలుపులు తిప్పి, ఎన్నో కొత్త ప్రతిపాదనలు చేసిన సాంకేతిక పరిజ్ఞానం తెలుగువారిని ఆ రోజున ఉన్నతంగా నిలబెట్టాయి.

బౌద్ధ గ్రంథాల్ని, బౌద్ధ ఆధారాల్ని నశింప చేయడంవలన ఆనాటి తెలుగు వారి పాత్ర వెలుగులో లేకుండా పోయింది!

## తెలింగ - కళింగ

ఉత్తరకోస్తా తెలుగు ప్రాంతాల్ని మొదటి నుంచి "కళింగ" ప్రాంతాలుగానే వ్యవహరించే వారు. పల్లపు ప్రాంతాలు అనే అర్థం కావచ్చు. శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పుగోదావరి..... ఈనాటి ఈ జిల్లాలు - బుద్ధుడి కాలానికి కళింగలో అంతర్భాగంగా వుండేవి.

శ్రీకాకుళం జిల్లా ఆముదాల వలస దగ్గర సువర్ణముఖి (లేక) సువర్ణ రేఖ నదికి, గోదావరి ఉత్తర తీరానికి మధ్య నున్న ప్రాంతాన్ని మధ్యమ కళింగ అని వ్యవహరించారు.

క్రీస్తు పూర్వం 4వ శతాబ్ది నాటికి మగధరాజులు కళింగని పాలిస్తున్నట్లు హాతిగుంఫ శాసనాల ఆధారంగా తెలుస్తోంది. అయితే మౌర్యులు కళింగని పాలించినట్లు లేదు. అశోకుడు చేసిన ఆఖరి యుద్ధం కళింగని జయించడమే నన్నది అందరికీ తెలిసిన చరిత్రే! చంద్రగుప్తుడు ఆరు లక్షల సైన్యంతో ఒకసారి కళింగని జయించినట్లు చెప్తారు గాని, మౌర్యులు నేరుగా పాలించలేదనీ కళింగుల్ని సామంతులుగా చేసుకొని, రాజ్యాన్ని ఇచ్చేశాదనీ అంటారు.

మౌర్య సామ్రాజ్య పతనం తర్వాత కళింగ జెండాని ఎగరేసిన మహావీరుడు ఖారవేలుడు చేది రాజవంశం వాడు. క్రీస్తు పూర్వం రెండవ శతాబ్ది కాలంవాడు.

కళింగాధిపతి, మహా మేఘవాహన బిరుదులు పొందిన వాడు. ఈనాటి మచిలీపట్నం వరకూ వున్న భూభాగాన్నంతా జయించి శాతవాహనుల్ని నిరోధించ గలిగినవాడు. మచిలీ పట్నం దగ్గర "ప్రిటుండా" నగరాన్ని ధ్వంసం చేశాడని జన ఐతిహ్యం కూడా ఉంది.

ఖారవేలుడు కృష్ణాతీరంవరకూ కళింగ రాజ్యంలో కలిసిన తర్వాత తెలుగు ప్రాంతం తెలింగగానూ, కళింగగానూ రెండు భాగాలుగా వుంది. తెలింగాణాలో శాతవాహనులది ఆధిపత్యం. కోస్తా జిల్లాల్లో ఖారవేలుడిది ఆధిపత్యం.

"సుత్త నిపాత" అనే బౌద్ధ గ్రంథంలో బుద్ధుడి జీవిత కాలంలోనే అస్సక దేశంలోకి బౌద్ధం ప్రవేశించినట్లు వుంది. బావరి ఈ అస్సక దేశీయుడు. ఈయన గోదావరి ఒడ్డున జీవించాడు. బుద్ధుడితో వైశాలిలో బావరి జరిపినట్లుగా చెప్పబడ్తున్న సంభాషణలు ఈ సుత్తనిపాతంలో వున్నాయి. బావరి శిష్యులు బుద్ధునినుంచే స్వయంగా "దమ్మ"ని తెలుసుకొని బౌద్ధులుగా మారి, తెలుగు దేశానికి వచ్చి దాన్ని ప్రచారంచేసినట్లు ఈ గ్రంథం చెప్తోంది. అస్సక దేశం ఈనాటి నిజామాబాద్ ప్రాంతం కావచ్చని ఇంకొక అభిప్రాయం వుంది.

## శాతవాహనులకు అమరావతి వాణిజ్య రాజధాని

"కటకం" అనే మాట కోటకు సంబంధించింది కావచ్చు. రాజధాని నగరాన్ని "కటకం" అనేవారు. నగరకటకం, సింధుకటకం, కళ్యాణకటకం,..... ఇవన్నీ రాజధాని నగరాలే.



ధాన్యకటకం కూడా రాజధాని నగరమే అయివుండాలి. శాతవాహన ప్రభువు వాసిష్ఠీపుత్ర పులుమావి కృష్ణాజిల్లా శ్రీకాకుళం నుంచి రాజధానిని ధాన్యకటకానికి మార్పు చేశాడు. రాజధాని మారిన తర్వాత ధాన్యకటకంగా మారిందా..... అంతకుమునుపు దీనిపేరు ధాన్యకటకమేనా అనే మీమాంసకు సమాధానంగా, అమరావతిలోని కొన్ని శిలాఫలకాల మీద, మౌర్యుల కాలంనాటి లిపిలో "ధనకటకం" అనే రాసివుందని చెప్తారు.

అయితే, మౌర్యుల తర్వాతే శాతవాహనులు రాజ్యానికి వచ్చారు. అశోకుడు అమరావతి బౌద్ధ స్తూపానికి నిర్మాతగాని, విస్తారకుడుగానీ అయి వుంటాడని నమ్మడానికి తగిన ఆధారాలే వున్నాయంటారు. అశోకుడికన్నా శాతవాహనులకన్నా ముందే ధాన్యకటం

వుంది. అక్కడ బౌద్ధ స్తూపమూ వుంది. అది చైత్యవిహారం. అతిపవిత్రం కూడా. శాతవాహనులు బౌద్ధస్తూపానికి పై మెరుగులు (elevation) దిద్ది వుంటారు. వారి కాలంలోనే తెలుగు నేలమీద అనేక బౌద్ధ స్తూపాలు వెలిశాయి.

## రెండువేల ఏళ్ళనాటి ఓ బ్యాంకు కథ

"శ్రేణి" అంటే వర్తక వాణిజ్యవేత్తల యూనియన్ లాంటిది. శాతవాహనుల కాలంలో ఈ పదం బాగా వ్యాప్తిలోకి వచ్చింది. "గిల్డ్" అనేమాట శ్రేణికి సమానార్థకం.

ఏ వృత్తికి చెందిన వారికి ఆ "గిల్డ్" వుండేది. ఎవరి "శ్రేణి" వారిదన్నమాట!

ధర్మణిక శ్రేణి, కారాకార శ్రేణి, తెసకార శ్రేణి ..... ఇలా వీటికి ఆ రోజుల్లో పేర్లుండేవి -

ఈ శ్రేణుల ప్రధాన కార్యాలయాన్ని "నిగమసభ" అన్నారు. ఇక్కడ "సభ" అంటే సెంట్రల్ ఆఫీస్ అని!

శ్రేణికి సరుకులు సరఫరా చేసేవాడుగానీ, పెట్టుబడి పెట్టేవాడుగాని, ఆ మేరకు ఈ నిగమసభలో తమ పేరు రిజిష్టర్ చేయించుకునేవాడు.

దేశవ్యాప్తంగా జరిగే వర్తక వాణిజ్యాలన్నింటినీ ఈ నిగమసభలే తమ అదుపులో నడుపుతుండేవి.

ఈ శ్రేణుల నిర్ణయాలపైన స్థానిక ప్రభుత్వానికి ఎలాంటి అదుపు వుండదు. పూర్తి స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన ఒక వ్యవస్థగా ఇవి నడిచేవి. అంతకు తగ్గ ప్రజాస్వామ్య యుతమైన పాలనావ్యవస్థ (Administrative set-up) శ్రేణులలో వుండేది.

ఈ శ్రేణుల పనితీరు బ్యాంక్ తరహాలో వుండేది. నెలసరివడ్డీ వసూలు చేయడం కూడా ఆచారంగా వుండేది. ఒకశ్రేణిలో "పావొనదుకు మాసం" వడ్డీకి కొంతసొమ్మును అప్పుతెచ్చి పావోమాసం వడ్డీకి ఇంకోశ్రేణిలో పెట్టుబడి పెట్టిన వ్యక్తుల వైనాలు కూడా వున్నాయి.

అంటే, ఒక బ్యాంకులో తక్కువ వడ్డీకి అప్పుతెచ్చి, ఇంకో బ్యాంకులో ఎక్కువ వడ్డీ ఇస్తుంటే, అక్కడ మదుపు చేసే తెలివితేటలు ఆ రోజుల్లో కూడా వుండేవి. "ఉశ్వదాత" అనే వ్యాపారి రెండువేల కార్షాపణల్ని ఒక చేనేత శ్రేణిలో ప్రతిక శాతం వడ్డీకి (12%) పెట్టుబడి పెట్టాడట. ఇంకో చేనేత శ్రేణిలో వెయ్యి కార్షాపణల్ని ముప్పాతిక శాతం (9%) వడ్డీకి పెట్టుబడి పెట్టాడట.

డిపాజిట్లు తీసుకోవడం, అప్పులివ్వడం, వ్యాపార లావాదేవీలు నిర్వర్తించడం, వ్యాపారుల మధ్య వివాదాలు పరిష్కరించడం, ఉత్పత్తిని పెంపొందించడం ..... ఇలా ఎంతో కట్టుదిట్టంగా వుండేది ..... కృష్ణాతీరంలో ..... ఆనాటి బ్యాంకింగ్ వ్యవస్థ! ఇంత వ్యవస్థ ఏదీ లేకుండానే టాలాటోలీగా రోమ్ వరకూ వర్తక వాణిజ్యాన్ని విస్తరించగలిగేవారా కృష్ణాతీరం తెలుగువారు.....???

## అమరావతి కేంద్రంగా మహాసాంఘిక బౌద్ధం

క్రీస్తు శకం తొలి శతాబ్దాలలో బౌద్ధం ఎక్కువగా ఈనాటి అమరావతి కేంద్రంగా నడిచింది. ఆ రోజుల్లో దానిపేరు ధాన్యకటకం.

1. ధాన్యకటకంలోని బౌద్ధ స్తూపాన్ని మహావిహారం అని పిలిచేవారు.
2. దాని పశ్చిమ ద్వారం దగ్గర "ధర్మ చక్ర ధ్వజం" పేరుతో పెద్ద జెండా స్తంభం వుండేదిట. ఇది పూర్వ శైలికా శాఖకు చెందిన మహా సాంఘిక బౌద్ధులు నిర్మించిందంటారు.
3. శాతవాహన చక్రవర్తి వాసిష్ఠీపుత్ర పులుమావి దీని నిర్మాత లేదా ప్రోత్సాహకుడు.
4. పూర్వ శిల అనే పదం జగ్గయ్యపేటలో దొరికిన శిలాఫలకం మీద మొదట కన్పించింది. అల్లూరు బౌద్ధ శాసనం అని పిలుస్తారు దీన్ని!
5. నాగార్జున కొండలో దొరికిన శిలాఫలకాలలో "అపర శిల" అనే పదం దొరికింది. అమరావతిలో కూడా అపరశైలికుల ప్రస్తావన దొరికింది.
6. ధనకటక ప్రాంతానికి అంటే, అమరావతి సీమని "మహావన శైలం" అని పిలిచారు.
7. శాతవాహనుల రాజధానిగా అమరావతి నడిచినంతకాలం ధరణికోట బౌద్ధ ధర్మాలకు ప్రధాన స్థావరంగా నిలిచింది. మహాసాంఘికుల పుట్టిల్లుగా విలసిల్లింది.

## విరాళాలు పోగేసి స్తూపాలు నిర్మించారు

స్తూపాలకు రాజులు, ధనికులు, వ్యాపారులు, బౌద్ధ భిక్షువులు ప్రజలు విరివిగా విరాళాలిచ్చి నిర్మించారు.

సాంచి స్తూప నిర్మాణానికి 80 మంధి బౌద్ధ భిక్షువులు, 70 మంది స్త్రీ భిక్షువులు విరాళాలిచ్చినట్లు ఒక లిస్టు దొరికిందిట. బార్హత్, కన్హారీ, కార్లే, బౌద్సా, నాసిక్, జున్నార్‌లలో నిర్మితమైన బౌద్ధవిహారాలలో కూడా దాతలపేర్లు కన్పించాయి.



అనుపు దగ్గర బౌద్ధస్తూప శిథిలాలు

"భిఖ్ఖూనాం దేయధానం" అనేపదం దాతలుగా వున్న బౌద్ధ భిక్షువుల్నే సూచిస్తోందని అంటారు.

భిక్షువులు కట్టుబట్టలతో ఇల్లువదిలి వచ్చినప్పుడు, సర్వసంగ పరిత్యాగులైన ప్పుడు విరాళాలిచ్చేంత అవకాశం వారికి ఎలా వుంటుంది? విరాళాల్ని వసూలు చేసింది భిక్షువు లేననీ ఎవరెంత వసూలు

చేసి తెచ్చి ఇచ్చారో ఆ వివరాలు పేర్కొని ఉంటారని అంటారు.

విరాళాలు కేవలం స్తూపాలు ఆరామాల నిర్మాణానికి మాత్రమే కాదు, బౌద్ధ సంఘం నిర్వహణ కోసం కూడా అవసరం. అందుకని, విరాళాల వసూలు అనేది ఒక నిరంతర వ్యవ హారంగానే వుండేది.

ధాన్యకటకంలో అమరావతి బౌద్ధ స్తూపం నిర్మాత ఖచ్చితంగా ఎవరో తెలియదు. అయితే, దానికి ఒకరూపాన్ని సమకూర్చి పెట్టి, చుట్టూ అందమైన ప్రాకారాన్ని నిర్మింపచేసిన వాడు సిద్ధ నాగార్జునుడు.

నాగార్జునుడు "యజ్ఞశ్రీ శాతకర్ణి" అనే శాతవాహన ప్రభువు పాలిస్తున్నకాలం నాటివాడు. శాతకర్ణి క్రీ.శ. 174 నుండి 202 వరకూ పాలించాడు. అమరావతి స్తూపనిర్మాణం ఎప్పుడు ప్రారంభమైనా, నిర్మాణాన్ని పూర్తిచేసింది శాతవాహనులే! అందుకు కావలసిన వనరులు సమకూర్చింది నాగార్జునుడు.

## అమరావతి విశేషాలు

అమరావతి అనేది ఈనాటి పేరు. దీనికి ధాన్యకటకం, ధాన్యవాటి, ధరణికోట, ధన్నదకోట, ధరణాల కోట..... ఇలా చాలాపేర్లు వ్యవహారంలో వున్నాయి.



శాతవాహనులు రాజధానిగా ధాన్యకటకాన్ని పాలించినప్పుడు ఆనాటి రాజుల నివాస గృహాలుగాని, కోట గాని, రాజాంతఃపుర భవనాలు గానీ, ఇప్పుడు మనకి ఏమీ కన్పించవు. ఒక గొప్ప బౌద్ధస్తూపమే అంతరించిపోతే, మామూలు కోటలు ఇంకెక్కడ మిగిలి వుంటాయి?

కాకతీయ ప్రతాపరుద్రుడు అమరావతిలోనే వుండి, కృష్ణాతీరంలోని రాజకీయాల్ని అధ్యయనం చేశాడు. వారి కాలంనాటి కోటకూడా కనీసం ఒకటి వుండాలి. ఆయన ఇక్కడే శైవమత దీక్ష తీసుకున్నట్లు ఆధారాలు చెప్తున్నాయి.

క్రీ.శ. 1182లో ఒకశాసనంలో బుద్ధుడి పవిత్రావశేషాల్ని భద్రపరిచిన "ధనకటక చైత్యం" సురపురం దగ్గర వుందని రాసివుంది. అక్కడే ప్రోలయ వేమారెడ్డి ఒక కోటను నిర్మించినట్లు ఈ శాసనంలో వుంది. రెడ్డి రాజుల కాలంనాటికి 12వ శతాబ్దిలో ఈ ఊరిపేరుని ధరణి కోటగా ఆయన ఉదహరించాడు.

ఒకటవ శతాబ్దికి పూర్వం ధాన్యకటకం - 10వ శతాబ్దికి పూర్వం ధరణికోట, 19వ శతాబ్ది పూర్వం సురపురం, ఆ తర్వాత అమరావతిగా మారిందని దీన్నిబట్టి అర్థం అవుతోంది.

చైనా యాత్రికుడు, బౌద్ధ ధర్మ ప్రచారకుడు హ్యూన్‌త్సాంగ్ ఆనాటి తెలుగు వారి రాజధానినగరం నుంచి 265 కిలోమీటర్ల దూరం ప్రయాణించి తె-నా-కా-చెన్ (ధనకటకం) వచ్చినట్లు రాసుకున్నాడు. ఆనాటి తెలుగు వారి రాజధాని నగరాన్ని చైనా భాషలో "ఆంతోలో" అని రాసుకున్నాడు "ఆంతోలో" ఎక్కడుంది? ఎక్కడున్నదో హ్యూన్‌త్సాంగే రాశాడు..... "పింగ్-కీ"లో కోసలకు నైరుతిగా 240 కిలోమీటర్ల దూరాన వున్నదన్నాడు! "పింగ్-కీ" అంటే ఏది? ఇది తేలని ప్రశ్న అయ్యింది.

బహుశా వేంగి నగరాన్ని "పింగ్-కీ" అని వుండవచ్చని అనుకొందాం. ఎందుకంటే, క్రీ.శ. 629-645 మధ్య కాలంనాటి వాడయిన హ్యూన్‌త్సాంగ్ తెలుగు ప్రాంతాలకు వచ్చేనాటికి ఏలూరు సమీపానవున్న "వేంగి" నగరమే తెలుగు వారి రాజధానిగా వుంది.

హ్యూన్‌త్సాంగ్ మనగురించిన రాసిన విశేషాలు ఇవి -

1. ఒక్క ధనకటం (అమరావతి నగరం)లోనే బౌద్ధవిహారాలు అనేకం ఉన్నాయి.
2. అయినా, వేటిలోనూ బౌద్ధులు నివసించడంలేదు. అందరూ ఖాళీచేసి వెళ్ళిపోయారు.
3. ఇక్కడ బౌద్ధమతం నామమాత్రంగానే వుంది.

4. చుట్టుపక్కల 100 వైదిక దేవాలయాలున్నాయి.
5. రాజధానికి తూర్పుగా ఒక చిన్నకొండ మీద "తూర్పుకొండ విహారం" (పూర్వశిల) పేరుతో ఒక బౌద్ధారామం వుంది. ఇది పూర్వశైలికులు బోధించిన బౌద్ధ ధర్మాలకు కేంద్రస్థానం.
6. పడమరదిశగా ఒక చిన్న కొండమీద "పడమటికొండ విహారం" వుండేది. ఇది అపరశైలికుల సిద్ధాంత కేంద్రం !

పూర్వ శిల, అవరశిల అనేవి నాగార్జునుడి మాధ్యమిక వాదంలో రెండు భిన్నమైన తెగలు. ఈ రెండు రకాల సిద్ధాంత కర్తలు ఒకరు ఉండవల్లి కొండనీ, ఇంకొకరు బెజవాడ మొగల్రాజపురం కొండనీ ఆశ్రయించుకొని బౌద్ధవిహారాలు నడుపుతూ తమసిద్ధాంతాల్ని పరిచయం చేసుకున్నారని హ్యూన్‌త్సాంగ్ మాటల్ని బట్టి కొందరు పండితులు భావిస్తున్నారు.

## అమరావతి స్తూపంలో తెలుగుదనం

★ అమరావతి శాతవాహనుల కాలంలో తెలుగువారి రాజధాని కావడానికన్నా ముందే బౌద్ధుల రాజధానిగా మారింది.

★ నదీతీర పట్టణం కావడం, వస్తువుల ఎగుమతులు దిగుమతులకు అవకాశాలు ఎక్కువగా వుండటం, రహదారుల కూడలి కావడం ఆనాటి ధనకటకం ప్రత్యేకతలు.

★ 8వ శతాబ్దిలో బెజవాడ దగ్గర ఆనకట్ట వలన రహదారుల కూడలిగా బెజవాడ మారింది. కానీ, రెండు వేల ఏళ్ళనాటికన్నా పూర్వం ఇలాంటి అవకాశం ధనకటకానికి వుండేది. శాతవాహనులు తమ తూర్పు రాజధానిగా ధనకటకాన్ని ప్రకటించడానికి కారణం ఇదే.

★ శిల్ప కళారీతుల్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు అమరావతి స్తూపానికి కొన్ని ప్రత్యేకతలున్నాయి. నాలుగు ప్రధాన అంచెలు ఈ స్తూపంలో కన్పిస్తాయి. అట్టడుగున వేదిక, దానిపైన ఉల్లిపాయ ఆకారంలో అండం నిర్మితమై ఉంటాయి. అండంపైన హార్మికం, హార్మికపైన పొడవైన ఛత్రం వుంటాయి.

★ కట్టడాలు ఎత్తుగా నిర్మించి, పెద్దపెద్ద బుద్ధుడి విగ్రహాలు పెట్టడం అనేది కాలక్రమంలో బౌద్ధ సిద్ధాంతాల్లో మార్పులు ఏర్పడుతున్నకొద్దీ ఏర్పడిన పరిణామాలు. జన సామాన్యాన్ని మరింతగా ఆకర్షించడానికి ఎత్తయిన కట్టడాలు ఎక్కువ తోడ్పడతాయి.

★ వేదికని అనేక శిల్పాలు చెక్కిన పాలరాతి పలకలు బిగించి అలంకరించడం కూడా తెలుగువారి సాంప్రదాయమేనని ఆంధ్రశిల్పము గ్రంథములో శ్రీపాద గోపాల కృష్ణమూర్తి గారు రాశారు.

# బౌద్ధాన్ని విస్తరింపచేసిన ఇక్ష్వాకులు

శాతవాహనుల వాణిజ్య రాజ్యం అంతరించి కత్తితో రాజ్యాలు సాధించుకునే పరిస్థితులు తలెత్తాయి. శాతవాహనుల సామంతులంతా సార్వభౌమత్వాన్ని ప్రకటించు కున్నారు. మళ్ళీ చిన్నచిన్న రాజ్యాలు ఏర్పడడం మొదలయ్యింది.

మహారాష్ట్ర అభీరుల పాలనలోకి వెళ్ళింది. కర్ణాటకలో చూటుకులు తలెత్తారు. ఇక్ష్వాకు రాజులు నాగార్జున కొండ వద్ద వున్న విజయపురిని రాజధానిగా చేసుకొని సుమారు 50 ఏళ్ళపాటు కృష్ణాతీరాన్ని పాలించారు. కరీంనగర్, నల్గొండ, గుంటూరు, కృష్ణా జిల్లాలలో ఈ రాజ్యం విస్తరించి వుండేది.

వీళ్ళు శాక్యవంశీకుడైన గౌతముడి ఇక్ష్వాకు వంశీకులుగా తమని చెప్పుకున్నారు. క్షత్రియులం అని చెప్పుకోవడమే ఇక్కడ ప్రధాన అంశం ! నాగార్జున కొండనుంచి, శ్రీశైలం దాకా వున్న పర్వత శ్రేణికి పాలకులైన ఇక్ష్వాకుల్ని పార్వతేయులని కూడా అంటారు.

వాసిష్ఠీపుత్ర చాంతమూలుడు ఈ ఇక్ష్వాకు రాజుల్లో మొదటి వాడు. అతని తర్వాత వీర పురుషదత్తుడు, బహుబల క్షాంతిమూలుడూ రాజ్యపాలన చేశారు. ఈ ముగ్గురే సుమారుగా 50 ఏళ్ళు పాలించారని చరిత్రకారులు అంటారు.

చాంతమూలుడు కూడా అశ్వమేధాది యజ్ఞకాండల్ని నిర్వహించాడు. అతని చెల్లెలు శాంతిశ్రీ బౌద్ధమతానుయాయి. ఈమె నాగార్జునకొండమీద బౌద్ధ మహాచైత్యాన్ని నిర్మింపచేసిందని చరిత్రకారుల భావన.

"బ్రాహ్మణులు, శ్రమణకులు, నిరాధారులైన పేదప్రజల పట్ల కనికరంతో శాంతిశ్రీ విస్తారంగా దానాలు చేసింది. ఆమె వితరణశీలి. పుట్టింటికీ, మెట్టినింటికీ క్షేమం కలగాలని కోరుకుంది. బౌద్ధ భిక్షువులకు ఒక ఆరామం కట్టించింది..... ఈ అర్థం వచ్చేలాగా నాగార్జున కొండమీద బౌద్ధచైత్యం దగ్గర ఈమె వేయించిన శాసనంలో రాసివుంది.

ఇంకొక శాసనంలో తన మేనల్లుడైన మఠరీపుత్ర విరూపాక్ష దత్తుడికి దిగ్విజయ యాత్రలో జయం కలగాలనీ, తనకు మోక్షం కలగాలనీ మరొక ఆరామాన్ని కట్టిస్తున్నట్లు పేర్కొంది.

ఈ ఆరామాల నిర్మాణానికి భదంత నాగార్జునులు స్వయంగా పర్యవేక్షించారు. శిల్పాలు చెక్కిన శిల్పుల పేర్లుకూడా ఆయన చెక్కించారు. భదంతుడంటే మహాచైత్యాల నిర్వాహకుడని !

రాజుగారి కోశాధికారి బోధిశర్మగారి మేనకోడలు బోధిశ్రీ బౌద్ధభిక్షువుగా మారింది. ఈమె కూడా నాగార్జునకొండమీద కొన్ని ఆరామాలను నిర్మించింది. సింహళం (తామ్రపర్ణ

దేశం), కాస్మోర (కాశ్మీరం), గాంధారం (ఆఫ్ఘనిస్తాన్), చైనా, ఇంకా అనేక దేశాల నుంచి వచ్చే బౌద్ధ సందర్శకులకోసం ప్రత్యేకంగా ఆరామాలు కట్టించింది.

ఇక్ష్వాకు రాజు వీరపురుషదత్తుడు రాజ్యాన్ని తన కొడుకు బాహుబలుడికిచ్చేసి, తాను బౌద్ధ భిక్షువుగా మారినట్లు చెప్తారు. వీరపురుషదత్తుడు బౌద్ధం స్వీకరించిన గాథని శిల్పాల్లో మలిచారు.

ఒక శిల్పంలో బుద్ధుడు స్వర్గం నుంచి కిందికి దిగివస్తున్నట్లుంది. రాజు బుద్ధునివైపు పోతూవుంటే అంతఃపుర స్త్రీలు ఆయన్ని నిరోధిస్తూ ఉంటారు.

రెండో శిల్పంలో రాణుల్ని వదిలించుకొని వీరపురుషదత్తుడు బుద్ధునికి సాష్టాంగ పడతాడు.

మూడో శిల్పంలో రాజు శివలింగాన్ని కాలితోతన్ని తోసేయడం కన్పిస్తుంది. ఆశివ లింగాన్ని చుట్టుకొని ఒక నాగుపాము వుంటుంది. బహుశా నాగులతో తెగతెంపులు చేసుకోవమో, సంధి రద్దు చేసుకోవడమో, వారిని ఓడించి గెంటివేయడమో అప్పుడు జరిగి వుండొచ్చు.

నాలుగో శిల్పంలో రాజు సాధారణ దుస్తులు ధరించి, 8 మంది అనుచరులతో బౌద్ధ సన్యాసం స్వీకరించినట్లు వుంది.

ఐదవ శిల్పంలో రాజకుమారుడు బాహుబలుడు బౌద్ధ భిక్షువులకోసం దానధర్మాలు చేస్తున్న దృశ్యాన్ని చెక్కారు. ఇది ఆధునికీకరించబడిన మహాయాన బౌద్ధానికి స్వర్ణయుగం అనదగిన కాలంలో జరిగిన వృత్తాంతం !

## ఆంధ్రప్రదేశ్‌లో బౌద్ధ స్తూపాలు

ఆంధ్రప్రదేశ్‌లో ఇంచుమించుగా, ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రాలు అనదగినవి ఒక 50 వరకూ వుండవచ్చని అంచనా! ఇంకా భూగర్భంలో ఇలాంటివి ఎన్నివుండి వుంటాయో, కొండలు గుట్టల్లో చెట్ల మాటున దాగి, ఎన్ని బౌద్ధక్షేత్రాలు కనుమరుగై వున్నాయో చెప్పలేం.

గోదావరికి ఎగువున శ్రీకాకుళం వరకూ ఇంచుమించుగా 13 బౌద్ధ క్షేత్రాల్ని కనుగొన్నారు. సరిపల్లి, కళింగపట్నం, శాలిహుండం, రామతీర్థం, తోట్లకొండ, బావికొండ, గోపాలపట్నం, పావురాలకొండ, బొజ్జనకొండ, లింగాలకొండ, కొత్తూరు, లింగరాజుపాలెం, పిఠాపురం, కొడవలి, కాపవరం, ఆదుర్రులలో బౌద్ధ స్తూపాల ఆనవాళ్ళు దొరికాయి.

పశ్చిమగోదావరి, కృష్ణాజిల్లాల్లో 8 స్తూపాలు కనిపించాయి. ఆరుగొలను, గుంటుపల్లి, అశ్వారావుపేట, అల్లూరు, గుమ్మడిదుర్రు, గుడివాడ, ఘంటశాల, జగ్గయ్య పేటలు ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రాలు.




తెలంగాణా ప్రాంతంలో 10 బౌద్ధక్షేత్రాల్ని కనుగొనగలిగారు. ఖమ్మంజిల్లా నేలకొండపల్లి, తిరుమలగిరి, పణిగిరి, వర్ధమానకోట, నల్గొండ జిల్లా గాజులబండ, ఏలేశ్వరం, కరీంనగర్ జిల్లా ధూళికట్ట, పాషిణాం, కోటిలింగాల, సంగారెడ్డి దగ్గర మరో బౌద్ధక్షేత్రం కన్పించాయి. నేలకొండపల్లిలో బుద్ధుడి విగ్రహాలు చెక్కే శిల్పకల వంటిది వుండేదని ఊహిస్తున్నారు -

కృష్ణానదికి దక్షిణాపథాన నాగార్జునకొండ, మంచికల్లు, గోలి, గ్రందిసిరి, అమరావతి, రెంటాల, భట్టిప్రోలు, చందవరం, దూపాదు, చినగంజాం, పెదగంజాం.

ప్రకాశం జిల్లా కనుపర్తి, ఉప్పుగుండూరు, రామతీర్థం, చిత్తురుజిల్లా నందలూరు లలో కూడా స్థూపాల ఆనవాళ్ళు కన్పించాయి. చందవరంలో కూడా ఒక బౌద్ధ స్థూపం వున్నట్లు తెలుస్తోంది. హ్యూన్‌త్సాంగ్ ఛు-ళి-య రాజ్యం (చోళరాజ్యం)లో తాను చూసినట్లు రాసుకున్న బౌద్ధస్తూపం ఈ చందవరమేనని పరిశోధకులంటారు.

ఇవికాక బెజవాడలాంటి ఒకనాటి బౌద్ధక్షేత్రాలు, స్తూపాలు లేని ఊళ్ళు చాలా వున్నాయి. చేజర్ల కపోతేశ్వర ఆలయం ఒకనాటి బౌద్ధారామం కావచ్చునే అభిప్రాయం కూడా వుంది. ఇలాంటివి లెక్కతీసినప్పుడు వేలసంఖ్యలో బౌద్ధక్షేత్రాలు కన్పిస్తాయి. అందుకని, బౌద్ధ స్తూపాలు కన్పించిన స్థానాలను మాత్రమే ఇక్కడ ఉటంకించడం జరిగింది.

## బౌద్ధ విజ్ఞాన కేంద్రం నాగార్జున కొండ



గుంటూరు జిల్లా పల్నాడులో నాగార్జునకొండ ఒకప్పుడు బౌద్ధ విజ్ఞాన కేంద్రంగా విలసిల్లింది. నాగార్జునసాగర్ నిర్మాణంలో నీటి మట్టం ఎత్తు పెంచవలసివచ్చినప్పుడు ఈ కొండ మొత్తం నీటిలో మునిగిపోయింది. 1954-60 మధ్య కాలంలో నాగార్జునకొండ మునిగిపో బోతోందని తెలిసి పురావస్తుశాఖ వారు చాలా మేరకు కొండను గాలించారు. ఆ గాలింపులో వారికి ఆదిమమానవుడి నివాసాల తాలూకు ఆధారాలు కూడా దొరికాయి.

స్తూపాలు, చైత్యాలు, ఆరామాలు, బ్రాహ్మీ లిపిలో రాసిన శాసనాలు, శిల్పాలు ఎన్నో దొరికాయి. ఖల్వంలో సగం నూరుతూ వున్న ఒక ఔషధం కూడా దొరికిందిట !

ఇక్ష్వాకుల కాలం నాటి రాజభవనాలు, కోటలు కూడా కన్పిస్తాయి. ఇదే కొండమీద బ్రాహ్మణులు, బౌద్ధులు ఇద్దరికీ సమానమైన ఆదరణని ఇక్ష్వాకులు కల్పించారు.

అయితే పాలనాపరమైన పారిభాషిక పదాలన్నీ సంస్కృతంలోనే ఎక్కువగా వుండడంతో ప్రాకృతం నిరాదరణకు గురి అయ్యింది. దాని కారణంగా బౌద్ధం కూడా ఒక అడుగు వెనకే వుండాల్సి వచ్చింది.

మాధ్యమిక బౌద్ధవాదాన్ని ప్రతిపాదించిన ఆచార్య నాగార్జునుడి కారణంగా ఇక్ష్వాకుల కాలంలోనూ, వారి ముందు శాతవాహనుల కాలంలోనూ బౌద్ధం శక్తిమంతంగా నిలదొక్కుకో గలిగింది.

ఆచార్య నాగార్జునుడి వంటి మహోన్నతుడు నివసించిన కారణంగా, పరస్పర విరుద్ధమైన బౌద్ధవాదులు ఇక్కడ కలిసి నివసించారని అంటారు. ఎవరి విహారాలు, ఎవరి స్తూపాలు వారివిగా వుండేవి.

థేరవాదులు బౌద్ధ ధర్మాల్ని మాత్రమే ఆరాధిస్తారు కాబట్టి, వారి స్తూపాలలో ఎక్కడా బుద్ధుని విగ్రహాలు కన్పించవు. పూర్వ శైలికులు, అపర శైలికుల విహారాలు కూడా వున్నాయి. ఆ విహారాల ఎదురుగా వారు ఆరాధించుకునే చైత్యాలున్నాయి. ఒకటి స్తూప చైత్యం. మరొకటి బుద్ధ చైత్యం. స్తూపచైత్యులు స్తూపాన్ని ఆరాధిస్తే బుద్ధ చైత్యులు చైత్యరూపంలోని బుద్ధుని ఆరాధిస్తారు. కొన్ని విహారాలలో స్నానవాటికలు, నీటిపారుదల సౌకర్యాలున్నాయి. ఒక "విగత జ్వరాలయం" (రోగాల్ని పోగొట్టే కేంద్రం - ఆసుపత్రి) కూడా వున్నదంటారు. సింహళీయులకోసం ఒక విహారం ప్రత్యేకంగా వుంది.

## గుంటుపల్లి



ఏలూరు దగ్గర జీలకర్ర గూడెం, కామవరపుకోటలకు దగ్గరలో గుంటుపల్లి గ్రామం వుంది. ఈ కొండల్లో కన్పించే గుహలు మౌర్యుల కాలం నాటివి కావచ్చని పరిశోధకులంటారు. ముందుగా కన్పించే గుహలు దాటి ఎగువకు వెడితే ఇటుకలతో కట్టిన స్తూప నిర్మాణం కూడా కన్పిస్తుంది. ఒక స్తంభం పైన చెక్కిన అక్షరాలలో, మహామేఘవాహనుడు అనే కళింగాధిపతి పేరు కన్పిస్తుంది. ఇవి జైన తీర్థంకరులకు సంబంధించిన నిర్మాణాలు కావచ్చనీ, శాతవాహనులు, ఇక్ష్వాకుల కాలంలో బౌద్ధస్తూపాలను కూడా ఇక్కడే నిర్మించి వుంటారనీ ప్రముఖ పరిశోధకులు కార్తికేయశర్మ గారు సమన్వయ పరుస్తూ రాశారు.

క్రీ.శ. 10 - 11 శతాబ్దాలలో గుంటుపల్లి బౌద్ధ గుహలనుంచి బౌద్ధపరమైన కార్య క్రమాలను నిర్వహిస్తూనే వున్నట్లు ఇక్కడ దొరికిన ఆధారాలు చెప్తున్నాయి.

## శాలిహుండం



శ్రీకాకుళం జిల్లాలో శ్రీకాకుళానికి 25 కి.మీ. దూరంలో శాలిహుండం గ్రామం వుంది. వంశధారానది ఒడ్డున "మహాజగ పర్వతం" మీద బౌద్ధ ఆరామం శిధిలాలు కన్పిస్తాయి. ఇక్కడ ఒక స్తూపం, కొన్ని విహారాలు, శిల్పాలు,

బంగారు నాణాలు, ఇంకా అనేకం త్రవ్వకాలలో దొరికాయి. తాంత్రిక మహాయాన బౌద్ధం నాటి విశేషాలెన్నో ఇక్కడ కన్పించాయి. మరీచి, తార, మంజుశ్రీలు బౌద్ధ తాంత్రిక దేవతలు. వీరి విగ్రహాలు అమరావతిలోనూ, ఇక్కడ కూడా దొరికాయి.



విశాఖపట్నం వద్ద శంకరం బౌద్ధస్తూప అవశేషాలు

## బొజ్జనకొండ - లింగాల కొండ

అనకాపల్లి దగ్గర బొజ్జనకొండ, లింగాలకొండ అనే రెండు కొండలమీద బౌద్ధ స్తూపం, అనేక విహారాలు బయటపడ్డాయి. శారదానది ఒకప్పుడు ఈ కొండని ఆనుకొని ప్రవహించేదట! క్రీ.పూ. 2వ శతాబ్ది నాటి బౌద్ధక్షేత్రం ఇది కావచ్చునీ, క్రీస్తుశకం 3 నుంచి 9 వరకూ ఇక్కడ నుంచి బౌద్ధ ధర్మాలు బాగా వ్యాప్తి చెంది వుంటాయని పరిశోధకు లంటారు. శైవ మతం దాడివలన బౌద్ధులకొండ లింగాలకొండగా మారిపోయి వుండొచ్చు. ఏక రాతి స్తంభాలు శివలింగాలుగా మారివుండవచ్చని కార్తికేయ శర్మగారు రాశారు.

## అమరావతి బౌద్ధ స్తూపం ఊహాచిత్రం



1. ధనకటకం ఒకప్పుడు మహానగరం. వర్తకవాణిజ్య కేంద్రం. అనేక బౌద్ధ స్తూపాలు, విహారాలు వుండేవి. ఈ అనేక విహారాలలో మిగిలివున్న ఒకే ఒక కట్టడం ఈనాటి అమరావతిలో పురాతత్త్వ వస్తు ప్రదర్శనశాల పక్కన వున్న మహాస్తూపం..... అంటారు పరిశోధకులు.
2. మౌర్యుల కాలంలో కొంత, శాతవాహనుల కాలంలో కొంత, ఇక్ష్వాకుల కాలంలో మరికొంత ఈ స్తూప నిర్మాణం జరిగి వుంటుంది. చివరగా 8 - 10 శతాబ్దాల

కాలంలో వజ్రయాన తాంత్రిక బౌద్ధ కాలంలో స్తూపం పై పొరల్లో కొంత మరమ్మత్తుల వంటివి జరిగివుంటాయి. తాంత్రిక బౌద్ధుల శిల్పాలుకూడా చోటుచేసుకొని వుండొచ్చు.

3. ఈ శిల్పాలలో బుద్ధుని జీవిత విశేషాలు, జాతక కథలు, ఆయన బోధనా విశేషాలు మాత్రమే కాకుండా, స్థానిక తెలుగు ప్రజలు, వారి రూపలావణ్యాలు, వారి వస్త్రధారణ, ఆభరణాలు కూడా చూడవచ్చు.

4. ఉల్లిపాయ ఆకారంలో కన్పించే స్తూప గర్భాన్ని (drum) చైనా భాషలో "డాగోబా" అంటారు. క్రింది భాగంలో 35 మీటర్ల వ్యాసం, పై భాగంలో 27 మీటర్ల వ్యాసం వుండి వుంటుంది. మొత్తం స్తూపం 42 మీటర్లు వుంటుందని అంచనా! రెండు ప్రదక్షిణ పథాలు (టెర్రేస్)లు వున్నాయి. మూడున్నర మీటర్ల వెడల్పున మనుషులు స్తూపంచుట్టూ ప్రదక్షిణం చేయడానికి వీలుగా వుండివుంటాయి.

5. స్తూపానికి చుట్టూ నాలుగడుగుల ఎత్తున కళలూరే ప్రాకారాలు (రెయిలింగ్) నిర్మించారు. ఈ ప్రాకారాల్ని ఆచార్య నాగార్జునుడు ఇక్ష్వాకుల సాయంతో నిర్మించాడని భావిస్తారు.

6. ఈ స్తూపాన్ని బౌద్ధపరమైన కార్యక్రమాలు, ఉత్సవాలు జరిగేప్పుడు దీపావళి ప్రమిదలతో అలకంరించేవారు. కాబట్టి దీన్ని "దీపాలదిన్నె" అని పిలిచివుంటారని ఒక అభిప్రాయం వుంది. ఇక్కడకు వచ్చి దీపం వెలిగించడం ఒక ఆచారంగా వుండవచ్చు కూడా!

7. స్తూపం శిల్పాలలో ధర్మచక్రాలు, నాగదేవతలు, నాగకన్యలు, యక్ష కన్యలు ఎక్కువగా కనిపిస్తారు. వాటి అంతరార్థాన్ని ఊహించుకోవలసిందే! పండితుల మధ్య ఏకాభిప్రాయం లేదు.

## అమరావతిలో జైనం





అమరేశ్వరాలయంలో క్రీస్తుశకం 1182 నాటి కోటకేత రాజు అనే జైనుడికి సంబంధించిన ఒక శాసనం వుందనీ, గోర్డాన్ మెకెంజీ కృష్ణా డిస్ట్రిక్ట్ మేన్యువల్ రాశాడు. ఈ మేన్యువల్ రచనా కాలం 1883. ఇప్పుడు మనం అక్కడకు వెళ్ళి చూస్తే ఇవేమీ కన్పించవు. వాటి గురించి వివరించి చెప్పగలవారు కూడా కన్పించరు. అమరావతికి 3 - 4 మైళ్ళ దూరంలో వున్న వడ్డమాను తొలినాటి జైన క్షేత్రాల్లో ఒకటిగా పండితులు గుర్తించారు.

క్రీ.శ. 13వ శతాబ్దిలో కాకతీయ ప్రతాపరుద్రుడు యువరాజుగా వున్న కాలంలో, ధరణికోటలో కొంతకాలంపాటు వున్నాడు. ఆ సందర్భాలలో కాశీలో క్షామ పరిస్థిలు ఏర్పడ్డ కారణంగా ఆరువేల మంది బ్రాహ్మణులు కృష్ణని దాటి ధరణికోట చేరి ప్రతాప రుద్రుణ్ణి ఆశ్రయించారట. అప్పటికి జైనుల ప్రాబల్యం ఇంకా అక్కడ వుంది. పాల్కురికి సోమనాథుడు ప్రతాపరుద్రుణ్ణి శైవుడిగా మార్చాడని చెప్తారు. కాశీనుంచి వచ్చిన ఈ శైవ బ్రాహ్మణులకీ, జైనులకీ మధ్య పోటీని పెట్టి, ప్రతాపరుద్రుడు ఎవరి గొప్పతనం ఎంతో పరీక్షించదలిచాడనీ, కాశీ పండితులు మోసపూరితంగా గెలిచి, జైనుల గ్రంథాల్ని తగులబెట్టారనీ, అంతా తెలిసినా ప్రతాపరుద్రుడు మౌనంగా చూస్తూ వూరుకొన్నాడనీ - కథ - గుంటూరు కైఫీయత్తులో వుంది. అప్పుడే జైనుల్ని నూనె గానుగలోకి తోసి ఆడించి చంపారనే భయంకరమైన సంఘటన జరిగినట్లు ఈ కైఫీయత్తు చెప్తోంది.

కాకతీయుల తర్వాత రెడ్డిరాజులు మొదటగా అమరావతిలోని అమరేశ్వరాల యాన్ని పునర్నిర్మించారు. 1361లో అనవేమారెడ్డి వేయించిన శాసనం, 1115లో కృష్ణదేవరాయలు ఈ దేవాలయంలో చేసిన తులాపురుషదానం చరిత్రకు దొరికే ఆధారాలు.

## సిద్ధ నాగార్జునుడి చరిత్ర



నాగార్జునుడనే పేరుతో ప్రసిద్ధులైన వ్యక్తులు బౌద్ధమతంలో చాలా మంది ఉన్నారు. కృష్ణాతీరంలో నాగార్జునకొండగా వాసికెక్కిన శ్రీపర్వతం మీద స్వర్ణ సిద్ధి పొంది, రసాయన శాస్త్రజ్ఞుడుగా, గొప్ప ఆయు ర్వేద వైద్యుడిగా, హీనయాన బౌద్ధ మత ప్రవ ర్తకుడిగా అనేక సంవత్సరాలు జీవించిన రసనాగా ర్జునుడు బౌద్ధంలోకి వచ్చిన కథ సరదాగా ఉంటుంది -

అప్పటికే కొన్ని మంత్రవిద్యలు నాగార్జునుడికి తెలుసు! క్షుద్ర విద్యలు నేర్చినవారికి నీతి నియమా లుండవు కదా. ఇద్దరు స్నేహితుల్ని వెంటబెట్టుకుని, మాయారూపంలో రాజాంతఃపురంలో దూరి, అర్థ రాత్రిపూట అక్కడి స్త్రీలతో గడపటం ఈ స్నేహితులకో నిత్యకృత్యంగా మారింది.

ఎల్లకాలం ఇది సాగలేదు. రాజుగారి నిఘాలో అతని ఇద్దరు స్నేహితులూ దొరికి పోయారు. వారిని ఉరితీశారు. నాగార్జునుడు తన ప్రాణం దక్కితే బౌద్ధ భిక్షువు నౌతానని ఒట్టు పెట్టుకున్నాడు. బౌద్ధంలోకి ఆయన "మహాయానం" అలా జరిగిందంటారు. భోగి కానివాడు యోగికాలేడని నాగార్జునుడు కూడా నిరూపించాడు!

కృష్ణాతీరానికి ప్రపంచఖ్యాతిని తెచ్చిన మహనీయుడు ఆచార్య సిద్ధనాగార్జునుడు. క్రీ.శ. 1వ శతాబ్ది నుంచి 3వ శతాబ్దిలోపు, దీర్ఘకాలం ఆయన జీవించివున్నాడు. ఖచ్చితమైన తేదీలు నిర్ణయించగలగడం బహుశా కష్ట సాధ్యం కావచ్చు. ఆచార్య నాగార్జునుడు, రససిద్ధి పొందిన తాంత్రిక నాగార్జునుడు వేర్వేరు వ్యక్తులు కావచ్చనే ఎక్కువ మంది చరిత్రకారుల అభిప్రాయం.

నాగార్జునుడి శిష్యుల్లో "వ్యాడి" లేక "వ్యాలి" అనే రసాయన శాస్త్రవేత్త ముఖ్యుడు. సిద్ధ నాగార్జునుడి రససిద్ధి కథ ఈ వ్యాలితోనే ప్రారంభం అవుతుంది!

వ్యాలి పశ్చిమ భారతదేశంలో రససిద్ధికోసం ప్రయత్నాలుచేసి భంగపడ్డ రసాయశాస్త్రవేత్త. బంగారం తయారు చేయడంకోసం పాదరసం, గంధకాలతో ప్రయోగాలు చేసే రసాయన శాస్త్రవేత్తల్ని ఆల్కెమిస్టులంటారు. వ్యాలి అలాంటి శాస్త్రవేత్త.

తనకు ఎంతకీ రససిద్ధి కలగకపోవడంతో తాను బంగారం తయారుచేయడంలో విఫలం కావడాన్ని తట్టుకోలేక, నిరాశగా తన దగ్గరున్న పాదరస సిద్ధులకు సంబంధించిన గ్రంథాన్ని కట్టగట్టి గంగానదిలోకి విసిరేసి బౌద్ధ భిక్షువుగా మారి ఎటో వెళ్ళిపోయాడు ఈ "వ్యాలి".

తర్వాత చాలా కాలానికి ఒడివిచ అనే ప్రాంతంలో గంగానదిలో స్నానం చేస్తుంటే అదే పుస్తకం ఏమాత్రం చెడకుండా నదిలో కొట్టుకొస్తూ ఆయనకు దొరికిందట.

బహుశా తనకు రససిద్ధియోగం ప్రాప్తించడం వల్లనే ఈ పుస్తకం మళ్ళీ తనకు దొరికిందని, అదొక సంకేతంగా భావించి వ్యాలి ఆ పుస్తకాన్ని పుచ్చుకొని ఇంటికిచేరి మళ్ళీ రసప్రయోగాలు ప్రారంభించాడు.

ఒకరోజు ఆయన ప్రయోగం విజయవంతం అయి, రసం కుడివైపుకు కదిలిందట! మంచినాదం పుట్టింది. పూలజల్లులు కురిసాయి. చూసేవారికి ఈ వింతేమిటో తెలియలేదు. ఆతర్వాత మరో ఆరు నెలలు తపోదీక్షతో అదే ప్రయోగాలు కొనసాగించగా వ్యాలికి స్వర్ణ యోగం సిద్ధించింది. ఇదీ వ్యాలి కథ!

ఈ కథ ఎక్కడోవున్న ఆచార్య నాగార్జునిడికి తెల్సింది. నాగార్జునుడికి ఆకాశ మార్గంలో ప్రయాణించే విద్య తెలుసు. అందుకు సహకరించే రెండు ఆకులు (పాదరక్షలు) ఆయన దగ్గర వున్నాయి. ఒకదాన్ని దాచి, రెండోదాని సాయంతో వ్యాలిని చేరి తనకు స్వర్ణ సిద్ధి యోగం నేర్పమని అడిగాడట!

"మీరు ఆ ఆకాశ గమన విద్యని నాకివ్వండి..... స్వర్ణ విద్యని మీకు ఇస్తాను....." అన్నాడట వ్యాలి. ఆ విధంగా ఆచార్య నాగార్జునుడికి గురువుగా స్వర్ణ విద్యని ఉపదేశించి,

ఆయన శిష్యుడిగా చరగమనాది విద్యలు అనేకం ఆయననుంచి పొందాడు. అలా ఆ ఇద్దరూ ఒకరికొకరు గురుశిష్యులు.

నిజానికి, సిద్ధ నాగార్జునుడు రససిద్ధి పొందగోరింది బంగారం తయారుచేయడానికి మాత్రమే కాదు. ఆనాటి బౌద్ధులకు బౌద్ధమత ప్రచారానికి వేగంగా పనిచేసే ఆయుర్వేద ఔషధాలు కూడా కావాలి. ఆరోగ్యం పేరుతో ప్రజల్ని ఆకర్షించి వాళ్ళని బౌద్ధులుగా మార్చడం వారి పరమావధి ! క్రైస్తవ మిషనరీలు చేసే పనినే ఒకప్పుడు బౌద్ధులు చేశారు. దేశదేశాలలో బౌద్ధమతాన్ని విస్తరించగలిగారు. అందుకు వారికి సహకరించింది ఆయుర్వేదంవంటి శాస్త్రాలు!

ఆ విధంగా సిద్ధనాగార్జునుడు ఆయుర్వేద శాస్త్రాభివృద్ధికీ ఆయుర్వేదంలో రసశాస్త్రాభివృద్ధికీ ఎంతగానో తోడ్పడ్డాడు.

ఆయుర్వేద రస ఔషధాల పరిశోధనకోసమే రససిద్ధి కోసం నాగార్జునుడు ప్రయత్నించాడనేది వాస్తవం.

## స్తూపాన్ని తవ్వించిన వెంకటాద్రినాయుడు

ఆ తర్వాత మరో రెండు వందల ఎనభై ఏళ్ళ స్తబ్ధత..... 1797లో చింతపల్లి జమిందారు రాజావెంకటాద్రినాయుడు ప్రాభవం వెలిగిపోతున్న కాలంలో ఒకరోజు, బ్రిటిష్ వాళ్ళు చింతపల్లి కోటని ముట్టడించి అతని జమిందారీని ఆక్రమించారు. అదృష్టవశాత్తూ ఆ సమయానికి వెంకటాద్రినాయుడు కోటలో లేడు. దాడి విషయం తెల్సుకుని, ఆయన చింతపల్లి వెళ్ళకుండా నేరుగా ధరణికోటవచ్చి, అమరేశ్వరుణ్ణి దర్శించుకొని, అక్కడ ఓ పెద్ద నగరాన్ని కట్టేందుకు సంకల్పించుకున్నాడు. ఆ కొత్త నగరానికి అమరేశ్వరుడి పేరున “అమరావతి” అని పేరు పెట్టాడు. దానినే ఇక తన రాజధాని నగరంగా ప్రకటించాడు. “సురపురం” అనే విఖ్యాతి దీనికి ఉండటంతో ‘అమరావతి’ పేరు తర్వాతి కాలంలో వచ్చింది ప్రజల్లో.

రాజధానిని పట్టుకుంటే రాజ్యాన్ని జయించినట్టేననుకున్న బ్రిటిష్ వారిని ఇలా రాజావెంకటాద్రినాయుడు యుక్తిగా దెబ్బతీశాడు. అమరావతి నగరానికి విశాలమైన వీధులతో ఒక ప్లానును తయారుచేయించాడు. వివిధ వ్యాపారుల్ని ఆహ్వానించి అక్కడ దుకాణాలు తెరిపించాడు. తన జమీందారీలోని ప్రముఖుల్ని పిలిపించి వారికి అక్కడ స్థావరాలు కల్పించుకునే అవకాశం ఇచ్చాడు. సుందరమైన నగరంగా దాన్ని రూపొందించాలనుకొన్నాడు. ఉద్యానవనాలు కూడా ఏర్పాటు చేశాడు. రాగిరేకు తాపడం చేసిన అందమైన కోటని నిర్మించాడు.

అప్పట్లో అమరావతిలోని ప్రాచీన బౌద్ధ స్తూపాలన్నీ దీపాలదిన్నె అని పిలిచే ఎత్తయిన మట్టి దిబ్బలో పూడుకుపోయి వున్నాయి. ఈ కోటని నిర్మించేప్పుడు ఆ మట్టిదిబ్బని తవ్వి మట్టిని వాడుకోవాలనుకొన్నాడు వెంకటాద్రినాయుడు.

జనంలో ప్రచారంగావున్న కథ ఏమిటంటే, ఈ దీపాలదిన్నె అనే మట్టిదిబ్బ అడుగున లంకెల బిందెలున్నాయని, పూర్వపురాజులు దాచిన నిధి నిక్షేపాలు చాలా దొరుకుతాయనీను ! కానీ, ఇన్నాళ్ళూ ఈ మట్టిదిబ్బని తవ్వేసాహసం ఎవరూ చేయలేదు. రక్తం కక్కుకు చచ్చిపోతారని భయం వుండేది.

1797లో వెంకటాద్రినాయుడు, తన మనుషుల్ని పెట్టి దీపాలదిన్నెని తవ్వించడం మొదలు పెట్టాడు. కుప్పకూలిపోయిన ప్రాచీన నిర్మాణం తాలూకు పెద్దపెద్ద పాలరాతి పలకలు (Marble Slabs), శిలాశాసనాలు, విగ్రహాలు, విరిగిపోయిన శిల్పాలూ ఏవేవో దొరకడం మొదలుపెట్టాయి, కొన్ని కోటగోడల్లోకి పోయాయి, కొన్నింటిని దేవాలయానికి మెట్లుగా వాడేశారు. అవన్నీ ఒకనాటి బౌద్ధ స్తూపం అవశేషాలన్న సంగతి ఎవరికీ తెలియదు ఆనాడు ! బౌద్ధం మీద ద్వేషంతో వెంకటాద్రినాయుడే స్తూపాన్ని ధ్వంసం చేయించాడనేది అపవాదు మాత్రమే ! వెంకటాద్రి నాయుడి కాలంలో అమరావతి ప్రాచీన బౌద్ధక్షేత్రం అనే పరిజ్ఞానం ఉండి ఉండకపోవచ్చు.

## శిల్పాల దొంగలు బ్రిటీషర్లే !

అప్పట్లో కోలిన్ మెకెంజీ కైఫీయత్తులు తయారుచేయించే కార్యక్రమంలో సర్వేయర్ జనరల్‌గా వున్నాడు. 1797లో ఈయన ఈ వార్త తెలుసుకొని హుటాహుటిన అమరావతి చేరుకున్నాడు. దొరికిన ఫలకాల్ని పరిశీలించి ఇది బౌద్ధ శిల్పకళా సంపద అనీ, ఇక్కడ బహుశా బౌద్ధ స్తూపం వంటిది ఏదైనా వుండివుంటుందనీ ఊహించాడు. ప్రభుత్వానికి దీనిగురించి ఒక రిపోర్ట్ పంపాడు కూడా. కానీ, పాలరాతి ఫలకాల్ని ఎత్తుకు పోవడం అనేది ఆగలేదు. ధననిక్షేపాలు వుండే వుంటాయన్న ఆశ చావకపోవడాన తవ్వకాలూ ఆగలేదు.

1816లొ కోలిన్ మెకంజీ రెండోసారి అమరావతి వచ్చాడు. వస్తూ కొందరు సహాయకుల్ని వెంటతెచ్చుకున్నాడు. శాస్త్రబద్ధంగా తవ్వకాలు కొనసాగించారు. అనేక ఫలకాలు బైటకొచ్చాయి. ఎనిమిది ఫలకాల్ని బందరుకి, ఏడింటిని కలకత్తాకి, నాల్గింటిని లండన్‌కి తరలించారు. ఆ తర్వాత కోలీన్ మెకంజీ మరణించాడు.

1830లో రాబర్ట్సన్ మచిలీపట్నం కలెక్టర్‌గా వచ్చి మరో ముప్పయిమూడు పాలరాతి పలకల్ని అమరావతినుంచి తెప్పించి, బందరు కోనేరు సెంటర్లో అందంగా అలంకరింపచేశాడట!

1835లో ఫ్రెడరిక్ ఆదామ్ మద్రాస్ గవర్నర్, బందరును సందర్శించడానికి వచ్చాడు. కోనేరు సెంటర్లో ఈ రాతిఫలకాల మీద చెక్కిన అందమైన శిల్పాల్ని చూసి ముగ్ధుడై పోయాడట. అయనతో వచ్చిన డాక్టర్ బెంజా అనే సర్జన్, గవర్నర్ చెవిలో నెమ్మదిగా అన్నాడట..... "మన మిత్రుడూ, శిల్పకారుడూ "గాగినో"కి వీటిని అందిస్తే, ఈ శిల్పాలన్నీ తను చెక్కిన శిల్పాలుగా చెప్పుకొంటారు గదా..... ఎవడు చూడొచ్చాడు..... ఇది ఇక్కడిదని!" అని!

వెంటనే గవర్నర్‌గారు కలెక్టర్‌ని పిలిచి, "ఈ శిల్పాలు ఇక్కడుంటే ఎత్తుకు పోతారు. వీటిని భద్రంగా వుండే చోటుకి తరలించండి....." అని ఆదేశించాడు. భద్రంగా వుండే చోటు అంటే, తన దగ్గరికి పంపించమని అర్థం!

కానీ, రాబర్ట్సన్ తర్వాత ఆరుసంవత్సరాల్లో ఎనిమిదిమంది కలెక్టర్లు మారారు. ఎవరూ ఇక్కడి నుంచి ఈ శిలాఫలకాల్ని తరలించాలని ప్రయత్నించలేదు.

1836లో "గోల్డింఘూర్" కలెక్టర్‌గా వచ్చాడు. ఆయన ఈ శిలాఫలకాల్ని భద్రం చేసే నెపంతో, అలెగ్జాండర్ అనే ఆంగ్లేయ అధికారికి వాటిని ధారాదత్తం చేశాడు. ఆయన వీటిని తన తోటలోకి తరలించి అందంగా అలంకరించుకున్నాడు. కొన్నాళ్ళకు వీటి ఆరావచ్చి, అవి ఏమయ్యాయని వెదికితే, ఫలానా వారి తోటలో వున్నాయని తెల్సింది. బ్రిటిష్ ప్రభుత్వం సదరు అలెగ్జాండర్ గారికి ఎదురు డబ్బిచ్చి కొనుగోలు చేసి వాటిని లండన్‌కు తరలించిందట..... గోర్డాన్ మెకంజీయే స్వయంగా రికార్డుచేసిన అమరావతి శిల్పాల కైంకర్యం కథ ఇదీ. 1840లో వాల్టర్ ఎలియట్ అనే అధికారి ఈ దీపాల దిన్నెను పూర్తిగా తవ్వించి, 90 పాలరాతి ఫలకాల ముక్కల్ని మద్రాస్ మ్యూజియంకు, 30 పలకల్ని మచిలీపట్నానికి తరలించాడు. 1855లో "ఎలియట్‌గారి పాలరాతి పలకలు" అనే పేరుతో ఈ 129 పలకల మీద రెవరెండ్ టేలర్ అనే పరిశోధకుడు సమగ్రమైన రిపోర్టు రాశాడట!

ఆ తర్వాత ఇంచుమించుగా ఈ శిల్పకళా సంపదనంతా లండన్‌కు తరలించేశారు. 1867లో ఫెర్గుసన్ - వృక్షాల్నీ సర్పాల్ని పూజించే ఆచారం మీద పుస్తకం రాస్తూ, అమరావతి స్తూపం, అక్కడ దొరికిన పలకలు, వాటిమీద నాగులు గురించి ప్రస్తావించడంతో బైట ప్రపంచానికి అమరావతి బౌద్ధస్తూపం విషయం కొంత తెలిసింది.

## ప్రాతఃస్మరణీయుడు రాబర్ట్ స్యూయల్

1877లో రాబర్ట్ స్యూయల్ అనే మహాపండితుడు, పరిశోధకుడు కృష్ణా తీరానికి వచ్చి పరిశీలించిన తర్వాతే - తెలుగు వారికి బౌద్ధమతంతో గల సంబంధం వివరాలు బైటకు వచ్చాయి. 1880లో బ్రిటిష్ రాజప్రతినిధి అమరావతివచ్చి ఈ ప్రాంతాన్ని సందర్శించి వెళ్ళాడు.

అమరావతిలోని స్థానికులు అనాగరికంగా, మూర్ఖంగా అపురూపమైన శిలా సంప దని ధ్వంసంచేశారని మెకంజీతో సహా చాలా మంది పాశ్చాత్య రచయితలు విమర్శిస్తూ రాశారు. నిజమే! వీళ్ళు అమాయకులే! కానీ, ఈ అమూల్య సంపదని తస్కరించుకుపోయి స్వంత తోటల్లో అలంకరించుకున్న వాళ్ళనీ, తమదేశాలకు తరలించుకుపోయిన వాళ్ళని పల్లెత్తు మాట అనలేదెవరూ.....!

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చాక, మన సాంస్కృతిక వారసత్వ సంపదని బ్రిటిష్ ప్రభుత్వం లండన్ మ్యూజియంలోనో మరెక్కడో ఎందుకు వుంచుకోవాలి ? మా సంపదని మాకివ్వమని మన ప్రభుత్వాలు లండన్‌ను ఎందుకు అడగలేక పోతు న్నాయి.....???

పోగొట్టుకున్న పాలరాతి ఫలకాల్ని మిగిలివున్నంత వరకైనా తెచ్చి బౌద్ధస్తూపాన్ని యథా తథంగా నిలపగలిగితే అమరావతి – ఈజిప్ట్ పిరమిడ్లని మించిన పర్యాటక కేంద్రం అవుతుంది ! అని 1883లోనే గోర్డాన్ మెకంజీ రాశాడు!

అదీ అమరావతి ప్రశస్తి !

## బర్గీస్ 1882 రిపోర్ట్

అమరావతి, జగ్గయ్యపేట స్థూపాల గురించి 1882లో "జాస్స బర్గీస్" అనే అధికారి చారిత్రక దృష్టితో ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వానికి ఇచ్చిన రిపోర్ట్‌లో కొన్ని విశేషాలున్నాయి.

1. మద్రాస్ ప్రభుత్వం ఆదేశానుసారం 1881 డిసెంబర్ నుంచి, 1882 జనవరి వరకూ అమరావతిలో త్రవ్వకాలు జరిగాయి. ఈ త్రవ్వకాలలో 255 ఫలకాలు (slabs) బైటపడ్డాయి. ఇవి అంతకు ఒక ఏడాది క్రితం రాబర్ట్ స్యూయల్ వెలుగులోకి తెచ్చినవే! ఆయన ఏ కారణం చేతనో ఆ ఫలకాల్ని తిరిగి భూమిలో పాతిపెట్టించాడు. వాటిని బైటకు తీసుకురావడం జరిగింది అని పేర్కొన్నాడు.
2. రాబర్ట్ స్యూయల్ ఆ విధంగా తిరిగి భూమిలో పాతిపెట్టగా మిగిలిన వాటిలో 44 ఫలకాల్ని అమరావతిలో ఒక షెడ్డులో పెట్టించాడు. 29 ఫలకాల్ని బెజవాడ లైబ్రరీకి తరలించి అక్కడ భద్రపరిచాడని కూడ పేర్కొన్నాడు.

1880 నాటి సంగతి ఇది. ఆ కాలానికి బెజవాడలో ఒక పెద్ద లైబ్రరీ వుండేదని ఈ రిపోర్ట్ ఆధారంగా మొదటిసారి తెలుస్తోంది. ఆ ఫలకాల సంగతి అలా వుంచితే, ఆ లైబ్రరీ ఏదో, ఎక్కడుండేదో కూడా తెలియదు.

3. లైబ్రరీలోనూ పట్టినన్ని పెట్టించగా, మిగిలిన 255 ఫలకాలు దుర్వినియోగం అవుతా యని భయపడి, భవిష్యత్తులో ఎవరైనా పరిశోధకుడు సద్వినియోగం చేయగలడనే ఆశతో తిరిగి భూమిలోనే పాతిపెట్టించి వుంటాడని మనం వూహించవచ్చు.

ఇవికాక, బర్గీస్ స్వయంగా మరో 90 ఫలకాలను త్రవ్వించి బైటకు తీయించాడు. ఇంకా తవ్వితే, ఇలాంటివి మరెన్నో ఫలకాలు దొరికే అవకాశం వుందని బర్గీస్ తన రిపోర్ట్‌లో పేర్కొన్నాడు.

ఇక్కడో ముఖ్య విషయం చెప్పాలి. అమరావతి, ఘంటశాల, నాగార్జునకొండ వంటి వాణిజ్య కేంద్రాలలో - వివిధ బౌద్ధ వాదాలకు చెందిన భిక్షువులు ఆరామాలు కట్టుకొని జీవించారు. ఎవరి ఆరామాలు వారివి, ఎవరి స్తూపాలు వారివి. అంటే, ఒకే ఊరిలో అనేక స్తూపాలు వుండేవన్నమాట! నాగార్జునకొండలో అలా రకరకాల స్తూపాలు బైట పడ్డాయి. ఘంటశాల నలుదిశలా మూడు లేక నాలుగు స్తూపాలు వుండి వుండవచ్చునని అంటారు.

అమరావతి విషయానికొస్తే, ఇక్కడ ఇలాంటి స్తూపాలెన్ని వున్నాయో లెక్కతేల్చడం కోసం తవ్వడం మొదలు పెట్టాలంటే, ఆ ఊరు ఊరినంతా ఖాళీ చేయించి తవ్వవలసి వుంటుంది. బౌద్ధ శిధిలాలకు దూరంగా అమరావతి నగరాన్ని నిర్మించలేదు. ఆ శిధిలాల మీదే ఈ నగరాన్ని కట్టారు. కాబట్టి, ఖాళీవున్న ప్రాంతంలో తవ్వినంత తవ్వగా దొరికినంత దొరికింది! అక్కడికదే మహాభాగ్యం అయ్యింది!

## బౌద్ధాలయాలు ధ్వంసం చేసిన విష్ణుకుండినులు

క్రీస్తుశకం 420 నుంచి 620 వరకూ కృష్ణా గోదావరి మధ్యప్రదేశాన్ని విష్ణుకుండిన వంశీకులు బెజవాడ రాజధానిగా పాలించారు. బెజవాడ ప్రశస్తికి కారకుడైన మాధవవర్మ ఈ వంశం వాడే! వీళ్ళు వినుకొండ రాజులని, "వినుకొండ" శబ్దమే విష్ణుకుండినగా సంస్కృతీక రించబడిందనీ ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర గ్రంథంలో వుంది. దాదాపు రెండున్నర శతాబ్దాల పాటు బెజవాడ రాజధానిగా పాలించిన ఈ విష్ణుకుండినుల్లో 9 మంది ప్రసిద్ధ రాజులున్నారు. వీరిలో రెండవ మాధవ వర్మ ప్రసిద్ధుడు. ఆయన పరమ శివభక్తుడు. శివుడు కాని దేన్నీ అంగీకరించనంత శివభక్తుడు. బౌద్ధాన్ని శాశ్వతంగా అంతం చేసేవరకూ నిద్రపోనివాడు.

బెజవాడ మొగల్రాజపురం, ఉండవల్లి గుహల్లో బౌద్ధ చిహ్నాల్ని ధ్వంసం చేయించిన "కీర్తి" మూటగట్టుకున్నవాడు. పక్కనే శైవగుహల్ని నిర్మింపచేశాడు. ఈ శైవగుహపైన ఈనాటికీ మహిషాసుర మర్దిని రూపం స్పష్టా స్పష్టంగా రోడ్డుమీదకే కన్పిస్తూ వుంటుంది.

## శైవుల అమరావతి దురాక్రమణ

ఫాహియాన్ నాలుగో శతాబ్దిలో కృష్ణాతీరం సందర్శించినప్పుడు స్వయంగా రికార్డు చేసిన ఇలాంటి కథ ఒకటుంది. అప్పటికే బౌద్ధ మతప్రాబల్యం కృష్ణాతీరంలో కొన ఊపిరితో వుంది. ప్రపంచ ప్రసిద్ధి పొందిన బౌద్ధ పుణ్యక్షేత్రాలు నాగార్జునకొండ (శ్రీపర్వతం), అమరావతిలోని ధాన్యకటకం (ధరణికోట) నామమాత్రావశిష్టంగా మారిపోతున్నాయి. బౌద్ధమతంలో తాంత్రిక విధానాలు చోటు చేసుకొని క్షుద్ర విద్యల వైపు మళ్ళడంతో కృష్ణాతీరంలో ప్రజలు కూడా బౌద్ధాన్ని దూరంగా వుంచడం ప్రారంభం అయ్యింది. ఆ రోజుల్లో ఒక కథ జరిగింది.

బౌద్ధం నిరాదరణకు గురికావడంతోనే, వైదిక సాంప్రదాయ రీతుల్లో శైవమతం (సాత్విక శైవం) జన బాహుళ్యంలోకి చొచ్చుకు రాసాగింది. ఆ పరిస్థితుల్లో అమరావతిలోని బౌద్ధ సంఘారామాన్ని కైవసం చేసుకోవాలని శైవులు విశ్వప్రయత్నం చేయసాగారు. ప్రతిరోజూ ఏదో ఒక వంకతో అక్కడి బౌద్ధులతో ఘర్షణలు జరిగేవి. ఒకసారి ఘర్షణ ముదిరి కొట్లాటదాకా వెళ్ళింది. తక్కువ సంఖ్యలో వున్న బౌద్ధులు భయపడి ఆరామం లోపలికి వెళ్లి తలుపులు బిగించుకున్నారు. శైవులు పలుగులు పుచ్చుకొని బైటనుంచి దాడిచేశారు. ప్రాణభయంతో లోపలదాక్కున్న బౌద్ధులు రాజుగారిని శరణుకోరాలని, తలుపులు తెరిచి బైటకు వచ్చారు. వాళ్ళు అలా రాజుగారి వైపు కదిలారో లేదో, శైవులు ఆ ఆరామాన్ని పూర్తిగా ఆక్రమించేశారు. రాజుగారి తీర్పు సహజంగానే శైవులకు అనుకూలంగా వచ్చింది. బౌద్ధులు నివాసం కోల్పోయి ఊళ్ళు పట్టారు.

## నాగార్జున కొండ బ్రాహ్మణుల ఆక్రమణ



క్రీ.శ. 5వ శతాబ్ది చివరి భాగం -

బుద్ధుని ప్రవచనాలకు సిద్ధాంత పరమైన భాష్యాలు పెచ్చుపెరగడంతో బౌద్ధ సంఘాలలో అభిప్రాయభేదాలు ముదిరి వ్యక్తిగత కక్షలకు దారి తీశాయి. ఒక దశలో చట్టవిరుద్ధమైన అశాంతి ప్రజ్వరిల్లే దాకా వెళ్ళాయి - మిగతా సందర్భాలలో ఎలా వున్న నాగార్జునకొండలో మాత్రం జరిగింది అదే!

కృష్ణానదీ తీరంలోని శ్రీపర్వతం (నాగార్జున కొండ) పేరుగాంచిన బౌద్ధారామం. అప్పట్లో ఈ బౌద్ధ

సంఘారామంలో, కనీసం వెయ్యిమంది భిక్షువులు, అనేకమంది శ్రమణకులు, విద్యార్థులు, ఇతర పరివారం..... ఎందరో నివసిస్తుండేవారు.

వారి మధ్య వాదవివాదాలు పెరిగి, ఒకరి పొడ ఇంకొకరికి గిట్టని పరిస్థితి ఏర్పడింది.

అది పల్లవుల పాలనాకాలం –

వివాదాలేర్పడినప్పుడల్లా తీర్పుకోసం రాజుగారి దగ్గరకు వెళ్ళడం మొదలుపెట్టారు. పల్లవులు పరమత సహనం కలవారే అయినా, మౌలికంగా వైదిక మతస్థులు. బ్రాహ్మణాభిమానులు.

తమలో తాము పరిష్కరించుకోవాల్సిన సైద్ధాంతిక విభేదాల్ని రచ్చకీడ్చడం వలన బౌద్ధులు తమ పతనాన్ని తాము కోరితెచ్చుకున్నట్లయ్యింది. అదను కనిపెట్టారు బ్రాహ్మణులు! వారికక్షల్ని ఎగద్రోసి, క్రమేణా ఆ బౌద్ధ సంఘారామాన్ని పూర్తిగా తమ ఆధీనంలోకి తెచ్చుకోగలిగారు. లోపల నివసించే బౌద్ధులందరినీ వెళ్ళగొట్టి కొండకి రాకపోకలు మూసేసి కట్టడిచేశారు.

బౌద్ధారామాన్ని ఆక్రమించుకొని లోపలే వుండిపోయిన బ్రాహ్మణులకు ఆహారమూ, వైద్యమూ తదితర అవసరాలకోసం కళ్ళకు గంతలు కట్టి మనుషుల్ని లోపలికి తీసుకువెళ్ళి, గంతలు కట్టి బైటకు తెచ్చేవారట.

ఈ వివరాలన్నీ చైనా యాత్రికుల రాతల్ని బట్టి తెలుస్తోంది. బ్రాహ్మణులు కుట్రచేసి నాగార్జునకొండని స్వాధీన పరచుకున్నారని వాళ్ళు రాశారు.

క్రీ.శ. 7వ శతాబ్దిలో హ్యూన్‌త్సాంగ్ నాగార్జున కొండని దర్శించాడు. అప్పటికి వంద ఏళ్ల నుంచీ ఆ కొండ నిర్మానుష్యంగా ఉందని అతనికి తెలిపారట! హ్యూన్‌త్సాంగ్ జీవిత చరిత్ర రాసిన త్స్యాంగ్-హు-లీ ఈ వివరాలు రాశాడు. ఆ తర్వాత కొన్ని శతాబ్దాలకు శంకరాచార్య ఈ కొండని సందర్శించాడని, అప్పటి నుండి పుష్పగిరి పీఠాధిపతుల ఆధీనంలో వుండేదనీ అంటారు. క్రీ.శ. నాల్గవ శతాబ్దిలో ఫాహియాన్ నాగార్జునకొండను సందర్శించే నాటికి ఇక్ష్వాకులు కృష్ణాతీరాన్ని పాలిస్తున్నారు. అప్పటికి నాగార్జునకొండ వైభవోపేతమైన బౌద్ధకేంద్రంగా రాజిల్లుతోంది. ఇక్ష్వాకుల తర్వాతే పల్లవులు ఆంధ్రదేశంలో అధికారంలోకి వచ్చారు. బౌద్ధం తెలుగునాట అంతరించి పోవడం అనేది, నాగార్జున కొండని బౌద్ధులు కోల్పోవడంతోనే ప్రారంభం అయిందని చెప్పవచ్చు. ఎందుకంటే, బ్రాహ్మణిజం అనే ఆలోచనా విధానానికి పల్లవులు తిరుగులేని రీతిలో కట్టుబడి వున్నారు కాబట్టి !

## ! బౌద్ధుల తలకు వెల !

క్రీస్తు పూర్వం 185 - 73 కాలంలో శుంగ రాజవంశీకులు మౌర్యుల పాలనని అంతంచేసి పాటలీపుత్రం (పాట్నా) రాజధానిగా పాలించారు. మౌర్య బృహద్రతుణ్ణి హత్య చేసి, పుష్యమిత్ర శుంగుడు అనే మౌర్య సేనాని రాజ్యాన్ని ఆక్రమించాడు.

ఈ "శుంగరాజు" కరడుగట్టిన బ్రాహ్మణ వాది! బుద్ధిజం అంటే తీవ్రమైన ద్వేషం. మౌర్యుల సేనానిగా వున్నంతకాలం ఈ ద్వేషం కడుపులో రగులుతూనే వుండి వుంటుంది. రాజ్యాధికారం చేతికి రాగానే మగధలోనే బౌద్ధాన్ని భూస్థాపితం చెయ్యాలని ప్రయత్నించాడు. బౌద్ధ ఆరామాల్ని స్తూపాల్ని ధ్వంసం చేయించాడు. అశోకుడు బౌద్ధంకోసం చేసిందంతా చెరిపేయాలని చూశాడు. ఒక బౌద్ధ భిక్షువుని చంపి తలను తెచ్చి చూపిస్తే 100 బంగారు నాణాలు ఇస్తానని ప్రకటించాడు. నలంద, బుద్ధ గయ, సారనాథ్, మథురలలో బౌద్ధా రామాలన్నింటినీ వైదిక దేవతల దేవాలయాలుగా మార్చివేశాడని చరిత్రకారులు అంటారు.

## ! బౌద్ధయుగంలో తెలుగువారి చదువులు !

మహావిద్యాసంస్థలు బౌద్ధంతోనే ప్రారంభమయ్యాయని చరిత్రకారుల నమ్మకం. మహావిద్యాలయం అంటే, ఈనాటి మన విశ్వవిద్యాలయాలతో సమానమైన స్థాయి కలిగివుండేది!

అంతకు పూర్వం వానప్రస్థాశ్రమ ధర్మాలు, గురుకులాల వ్యవస్థని కాదని వ్యవస్థీకృత విద్య (Institutionalised Education) ని ప్రవేశపెట్టింది బౌద్ధులే. ఈ విషయంలో బుద్ధుడు ప్రపంచానికి ఆదర్శం కావచ్చు కూడా!

బ్రాహ్మణులకూ, ఇతర ఉన్నత వర్గాలకూ మాత్రమే అందుబాటులో వున్న వ్యవస్థలోంచి అందరికీ విద్య అనే మార్గంలోకి పరిణమించడానికి ఈ విశ్వవిద్యాలయ విధానం తోడ్పడింది!



సారనాథ్ విశ్వవిద్యాలయం



నలంద విశ్వవిద్యాలయం



సాంచి విశ్వవిద్యాలయం

## తెలుగు విశ్వవిద్యాలయాలు

నలంద, సాంచి, తక్షశిల తర్వాత అమరావతి పెద్ద విశ్వవిద్యాలయంగా వుండేదని అంటారు. అమరావతి తర్వాత అంతటి బౌద్ధ విద్యాలయం "వేంగి"లో నడిచింది. ఏలూరుకు దగ్గర పెదవేగి అనే కుగ్రామంలో ఇప్పటికీ ఈ వేంగి విశ్వవిద్యాలయం ఆనవాళ్లు కన్పిస్తున్నాయి.

క్రీస్తుశకం మొదటి శతాబ్దాలనాటి ఈ వేంగి విద్యాపీఠం అనేక అంతస్థుల హర్మ్యం అనీ, అద్భుతమైన శిల్పాలతో, స్తంభాలతో అలంకరించబడి కళలూరేలా వుండేదనీ, దీనికి ఎదురుగా నూరు అడుగుల ఎత్తున ఒక బౌద్ధ స్తూపం కూడా వుండేదని బౌద్ధ గ్రంథాల ఆధారంగా తెలుస్తోంది. చైనా యాత్రీకుడు హ్యూన్‌త్సాంగ్ "పింగ్-చి" పేరుతో వర్ణించిన మహావిద్యాలయం ఈ "వేంగి" విద్యాలయమేనని పరిశోధకులంటారు.

బౌద్ధ విద్యలు, సాధారణ విద్యలతోపాటు, వైద్య విద్యనీ, రసాయనశాస్త్రాన్నీ ప్రత్యేకంగా నేర్పించే గొప్ప విద్యాలయం నాగార్జునకొండ మీద ఒకప్పుడు గొప్ప వెలుగు వెలిగింది. ఇక్కడ పెద్ద లేబరేటరీ, లైబ్రరీలు కూడా వుండేవని పరిశోధకులంటారు.

ఆచార్య నాగార్జునుడు ప్రసిద్ధ భిక్షువుల్ని ఆహ్వానించి, వారిని ఆచార్యులుగా నియమించాడనీ, అనేక అపురూప వైద్య శాస్త్ర గ్రంథాల్ని, బౌద్ధ గ్రంథాల్ని సేకరించి, వాటికి అట్ట కథలు (వ్యాఖ్యానాలు) రాయించాడనీ ప్రతీతి. శాతవాహనులు, ఇక్ష్వాకులు ఈ శ్రీపర్వత విశ్వవిద్యా లయాన్ని బాగా పోషించారు.

## ఘటికా స్థానాలు

బౌద్ధయుగంలోనూ ఆ తర్వాత కూడా ఘటికా స్థానాలు నిర్వహించబడ్డాయి. రాజుగారి అనుమతితో అధికారికంగా నడిచే విద్యాపీఠాన్ని ఘటికా స్థానం అని నిర్వచించవచ్చు. తొలి శతాబ్దాలలో వీటి వైభవం బాగా నడిచింది.

విద్యాకేంద్రం అనేది మామూలు స్కూల్ వంటిదైతే, ఘటికా స్థానం యూనివర్శిటీ వంటిది. పరీక్షలు నిర్వహించి, ఉత్తీర్ణతని ప్రకటించేవారు. యోగ్యతా పత్రాలు ఇచ్చేవారు. ప్రతిభను గుర్తించేవారు.

పరీక్షల నిర్వహణ చాలా కఠినతరంగా వుండేదట. ఇతర పరీక్షా విధానాలతోపాటు శల్య (శలాక) పరీక్ష కూడా చేసేవారట! ఒక గ్రంథంలోకి మేకుని గుచ్చి, ఏ పేజీ దాకా దిగిందో ఆ పేజీలోని విషయాన్ని అడిగేవారట! ఇదొక రకం శల్య పరీక్ష.

చీటీలమీద వివిధ ప్రశ్నలు రాసి, ఒక కుండలో వేసి, విద్యార్థిని ఒక చీటీ తియ్యమనేవారు. ఆ చీటీలో ఏ ప్రశ్న రాసివుంటే దానికి జవాబు చెప్పాలి. ఇలాంటి పరీక్షా విధానంలో పేపర్లు లీక్ కావడం, ఆశ్రిత పక్షపాతం వంటి లోపాలు జరిగే అవకాశం తక్కువగా వుండేది.

కృష్ణాజిల్లా ఘంటశాల ఇలాంటి ఘటికా స్థానాలలో ఒకటి. ఇక్కడ పెద్ద ఘంట ఉండేదనీ, గంట అవ్వగానే ఘంట మోగించే విధానాన్ని అవలంభించేవారని ఒకవాదన వుంది. పీరియడ్ అవగానే బెల్ కొట్టే పద్ధతిని పాటించేవారట!

క్రీ.శ. 633 నాటి చాళుక్యరాజు జయసింహ వల్లభుడు నిడమఱ్రు గ్రామాన్ని కాటిశర్మకు ఘటికాశ్రమ నిర్వహణకోసం దానం ఇచ్చినట్లుంది. కాటిశర్మ తండ్రి మండశర్మ ఈ ఘటికాశ్రమంలో ఆచార్యుడిగా వుండేవాడట!

ఘటికా స్థానంలో ఉత్తీర్ణుడు అయినవాణ్ణి "ఘటికుడు" అనేవారు, సర్వ ప్రజ్ఞా పారంగతుడనే అర్థంలో!

## తెలుగు బౌద్ధుల ఆచారాలు

తెలుగువారి స్వంత ఆచారాలుగా కన్పించే ఎన్నో విషయాలు బౌద్ధ ఆంధ్రుల వలన ఏర్పడినవే కావచ్చు.

కాలచక్ర తంత్రం విధివిధానాలు ఇప్పటికీ హిందువులు ఆచరించే క్రతువులకు దగ్గరగా వుంటాయి.

క్రతువును ప్రారంభించేప్పుడు మండలం ముగ్గు వేయడం దగ్గర్నుంచి, ముగ్గులోకి దేవతల్ని ఆహ్వానించడం వరకూ అవే విధానాల్ని హిందువులూ పాటిస్తున్నారు.

"ముగ్గులోకి దించడం" అనే తెలుగునానుడి ఈ తాంత్రిక విధానాల్లోంచే వచ్చిందని అంటారు. దక్షిణ భారతదేశంలోని ప్రతి ఇల్లాలూ ఇంటి ముందు ఉదయమూ, సాయంత్రమూ సందె ముగ్గులు వేసుకొంటుంది. ఇంత బలంగా నాటుకుపోయిన ఈ ముంగిట ముగ్గులు తాంత్రిక పరమైన అలవాటేనంటే ఆశ్చర్యంగా వుంటుంది.

అయితే ఇవన్నీ బ్రాహ్మణ వాదులనుంచి బౌద్ధులకు సంక్రమించి వుంటాయని అనడానికి ఆధారాలు చాలవు. బౌద్ధాన్ని అభిమానించిన తెలుగు ప్రజలు బౌద్ధం తర్వాత శైవాన్ని, వైష్ణవాన్ని అనుసరించినా, బౌద్ధుల కాలం నాటి అలవాట్లను వదులుకోలేక పోయి వుండవచ్చు. ఇవి తెలుగు బౌద్ధుల వలన కలిగిన అలవాట్లే అయి వుంటాయి. అందుకే తాంత్రిక బౌద్ధాన్ని అనుసరించే విదేశీ బౌద్ధులు ఎవరికీ ఈ అలవాట్లు లేవు.

ఇంకో విషయం కూడావుంది. తాంత్రిక బౌద్ధ దేవతలకూ, తాంత్రిక శైవ దేవతలకూ మౌలికమైన తేడాలు పెద్దగా లేక పోవడం కూడా ఒక విశేషం. కె. గోపాలకృష్ణ మూర్తిగారు అమరావతిలో దొరికిన తాంత్రిక బౌద్ధవిగ్రహాల గురించి చక్కని విశ్లేషణ చేశారు. బెజవాడ కనకదుర్గని, కలకత్తాకాళిని, లలితని పోలిన ఎన్నో బౌద్ధ విగ్రహాలు ఇక్కడ దొరికాయి. త్రినేత్రులైన బౌద్ధ దేవతలు ఉన్నారు. హాలాహల లోకనాథుడు అనే బౌద్ధదేవుడు శైవంలో కన్పిస్తాడు. హేరుకుడనే బౌద్ధ తాంత్రిక దేవుడు కాపాలికుల మాదిరి శ్మశాన బూడిదని పులుముకుని తిరుగుతాడు. కపాలాలు దండలుగా ధరించే తారాదేవి విగ్రహాలు నేపాల్, టిబెట్‌లలో కూడా ఈనాటికీ ఆరాధనీయాలే! 21 మంది తారలున్నారట. ఉగ్రతార కలకత్తా కాళికలాగా వుంటుంది.

బెజవాడ కనకదుర్గ కూడా తారాదేవి విగ్రహమేనని, ఆదిశంకరులు శ్రీచక్రాన్ని ప్రతిష్ఠించి శక్తి ఆరాధనాకేంద్రం చేశాడని ఒక ఐతిహ్యం వుంది. "తారా అక్షోభ్య సంవాదం" అనే వజ్రయాన తంత్రానికి "శివ శక్తి సంగమతంత్రం" అనే మరో పేరుకూడా వున్నట్లు హనుమంతరావుగారు రాశారు. "దక్షిణామూర్తి"గా వున్న శివుడి విగ్రహం, ధ్యాన బుద్ధ విగ్రహం ఒకే నమూనాలో వుండడం ఈ విధమైన పరిణామాలలో ఒక భాగమే కావచ్చునంటారు హనుమంతరావుగారు.

"వజ్రయానం"గా బౌద్ధం మారిన తర్వాత బుద్ధుడు "యోగి"గా మారాడు. శివుడు కూడా మహాయోగి గానే చెప్పబడ్డాడు. పురాణాలు నారాయణుని మహాయోగి అన్నాయి. శ్రీకృష్ణుని పరమగురువు, పరమ యోగి అని వైష్ణవ మతం చెప్పుకొంది. చివరకు దేవతలంతా కలిసి పోయారు. ఈ దేవతల సమ్మేళనానికి గుప్త రాజులు కారణమై వుంటారని హనుమంతరావుగారు పేర్కొన్నారు.

మూల బౌద్ధం మాత్రం దేశం విడిచి వెళ్ళిపోయింది. తాంత్రిక బౌద్ధం శైవంలో కలగలిసి పోయి వుండవచ్చు. బుద్ధుడు మాత్రం విష్ణువు అవతారం అనిపించుకొన్నాడు గాని, హిందువులు ఎక్కడా గుడికట్టి కొలవని శుద్ధ బుద్ధావతారంగా వుండిపోయాడు.

## తెలుగు నేల మీద తాంత్రిక బౌద్ధం

తెలుగు నేలమీద బౌద్ధం అంతరించిన కాలంలో తెలుగు సామాజిక వ్యవస్థలో చాలా మార్పులు చోటుచేసుకున్నాయి.

1. తెలుగునాట గ్రామీణ వ్యవస్థ బలంగా వ్రేళ్ళూనుకొంది.
2. శాశ్వత పని విభజన, పారిశ్రామిక కుటుంబాలు, కొత్త కులాలు ఏర్పడ్డాయి. ఫలానా వృత్తిచేసే వారిది ఫలానా కులం అనే పద్ధతి వచ్చింది. తెలుగునాట "పంచాననం వారు" – కమ్మరి, వడ్రంగి, కుమ్మరి, స్వర్ణకారులు, శిల్పకారులు కలిసి ఒక కులంగా ఏర్పడ్డారు.



3. చాతుర్వర్ణ వ్యవస్థని ప్రశ్నించి, దాన్ని రూపు మాప గలిగే జాతీయోద్యమం లాంటిది ఏదీ లేకుండా పోయింది. బౌద్ధం కూడా ఈ వ్యవస్థలో భాగంగా తన మనుగడని కాపాడు కోవడంలో పడిపోయింది.
4. అశోకుడి కారణంగా, బౌద్ధమతం చిన్నచిన్న రాజ్యాల్ని మౌర్యచక్రవర్తుల ఆధీనంలో వుంచడానికి ప్రయత్నించడం వలన ప్రాంతీయ శక్తులు తమ ఎదుగుదలకు ఈ బౌద్ధం అవరోధంగా వుందని భావించారు. దాన్ని వెళ్ళగొట్టడమే ధ్యేయంగా పెట్టుకున్నారు.
5. బౌద్ధంలో "శూన్యవాదం" ప్రవేశించింది. వజ్రయానం పేరుతో దయ్యాలు, భూతాలు చేతబడులువంటి తాంత్రిక విద్యలవైపు శ్రద్ధ మళ్ళడం మొదలుపెట్టింది.

   బంగారం తయారుచేసే విద్యను తాంత్రికంగా మలుచుకొని కాపాలికులు, బౌద్ధులు పోటీపడి ఈ తాంత్రిక విద్యల్ని పెంచిపోషించడం మొదలు పెట్టారు.
6. గుప్తులు, వాకాటకులు..... ఇంకా చాలా మంది నిరంకుశ రాచరిక వ్యవస్థని తీసుకు రావడంతో కొత్త సామాజిక వ్యవస్థ అంకురించింది.
7. ప్రాకృతం, పాళీ భాషలు అంతరించిపోయి, సంస్కృతం రాజభాషగా దేశం అంతా వ్యాప్తిలోకి వచ్చింది. ఈ భాషలోని బౌద్ధ గ్రంథాల్ని సంస్కృతంలోకి సమర్థవంతంగా అనువదించగలిగే వ్యక్తులు లభించకపోవడం వలన ఆయా గ్రంథాలు నిరుపయోగం అయి నశించిపోయాయి.
8. రాజుల రాజ్యవిస్తరణ కాంక్షవలన వ్యవసాయం, పరిశ్రమలు రెండూ దెబ్బతిన్నాయి. ఈ పరిస్థితుల్లో బుద్ధుడి గురించి, జ్ఞానం గురించి ఆలోచించే తీరిక లేకపోవడంతో తాంత్రిక బౌద్ధమే చివరికి మిగిలింది.
9. క్రీ.శ. 250 నుండి 650 వరకూ కృష్ణకు దక్షిణానవున్న గుంటూరు - నెల్లూరు ప్రాంతాన్ని పల్లవులు, కృష్ణా గోదావరి నదుల మధ్య వున్న కృష్ణా-పశ్చిమ గోదావరి జిల్లాల ప్రాంతాన్ని సాలంకాయనులు, బృహత్పలాయనులు, ఆనంద విష్ణుకుండిన రాజులు, గోదావరికి ఉత్తరాన కళింగ దేశాన్ని మాఠర, గంగా వంశీయులు పాలించారు. తెలంగాణా వాకాటకుల ఆధీనంలో వుండిపోయింది. వీళ్ళెవరూ బౌద్ధాన్ని ఆదరించకపోగా తలా ఒక దెబ్బవేయడం కూడా జరిగిందనే చెప్పవచ్చు.

10. క్రీ.శ. 342 - 343 సంవత్సరంలో మగధను పాలించిన గుప్తరాజు సముద్రగుప్తుడు పైన పేర్కొన్న తెలుగు రాజులందరినీ మూకుమ్మడిగా ఓడించి, ఎవరి రాజ్యాన్ని వారికి ఇచ్చేసి సామంతుల్ని చేసుకొని వెళ్ళినట్లు అలహాబాదు శాసనం చెప్తోంది.
11. త్రిలోచన పల్లవుడు, కరికాళ చోళుడు మొదలైనవారు బౌద్ధంపట్ల పరమ కర్కశంగా వ్యవహరించారు.
12. క్రీ.శ. 420-620 మధ్య తెలుగు నేలను ఏలిన విష్ణుకుండినులు వినుకొండ ప్రభువులు. వీరు బెజవాడను రాజధానిగా చేసికొని పాలించారు. వీళ్ళు బౌద్ధాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేశారు.

## తాంత్రిక బౌద్ధం ఆశించిన ప్రయోజనం

బౌద్ధం - తాంత్రిక విధానాల్లోకి మారినా, కర్మకాండలు యజ్ఞయాగాది క్రతువులు నిష్ఫలాలని, వాటివలన ఎలాంటి ప్రయోజనమూ లేదనే విషయంలో దాని నమ్మకాలేమీ సడల లేదు. సాధకుడికి కొన్ని అతీంద్రియ శక్తులు సాధించుకోవడం వలన అంతకన్నా ఎక్కువ ప్రయోజనం వుంటుందనేది తాంత్రిక బౌద్ధం ఆశించిన ప్రయోజనం.

వజ్రయాన తాంత్రిక బౌద్ధ దేవతల గురించి వివరించే బౌద్ధ భిక్షువుల్ని ధారణీయు లనేవారు. సృష్టి రహస్యాన్ని ఛేదించడానికి దుఃఖకారణాల్ని అన్వేషించడానికి, సాంఘిక సమానత్వాన్ని పెంపొందించడానికి ఉద్దేశించవలసిన మేధాసంపత్తిని తాంత్రిక శక్తుల్ని వశంచేసుకోవడానికి, అతీంద్రియ శక్తుల్ని సంపాదించుకోవడానికి వినియోగించ వలసి రావడం బౌద్ధం పతనానికి ముఖ్యకారణం. ఎదుటివాడు తవ్విన గోతిని పూడ్చడం కోసం తానో పెద్ద గొయ్యిని తవ్వుకుంది ఈ విధంగా బౌద్ధం. చివరికి గోతులు తవ్వినవారి మధ్య తేడాలేకుండా పోయింది. తాంత్రిజం (శైవిజం), విష్ణుయిజం, బుద్ధిజం కలగలిసి పోయాయి.

## విగ్రహారాధన - తీర్థయాత్రలు బౌద్ధులవే !



యల్.యమ్. జోషీ అనే పరిశోధకుడు వేదాలు వ్యతిరేకించిన విగ్రహారాధనని బౌద్ధ, జైన ధర్మాలు ప్రోత్సహించి వ్యాప్తిలోనికి తెచ్చాయని, ఆర్యేతరులలో ఈ అలవాటు సింధు నగరాలనాటి ప్రజలనుంచి సంక్రమించి వుంటుందనీ, ముఖ్యంగా బౌద్ధులు ఈ ఆచారానికి ప్రాణ ప్రతిష్ట చేశారనీ రాశారు. ఇది ఎంత ప్రచారం పొందిదంటే, పురాణాలు కూడా వైదిక దేవతల విగ్రహాలను ఆరాధించడం, గుడులు కట్టి అర్చనలుచేసే సాంప్రదాయాల్ని అంగీకరించి అనుసరించడం ప్రారంభించాయి అంటారాయన.

అలాగే తీర్థయాత్రలు చేసే విధానాన్ని కూడా బౌద్ధులే ప్రారంభించారని జోషీ అభిప్రాయపడ్డారు. "తీర్థం" అంటే పవిత్ర స్థలం. మహాపరినిబ్బ సుత్త (మహాపరినిర్వాణ సూత్రం) గ్రంథంలో బుద్ధుడు పవిత్ర స్థలాలుగా గుర్తించిన వాటిని సందర్శించడాన్ని ప్రస్తావించారు.

వేదకాలంలో నరబలులు, జంతుబలులు ఇచ్చేకేంద్రాలుగా ఈ తీర్థాలుండేవి. ఇతిహాసాలు పురాణాలకాలంలో తీర్థ స్థలాలలో బలులిచ్చే అలవాటు నిషేధించబడింది. "లంకావతార సుత్తా" బౌద్ధ గ్రంథం తీర్థాలు కేవలం శాకాహారాలకు పరిమితమైన కేంద్రాలుగా వుండాలని, మాంసాహార నిషేధాన్ని కూడా ప్రకటించింది.

"కోవెల", "గుడి" అని తెలుగులోనూ, కోయల్ అని తమిళంలోనూ, "ప్రాసాదం" అని సంస్కృతంలోనూ కన్పించే దేవాలయ సంస్కృతి వేదకాలంలో కన్పించదు.

విగ్రహారాధన కోసం మొట్టమొదటగా తయారుచేసింది బుద్ధుని విగ్రహాన్ని మాత్రమే! అది మధురలో జరిగిందని కొందరు, గాంధారం (ఆఫ్ఘనిస్థాన్)లో జరిగిందని కొందరు అంటారు. జైన విగ్రహాలు గాని, విష్ణువు విగ్రహాలు గానీ ఆ తర్వాతవేనని చరిత్రకారుల అభిప్రాయం. అయితే, ఈ చరిత్రకారులు "శివలింగార్చనని విగ్రహారాధనగా భావిస్తారో లేదో తెలియదు. లింగార్చన బుద్ధిజానికన్నా తర్వాతదేనని నిరూపించే ఆధారాలు లేవు. అయితే, సింధు నాగరికతకు చెందిన నగరాలలో ఊర్ధ్వలింగార్చనకు సంబంధించిన విగ్రహాలు దొరకడం గమనార్హం.

మహాయాన బౌద్ధమే చైత్యారాధననీ, బుద్ధ విగ్రహారాధననీ ప్రవేశపెట్టింది. మూల బౌద్ధానికి, బుద్ధునికి ఈ విగ్రహారాధనతో ఎలాంటి సంబంధమూ వుండి వుండకపోవచ్చు.

వైదిక దేవతలకు యజ్ఞయాగాది క్రతువులు తగ్గిపోయి, ఇంటింటా పూజా మందిరాలు, దేవతా విగ్రహాలు, విగ్రహారాధనలు ప్రబలడానికి బౌద్ధంలో విగ్రహారాధన పెచ్చుపెరగడమే ముఖ్యకారణం అనేది వాస్తవం.

## వాసుదేవ కృష్ణుడు - భగవద్గీత

బౌద్ధం ఒక మతమే అనుకునేట్లయితే, భక్తి, దేముడు లేనిదే మతం ఎలా అవుతుందీ – అనేది మౌలికమైన ప్రశ్న! యజ్ఞయాగాలు కర్మకాండలు జ్ఞాన సముపార్జనకు హేతువులు కావనే సిద్ధాంతం మీదే బౌద్ధం ఏర్పడింది.

బుద్ధుడి తర్వాత – మధురానగరం కేంద్రంగా వాసుదేవమతం "భక్తి" ప్రధానంగా ఏర్పడింది. ఛాందగ్యోపనిషత్తు ప్రకారం ఘోర అంగిరసుని శిష్యుడైన వాసుదేవ కృష్ణుడు

కూడా యజ్ఞయాగాది క్రతువుల్ని నిరసించాడు. బలులిచ్చే ఆచారాన్ని ఖండించాడు. సత్యవాక్పాలనని ప్రబోధించాడు. కానీ, భక్తి ప్రధానంగా ఈ మతం నడిచింది.

ఈ కొత్తమతం ద్వారా కృష్ణుడు దేముడిగా వ్యాప్తిలోకి వచ్చాడు. కొన్ని ప్రాంతాల్లో వాసుదేవ కృష్ణుడి ధర్మాలు, గౌతమ బుద్ధుని ధర్మాలు సమాంతరంగా నడిచాయి.

తొలి శాతవాహనులు ఈ వాసుదేవ కృష్ణుని అనుయాయులని కార్తికేయ శర్మ తదితరులు పేర్కొన్నారు.

బౌద్ధ ధర్మాలు మేధావుల్ని అలరిస్తున్న కాలంలో వాసుదేవ ధర్మాలు భగవద్గీతని వెలయించాయి. దాంతో బ్రాహ్మణ వాదులు కళ్ళు తెరుచుకున్నారు. బౌద్ధం జాతీయ స్థాయినుంచి అంతర్జాతీయ స్థాయికి చేరుకొంటున్నదశలో బ్రాహ్మణులు వాసుదేవ కృష్ణుని దైవంగా అంగీకరించి విష్ణువుతో సమన్వయం చేశారు. ఆ విధంగా కృష్ణుడు విష్ణువు అవతారంగా వ్యాప్తిలోకి వచ్చాడు. ఏ యజ్ఞ యాగాలకు వ్యతిరేకంగా వాసుదేవమతం ఏర్పడిందో, ఆ యజ్ఞ యాగాల్ని కోరుకునే వారు భక్తులుగా చేరడంతో తిరిగి వర్ణ వ్యవ స్థకు, కులవ్యవస్థకు మంచి ఊపు లభించినట్లయ్యింది. "చాతుర్వర్ణం మయా సృష్టం" ఈ కుల వ్యవస్థని నేనే సృష్టించానని కృష్ణుడి చేతే చెప్పించగలిగారు. "గుణకర్మ విభాజకః' గుణకర్మల ప్రకారం వర్ణవ్యవస్థ అన్నారు గాని, ఆచరణలో జన్మతః వర్ణ వ్యవస్థనే కొనసాగించారు.

ఈ సంలీనం వలన శివుడు, విష్ణువు వైదిక దేవతల్లో రెండు ప్రధాన శాఖలైనారు. బౌద్ధం అంతర్జాతీయ దృష్టితో ముందుకు దూసుకుపోసాగింది.

ఇవన్నీ శాతవాహనుల కారణంగా గానీ, ఇతరుల ద్వారా గానీ తెలుగు నేలమీద ఖచ్చితమైన ప్రభావాన్ని కనబరిచాయి.

"భక్తి"లేని మతం కన్నా భక్తి కలిగిన మతం వైపు ప్రజలు మొగ్గు చూపుతున్నప్పుడు తెలుగు నేల మీద బౌద్ధులు కూడా తమ బౌద్ధ ధర్మాలలో "భక్తి"ని ప్రవేశపెట్టవలసిన అవసరం ఏర్పడి వుంటుందని ఒక అభిప్రాయం చరిత్రకారుల్లో వుంది. బి.యస్.యల్. యన్. హనుమంతరావుగారు ఈ విషయంమీద సహేతుకమైన చర్చచేశారు.

వాసుదేవ కృష్ణుని ఏ విధంగా విష్ణువు అవతారంగా చేశారో బుద్ధునీ, ఆయన భవిష్యత్ కల్కి అవతారాన్ని కూడా అదే విధంగా విష్ణువు అవతారాలుగా చేశారు. కల్కిని కూడా కలపడం వలన విష్ణువు అవతారాలు పదికి పరిమితం అయ్యాయి. కల్కిని కలపక పోతే బుద్ధుడు విష్ణువు అవతారం అనడం హాస్యాస్పదం అవుతుంది. 10వ శతాబ్దపు వైష్ణ వాలయాలలోను బుద్ధ నారాయణు కన్పిస్తాడు. కాకతీయ రుద్రదేవుడి మంత్రి గంగాధరుడు క్రీ.శ 1170లో విష్ణువే బుద్ధుడి అవతారం ఎత్తినట్లు ఒక శాసనంలో పేర్కొన్నాడు.

మొత్తం మీద, బ్రాహ్మణ వాదులు తమ అస్థిత్వాన్ని నిలుపుకోవడం కోసం - తమకు వ్యతిరేకంగా ఎదుగుతున్న ఇతర మతాల్ని తమతో కలుపుకోవడంలో వేద్యం ప్రదర్శించారనేది స్పష్టం. అందుకే, అవైదికమైనవీ, హేతువాద దృష్టి కల్గినవీ ఎన్నో దర్శనాలు మతాలు ప్రజల్ని జాగరూకుల్ని చేస్తున్నా, భారతదేశంలోంచి కులవ్యవస్థని, కర్మసిద్ధాంతాన్ని అంతం చేయలేక పోతున్నారని అనుకోవడంలో తప్పులేదేమో!!!

## విష్ణుమూర్తి బుద్ధుడి అవతారం ఎందుకెత్తాడు ?

విష్ణుపురాణాన్ని క్రీస్తుశకం 7వ శతాబ్దిలో రూపొందించి ఉంటారని చరిత్రకారుల భావన. ఆ తర్వాత పురాణాలలో విష్ణువు అవతారాల కథలు ఇందులోనివే తిరిగి చెప్పడం జరిగింది.

నిజానికి బుద్ధుణ్ణి విష్ణువు అవతారంగా భక్తి భావంతో చెప్పినట్లుగా కన్పించదు.

విష్ణువు అనేక ఉన్నత లక్షణాలతో కొన్ని అవతారాలెత్తి ఉన్నత కార్యక్రమాలు నిర్వహించాడు. కానీ - అజ్ఞానం, కపటం అనే రెండు లక్షణాలు ఇంకా మిగిలిపోయాయి. వీటిని కూడా ప్రధానమైనవిగా వుండే ఇంకొక అవతారం ఎత్తాలని విష్ణువు సంకల్పించాడు. ఈ సంకల్పానికి ఒక కారణం వుంది. వేదశాస్త్రాధ్యయనంలో పునీతులై స్వర్గంలో వైదిక ఋషులు పోటెత్తుతుంటే ఇంద్రుడు తట్టుకోలేక విష్ణువుని ఆశ్రయించాడట. తనను మించిన పుణ్యాత్ములు స్వర్గానికి వస్తుంటే, తనపదవికి ముప్పురాగలదని భయపడ్డాడట. ఇంద్రుని పదవిని రక్షించడం కోసం మహావైదికుల్ని భ్రష్టుపట్టించే అవతారం ఎత్తాలని సంకల్పించాడట విష్ణువు.

వేదాలను అనుసరించే వారిని తన ప్రబోధాలతో వేద వ్యతిరేకులుగా తయారు చేయడం కోసం విష్ణువు బుద్ధుడిగా అవతారం ఎత్తాడట! ఇది గడుసైన కథ. తన వ్యతిరేకిని కూడా తన అవతారమేననడం కన్నా గడుసుదనం ఇంకొకటి వుండదు కదా!

## శివపురాణం ప్రకారం మరో కథ

త్రిపురాలలోని శివ భక్తుల చేతుల్లో చావుదెబ్బలు తిని, అర్ధచంద్ర ప్రయోగాలు కూడా చవిచూసి, అక్కడ నిలువలేక మానససరోవరం దగ్గరకు పారిపోయి సమావేశం అయ్యారు దేవతలు.

త్రిపురాసురుడు, అతని అనుచరులైన దానవ శివభక్తులు ఇంత శక్తిమంతులు కావడానికి ముఖ్యకారణం వాళ్ళ భార్యలు మహాపతివ్రతలు కావడమేననీ, వాళ్ళు

పతివ్రతలుగా వున్నంత కాలం త్రిపురాసురగణాన్ని ఏమీ చెయ్యలేమనీ, ..... "ముకుందా! ఉపాయం ఆలోచించి, ఆ దానవపురంలో రాక్షసుల్ని మాయామోహితుల్ని చేసి, వాళ్ళు విభూతినీ, రుద్రాక్షల్నీ, లింగార్చననీ వదిలేట్లు, వాళ్ల భార్యలు పాతివ్రత్య విహీనులు అయ్యేట్లు చెయ్యి! వాళ్ళు శివవ్యరేకులుగా మారితే, కోపించి, శివుడే వాళ్ళని వధిస్తాడు. ఇంతకు మించి మరో ఉపాయం లేదు –" అని విష్ణుమూర్తిని దేవతలంతా వేడుకున్నారట!

ఇదీ దేవతలు పన్నిన మాయోపాయం. విష్ణువు దీనికి ఆమోదించాడు. నారదుణ్ణి వెంటపెట్టుకుని బుద్ధాచార్యుడి రూపంలో త్రిపురాలకు వెళ్ళాడట.

విష్ణుమాయని నమ్మి దానవ స్త్రీలు బుద్ధిహీనులై ప్రవర్తించడం మొదలుపెట్టారు. ఇది మొదటి విజయం. మంత్రతంత్ర విద్యలు ఉపయోగించి దానవవీరుల్ని కూడా ఆకర్షించాడట. దానవులంతా బుద్ధాచార్యులకు సాగిలబడి మొక్కారు. "నేను బుద్ధరూపమైన పరబ్రహ్మాన్ని ! సకల అభీష్టాలూ నావలన నెరవేరతాయి." అని వాళ్లని నమ్మించాడు విష్ణువు. దానవులు రుద్రాక్షల్ని తుంచిపారేసి, విభూతి తుడిచేసుకొని శివపూజలు మానేసి బుద్ధాచార్యుని దీక్షలు తీసుకున్నారు.

"ఇంకా ఎవరైనా మిగిలారా.... అందరూ పూర్తిగా మనమాయలో పడ్డారా.....?" అనడిగాడట చివరికి నారదుణ్ణి బుద్ధాచార్యుని అవతారం ఎత్తిన విష్ణువు.

"పరమయోగి, స్వైరుడు, విరక్తుడు ఈ ముగ్గురూ మహాపాంశుపతులు. వీళ్ళు తప్ప అందరూ బౌద్ధులయ్యారు" అని వివరించాడు నారదుడు. ఆ ముగ్గురినీ దైత్య కులంలోంచి వెలివేయించాడు బుద్ధాచార్యుడు.

త్రిపురాసుర సంహారం తర్వాత ఈ సంగతి తెలిసి, శివుడు విష్ణువు మీద కోపగించు కొంటే, దేవతల్ని రక్షించడం కోసమే ఇలా చేయవలసివచ్చిందని విష్ణువు శివుణ్ణి సమాధాన పరిచాడు. మాయోపాయమే అయినా శివనింద చేసినందుకు మానససరోవరం దగ్గర కొంత కాలం ఉపవాసం చేసి ఆ పాపాన్ని పోగొట్టుకోవలసిందిగా శివుడు విష్ణువుకూ, తదితర దేవతలకూ చెప్పాడట. త్రిపురాసుర సంహారం కోసం ఈ విధంగా బుద్ధుడి అవతారాన్ని విష్ణువు ఎత్తవలసివచ్చిందని శివపురాణం కథ చెప్తోంది.

"అంగనలను సిగ్గడలించగ అంగజసమరూపమున రంగుగ పురకాంతల వ్రతముల భంగపరచు బుద్ధావతారా....." అని దశావతారాల తరంగంలో కూచిపూడి నాట్యకారులు చెప్పే బుద్ధావతారం కథ ఇదే!!

# అమరావతి శివాలయం బౌద్ధారామం కాదు

ప్రాచీన శైవాలయాలన్నీ బౌద్ధారామాలేనననే ఒక అభిప్రాయాన్ని చరిత్రకారులు కొంతమేర మనలో కల్గించారు. పంచారామాలకు వెళ్లినప్పుడు ముఖ్యంగా శివలింగాన్ని ఈ దృష్టి కోణంలోంచే చూస్తే ఇది శివలింగం కాదు, బుద్ధుడి గొడుగు కర్రేననే భావన కలుగుతూంటుంది కూడా.....

ఈ అభిప్రాయంలో సాధ్యాసాధ్యాల్ని మనం కొంత విశ్లేషణ చేసిచూద్దాం -

తూర్పుగోదావరి జిల్లాలో ద్రాక్షారామం, తూర్పుగోదావరి చాళుక్య భీమవరం, పాలకొల్లు, గుంటూరు జిల్లా అమరావతి, పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం – ఈ ఐదు ఊళ్ళలోనూ వున్న ప్రాచీన శివాలయాల్ని "పంచారామాలు" అనిపిలుస్తారు.

ఈ ఐదూ కృష్ణా గోదావరి పరీవాహక ప్రాంతాల్లోనే వుండటం ఒక విశేషం.

శివ పురాణంలో కన్పించే అనేక విశేషాలు మన తెలుగునేల మీదే జరిగినట్లు ఎన్నో కథలు కన్పిస్తాయి. మనం చారిత్రక దృష్టితో వాటిని పరిశీలించడానికి ఇష్టపడడం లేదు. పైగా పురాణాలన్నీ ఉత్తర భారతదేశంలోనే జరిగాయని, అక్కణ్ణించి భాషలు, దేవుళ్ళు, సంస్కృతులు ఇక్కడ వ్యాపించాయనీ పాశ్చాత్యులు రాసిన పుస్తకాల ప్రభావంలోనే వుండిపోవడాన, తెలుగు ప్రాంతాలతో శివుడికీ బుద్ధుడికీ వున్న సంబంధాల గురించి పెద్దగా ఆలోచించడం లేదు.

మనకున్న స్వల్ప పరిధిలో మరీ ఎక్కువ లోతుల్లోకి వెళ్ళకుండా కొన్ని విషయాల్ని పరిశీలిద్దాం. ఇదికేవలం పరిశీలనే – నిజానిజాలు తేల్చవలసింది పరిశోధకులు కదా!

1. "ఆరామం"అనేది బౌద్ధులకు సంబంధించిన పదం. దీన్ని శైవక్షేత్రానికి, ఎందుకు ఉపయోగించవలసి వచ్చిందనడానికి సంతృప్తి కరమైన సమాధానం లేదు. బౌద్ధ మతం ఇంచుమించుగా అంతరించిపోయిన తర్వాత వెంటనే తలెత్తింది శైవమే! క్రీస్తుశకం 6–7 శతాబ్దాల నాటికే శైవం విస్తృతంగా వ్యాపించింది. శైవయుగంలో కూడా "ఆరామ" పదాన్ని మతపరమైన సంస్థలనే అర్థంలో కొనసాగించి వుండవచ్చు. బౌద్ధారామాలు నడిచిన పద్ధతిలోనే, శైవమార్గంలో శైవారామాలుకూడా నిర్వహించ బడి వుండవచ్చు. బౌద్ధ భిక్షువుల మాదిరే, శైవ జంగములు సంచరించి ఉండవచ్చు. అందువలన శైవారామాలు బౌద్ధారామాలే ననడం పూర్తి వాస్తవం కాదు.
2. అమరారామం, కొమరారామం, భీమారామం, క్షీరారామం లాగానే, ద్రాక్షారామం కూడా వుండేది. దక్షుడు శివపురాణంలో శివుడి పూర్వపు భక్తుడు. ఆయన శివుడిపట్ల

తన విధేయతని మార్చుకున్నాడు. ఆ కారణంగా శివుడు అతన్ని భస్మీపటలం చేశాడు. ఆ తర్వాత అతని దక్షారామం అంటే దక్షుడి తోటలో శైవారాధన ప్రారంభం అయ్యిందనీ స్థల పురాణం. దక్షుడు బౌద్ధుడిగానో, వైష్ణవుడిగానో మారివుంటాడని ఈ కథని బట్టి అర్థం అవుతోంది. శైవులకూ, వైష్ణవులకూ, బౌద్ధులకూ మధ్య క్రీస్తుశకం తొలి శతాబ్దాల కాలంలో నిరంతరంగా జరిగిన మతపరమైన యుద్ధాలకు ఈ కథ అద్దం పడ్తుంది. దాక్షారామమే ద్రాక్షారామంగా పిలువబడ్తోందనేది స్పష్టమే!

3. దక్షుడి శివవ్యతిరేకతని ఆయన కుమార్తె దాక్షాయణి అవమానంగా భావించి అగ్నిప్రవేశం చేయడం, "సతి"గా మారడం, శివుడికి ఈ సంగతి తెలిసి అయన ఉద్రేకంతో ఊగి పోవడం, ఆయన శరీరంలో చెమట నుంచి వీరభద్రుడు పుట్టడం, వీరభద్రుడు దక్షుణ్ణి అంతంచేయడం..... ఈ కథ మనకు తెలిసిందే!

శివుడి భక్తులు ఒక్కొక్కరూ వీరభద్రులై శివుడిపట్ల అవిధేయత ప్రకటించిన దక్షుడిని, అతని నగరాల్ని, అతని సైన్యాన్ని సంహరించారని ఈ కథలో సారాంశం. వీరభద్రుడనే శివభక్తుడి నాయకత్వంలో శైవులు విజృంభించి వుంటారని కూడా అర్థం చేసుకోవచ్చు.

మొత్తంమీద దక్షుడికి సంబంధించిన ఈ శివపురాణ గాథ గోదావరి ఒడ్డున తెలుగునేలమీదే జరిగింది అనేది స్పష్టం.

4. శ్రీనాథుడు భీమేశ్వర పురాణంలో పంచారామాలు ఏర్పడటం గురించి కొన్ని విశేషాలు పేర్కొన్నాడు. పాలసముద్ర మధనం, మోహినీ అవతారం తర్వాత అసురులు తమ పగతీర్చుకోవడం కోసం త్రిపురాసురుడి నాయకత్వంలో మళ్ళీ శివుణ్ణి ఉద్దేశించి తపస్సుచేసి వరాలు పొంది దేవతల్ని హింసించటం ప్రారంభించారు. దేవతలు కూడా శివుణ్ణి ప్రార్థించి, తమగోడు చెప్పుకున్నారు. అప్పుడు శివుడు తన వరాల్ని అసురులు దుర్వినియోగం చేస్తున్నారని ఆగ్రహించి, వారిమీద పాశుపతాన్ని ప్రయోగించాడు. త్రిపురాసురుడి బలాలన్నీ ధ్వంసం అయిపోయాయి. అసురులందరూ నశించిపోయారు.

నాశనం అయిన మహానగర శిధిలాల మధ్య ఒకపెద్ద శివలింగం ఒకటే నిలిచి వుంది. శివుడు ఈ లింగాన్ని ముక్కలుచేసి ఎగరగొట్టాడు. ఒక్కో ముక్కా వెళ్ళి దూర దూరంగా పడ్డాయి.

ఒక ముక్కని ధరణికోటలో (అమరావతి) ఇంద్రుడు అమరేశ్వర లింగం పేరుతో ప్రతిష్టించాడు. అది అమరారామం అయ్యింది. గోదావరి ఒడ్డున గునుపూడి దగ్గర

సోముడు (చంద్రుడు) సోమేశ్వర లింగం పేరుతో ఇంకొక ముక్కని ప్రతిష్టించాడు. తూర్పుగోదావరి జిల్లా పాలకోటలో రాముడు ఒక ముక్కని రామలింగేశ్వరుడి పేరుతో ప్రతిష్టించాడు. అది క్షీరారామంగా ప్రసిద్ధిపొందింది. కుమారస్వామి తూర్పుగోదావరి జిల్లా భీమవరంలో కుమార భీమలింగాన్ని ప్రతిష్టించాడు. ఈ భీమవరం తూర్పు చాళుక్యులకు రాజధాని నగరంగా వుండేది. (పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం కాదు) చివరి ఐదో ముక్క ద్రాక్షారామంగా అక్కడే మిగిలిపోయిందనేది శ్రీనాథుడు వ్రాసిన భీమేశ్వరాలయ స్థలపురాణంలోని కథ.

శ్రీనాథుడు ఈ స్థలపురాణం రాసింది రాజమండ్రి నేలిన రెడ్డిరాజుల ఆస్థానంలో వున్నకాలంలోనే అంటారు. ఆయనకు దక్షారామంతో బాగానే పరిచయం వుంది.

5. తొలి నాటి చాళుక్యుల పాలనా కాలంలో ఆంధ్రదేశంలో "కాలా ముఖ శైవం" బాగా వ్యాప్తిలో ఉండేది. ఒక విధమైన తీవ్రవాద ధోరణిలాంటిదే ఈకాలంలోని శైవం! వీరి సింహపరిషత్‌లు (జనరల్ బాడీ సభలు) బెజవాడలోనూ, అమరావతి లోనూ ఇంకా చాలాచోట్లు జరిగాయి. ఈ కాలాముఖ శైవులకు, బౌద్ధులకు మధ్య అనేక సంఘర్షణలు జరిగినట్లు బి.యస్.యన్.యల్. హనుమంతరావుగారు రాశారు.

పంచారామాల కథని బౌద్ధులకు, శైవులకూ మధ్య జరిగిన మతపరమైన ఘర్షణలు గానే ఇంకా చాలామంది పండితులు భావించారు. ఈ ఘర్షణలు మూడవ శతాబ్ది తర్వాత నాటివే అయివుండొచ్చు. కాబట్టి, ఋగ్వేద కాలంలోని అసుర శబ్దానికీ, బౌద్ధ కాలచక్ర తంత్రంలోని అసుర, అసురనాగ శబ్దాలకూ, శివపురాణం లోని అసురశబ్దానికీ చాలా తేడా వుండి వుండాలి. భాషాపరంగా వాటి లోతుల్లోకి వెళ్ళడం ప్రస్తుతం సాధ్యంకాదు. కాని, శైవులు బౌద్ధుల్ని అసుర శబ్దంతో వ్యవహరించి వుండ వచ్చునేదే బౌద్ధారామాల్ని శైవాలయాలుగా మార్చారని వాదించే వారు చెప్పే విషయం.

ఇక్కడ పరిశీలనాంశం ఏమంటే, శివుడు తన భక్తుల్నే అంతం చేసుకున్నాడు. దక్షుడి కథలో అవిధేయుణ్ణి అంతంచేశాడు. త్రిపురాసురుని కథలో తన మహాభక్తుల్ని పూర్తిగా నిర్మూలించాడు.

అది అసుర శైవులకు, వైదిక శైవులకు మధ్య జరిగిన సంఘర్షణగానే కన్పిస్తుంది. ఇందులోకి బౌద్ధుల్ని లాగడం పూర్తిగా అన్యాయమేమోననిపిస్తుంది. స్థల పురాణాలలో వున్నంత మాత్రాన అవన్నీ స్థలచరిత్రలు కావాలనిలేదు. కాబట్టి బౌద్ధారామాల్ని శైవులు, శైవారామాలుగా మార్చారనే వాదనని నమ్మశక్యం కానిదిగానే మనం భావించాలి.

6. బౌద్ధ క్షేత్రాలు ప్రసిద్ధమైనవి వున్నచోట్ల శైవ క్షేత్రాలు కూడా ప్రసిద్ధమైనవి ఎన్నో మనకి కనిపిస్తాయి. కాశీ దగ్గర సారనాథ్ స్థూపం ఇందుకు ఒక ఉదాహరణ.

ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రం వున్నచోట్ల ప్రసిద్ధ జైన క్షేత్రం ఏర్పడడంలోకూడా ఆశ్చర్యంలేదు. బెజవాడలోనూ, అమరావతి దగ్గర వడ్డమానులోనూ ఎన్నో జైన అవశేషాలు దొరికాయి. బౌద్ధ క్షేత్రం ముందా, శైవ క్షేత్రం ముందా, జైన క్షేత్రం ముందా..... అనే మీమాంస ఎప్పుడూ వుంటుంది. వాటిని తేల్చడం కష్టం.

ఏలూరు దగ్గర పెదవేగి గ్రామం ఒకప్పుడు తెలుగువారి రాజధాని నగరంగా వెయ్యేళ్ళపాటు వర్థిల్లిన వేంగి నగరమే! ఇప్పుడది ఒక కుగ్రామం. అక్కడ బౌద్ధ స్తూపం శిధిలాలు కన్పిస్తాయి. ఈ స్తూపానికి ఒక కిలోమీటర్ దూరంలో పెదవేగి గ్రామంలో శాలంకాయనుల నాటి శివాలయం కన్పిస్తుంది. భూమిలోపల పాత శివాలయం వుందనీ, దానిమీద కొత్త శివాలయం నిర్మించారని స్థానికులు చెప్తారు.

అమరావతిలో బౌద్ధ చైత్య స్తూపం, అమరేశ్వరాలయం రెండూ ప్రసిద్ధమైనవే!

అమరావతిలో శాతవాహనుల కాలంనాటి శిల్ప కళతో చతుర్ముఖ లింగం అనే చిన్న లింగం ఆకుపచ్చరాయితో చేసింది ఒకటి దొరికిందిట! ఇది అరచేతిలో పట్టేటంత చిన్న శివలింగం. అయితేనేం..... శాతవాహనుల కాలం నాటికే ఇక్కడ అమరేశ్వరాలయం వుందనడానికి తగిన ఆధారం ఇచ్చింది. శాతవాహనుల కాలంనాటి "నంది" విగ్రహం పెద్దది కూడా దొరికింది.

7. ఈ కోణంలోంచి చూసినప్పుడు బౌద్ధ ధర్మాలు వ్యాపిస్తున్న కాలంలో శైవధర్మాలు కూడా సమానంగా వ్యాపించాయనీ, మహాసదాశివ తత్త్వం ఉత్తర భారతదేశంలో కన్నా తెలుగు ప్రాంతాల్లో చాలా ఎక్కువగా ప్రబలిందనీ, బౌద్ధులకూ శైవులకూ పరస్పర విరోధాలు సహజమే అయినా, ఒకరి ప్రభావం మరొకరిపైన తప్పకుండా వుండివుంటుందనీ వూహించడానికి అవకాశం వుంది.

## చాళుక్య భీముడి అమరేశ్వరాలయం డిజైన్

అమరావతి దేవాలయం రెండంతస్థుల్లో వుంటుంది. ఈ దేవాలయం దగ్గర చాలా బౌద్ధ విగ్రహాలు, ఫలకాలు దొరకడం కారణంగా ఈ దేవాలయం బౌద్ధారామమే ననే అభిప్రాయానికి తావిచ్చింది.

బౌద్ధ స్తూపం కుప్పకూలిపోయి, దానిమీద మట్టి కప్పుకొని, పెద్ద మట్టిగుట్టలా అయిపోయినప్పుడు, అక్కడ వానకో వరదకో అప్పుడప్పుడూ బైటపడిన అనేక బౌద్ధ ఫలకాలు, విగ్రహాలు ప్రజల కారణంగా అమరేశ్వరాలయంలోకి చేరడంలో వింతలేదు. అంత మాత్రాన అది బౌద్ధారామమే కానవసరంలేదు.

విచ్చుకున్న గొడుగు - దాని గొడుగు కర్ర - ఈ దేవాలయం అనీ, గొడుగు కర్రే శివలింగం అనీ చాలామంది పండితులు రాశారు. బుద్ధుడి పెద్ద విగ్రహాన్ని కూలగొట్టి గొడుగు కర్రని మాత్రం వుంచారనడం ఇందులో సారాంశం.

కానీ, ఇది అసలైన శివాలయమేనని, ధరణికోట పరిసరాలలో బౌద్ధమూ, శైవమూ, అలాగే, వాటి సమీపంలోని వడ్డమానులో జైనం బాగా ప్రబలంగా ఒకే కాలంలో వున్నాయని భావించుకున్నందువలన ఆయా మతాలకు వచ్చిన చిన్నచూపేమీ లేదు.

క్రీ.శ. 892 - 922 నాటి చాళుక్య భీముడు ఈ దేవాలయాన్ని పునర్నిర్మించడం గాని జీర్ణోద్ధరణగాని చేశాడు. 1129 నాటి ఒక శాసనంలో "అమరేశ్వర మహాదేవర" గా ఇక్కడ శివుణ్ణి వ్యవహరించడం కన్పిస్తుంది. 1164 నాటికి బుద్ధదేవర, అమరేశ్వర మహాదేవర లిద్దరికి సమానంగానే ఈ ఊళ్ళో అర్చనలు సాగాయి. ఇందులోనే మొదటి సారిగా పంచారామాల ప్రస్తావన వుంది. అంటే, వీరశైవం తర్వాతే పంచారామాలు ఏర్పడ్డాయని, వీరశైవుల రచనల్లో పంచారామాల ప్రస్తావన కన్పించదనీ పండితులంటారు.

ఈ నిరూపణలు ఇక్కడి శివాలయం ప్రాచీనతనే చెప్తాయి. బుద్ధదేవరకు, అమరేశ్వరాలయానికి ఏ సంబంధమూ వుండి వుండదనే మనం విశ్వసించవచ్చు. ఎవరి గుడి వాళ్ళదే! కోట కేతరాజు 1182లో అమరేశ్వరాలయాన్ని మరింత అభివృద్ధి పరిచాడు. 1344లో ధర్మవర్తి అనే సింహళదేశపు వాణిజ్యవేత్త బౌద్ధ స్తూపానికి కూడా మరమ్మత్తులు చేయించి ఆ స్తూపాన్ని వినియోగంలోకి తెచ్చాడు. అంటే, కొనవూపిరితో నైనా కొంతమంది బౌద్ధులు ఇంకా అక్కడ చైత్యారాధన కొనసాగిస్తున్నారని 14వ శతాబ్దపు ఈ ఆధారం పేర్కొంటోంది.

నది ఒడ్డున వున్నది కాబట్టి, వరదలు ముంచెత్తగా శివార్చనకు లోటురాకుండా వుండేందుకు, అత్యంత పొడవైన లింగాన్ని ఏర్పరచి, పైన ఎత్తుగా మరో అంతస్తును నిర్మించారు. క్రింది అంతస్తు మునిగినా పై అంతస్తులో శివుడి అర్చన కొనసాగేది.

చాళుక్య భీముడే మొదటగా అమరావతిలో ఈ విధమైన శివాలయానికి రూపకల్పన చేశాడని, ఆ తర్వాత ఇదే డిజైన్‌లో తన పేరుతో మరికొన్ని భీమేశ్వరాలయాలు నిర్మించాడనీ, శ్రీ పి.ఆర్.కె. ప్రసాద్ ధాన్యకటకంలో శైవం మీద రాసిన ఒక వ్యాసంలో పేర్కొన్నారు. ఇది కూడా పరిశీలకులు పరిగణలోకి తీసుకోవాల్సిన విషయమే! పునర్నిర్మించిన అమరేశ్వరుని పేరుని భీమేశ్వరంగా ఈయన మార్పుచెయ్యలేదు. బహుశా ఈ చాళుక్య భీముడు పునర్నిర్మించిన ఈ ఐదు శివాలయాలే పంచారామాలుగా వ్యవహరించబడివుండే అవకాశం కూడా లేకపోలేదు. చరిత్రని ఊహాగానాల మీద రాయకూడదు. ఇంతకన్నా సాక్ష్యాలు దొరికేంత వరకూ "కావచ్చు" అని అనుకోవడం తప్ప మరో మార్గంలేదు.

ఈనాటి పొడవైన అమరేశ్వర లింగం అడుగున చాళుక్య భీముడికి పూర్వంనాటి మొదటి అమరేశ్వర లింగం వుందని, దానిమీద ఈ పొడవైన లింగాన్ని నిర్మించారని కొందరంటారు. ఇటీవల దొరికిన మరికొన్ని ఆధారాల్ని బట్టి, ఇక్కడ "స్కంధ - కుమారాలయం' ' కూడా ఒకటి వున్నట్లు తెలుస్తోంది. దీనికై క్రీస్తుపూర్వం 2-1 శతాబ్దాలనాటి ఆలయానికి సంబంధించిన వివరాల్ని పరిశీలిస్తున్నారు.

## ! అమరవటేశ్వరం అంటే ఏది ? !



వటవృక్షం శైవులకు బౌద్ధులకు కూడా ప్రముఖమైందే. బుద్ధుడు జ్ఞానోదయం పొందింది ఈ చెట్టు క్రిందనే! బుద్ధత్వాన్ని పొందడానికి తోడ్పడి ఈ వృక్షం బోధివృక్షం అయ్యింది.

చెట్లు మతచిహ్నాలుగా ఉపయోగపడడం ఆదిమ సంస్కృతే! "Totemy" అంటారు. అలాంటి మత చిహ్నాల్ని బిల్వ, కదంబ, జంబూ, వట, ఆమ్ర..... ఇవన్నీ శైవులకు పవిత్ర వృక్షాలు. ఈ చెట్లు పేరున బిల్వేశ్వరుడు, కాదంబేశ్వరుడు, జంబుకేశ్వరుడు, వటేశ్వరుడు, ఏకామ్రేశ్వరుడు..... ఇలా చాలా శివాలయాలేర్పడ్డాయి.

అమరావతి బౌద్ధ క్షేత్రం కూడా కాబట్టి, వటవృక్షానికి ఇక్కడ సహజ ప్రాధాన్యత ఏర్పడింది. ఈ ప్రాంతం "అమరవటి"గా కూడా చాలా కాలం పిలువబడింది.

రెండవ అమ్మరాజు శాసనం (క్రీ.శ. 945-970)లో కాలాముఖ శైవుల సింహ పరిషత్తు గురించి, అమరవటేశ్వరుని గురించి కొన్ని వివరాలు తెలుస్తాయి. "అమర వటేశ్వర్యాద్యనేక పురాణ దేవాయతన నివాసినాం కాలాముఖానాం....." అంటూ, ఈ శాసనంలో అమరవటేశ్వరుడి దేవాలయం లాంటి అనేక ప్రాచీన దేవాలయాలలో నివసించే కాలాముఖులని ప్రస్తావించాడు. తొలి రోజుల్లో ఒక వటవృక్షం క్రింద అమరేశ్వర లింగం వుండేదని, "అమర వట ఆయతనం" అంటే, ఆలయం ఆ తర్వాత నిర్మితమై వుంటుందనీ దీన్నిబట్టి వూహించ వచ్చు. బుద్ధుడి మాదిరే అమరవటేశ్వరుడు బోధి వృక్షం నీడనే వుండే వాడన్నమాట!

ఇవన్నీ బౌద్ధాన్ని శైవం ఆశ్రయించిందనడానికి సాక్ష్యాలుగా చూపించే విషయాలు కావు. శైవానికి, బౌద్ధానికి సమానంగా కారణమైన సామాజిక విషయాలు.

## తొలినాటి శివలింగాలకు పానవట్టం లేదు

అశోకుడి కాలానికే కృష్ణానదికి ఆవలి తీరంలోనూ ఈవలి తీరంలో కూడా శైవమత వ్యాప్తి చాలా ఎక్కువగా వుంది. పల్లవ బొగ్గాన్ని ఏలుతూ వున్న పల్లవ రాజులు శైవులే కావచ్చునీ, లింగార్చన వీరితోనే మొదలయ్యిందనీ ఆంధ్ర శిల్పకళ మీద అద్భుతమైన పుస్తకం రాసిన శ్రీపాద గోపాలకృష్ణమూర్తి అన్నారు. "తొలినాటి శివలింగాలకు పానవట్టం లేదని "గుడిమల్లం" లోని శివలింగం సూచిస్తోంది-" అంటారాయన.

క్రీస్తుపూర్వం చివరి 5 శతాబ్దాల కాలంలో ఆంధ్రదేశంలో ఒక వైపు లింగార్చన, ఇంకొక వైపు బౌద్ధ ధర్మాలు మొగ్గతొడిగి వికసించి పరిమళించాయి. కృష్ణా గోదావరీ పరీవాహక ప్రాంతం ఇందుకు ప్రధాన కేంద్రం అయ్యింది.

శివలింగాన్ని అర్చించే విధానాన్ని తెలుగువారే ప్రారంభించారు. బౌద్ధ చైత్యాన్ని అర్చించే విధానాన్ని కూడా తెలుగువారే మొదలుపెట్టారు. శివలింగార్చనకు మోక్షం లక్ష్యం. శివసాయుజ్యం పొందడం పరమార్థం. బౌద్ధ చైత్య ఆరాధనకు ధర్మం మాత్రమే పరమార్థం అయ్యింది. ఈ కారణంగా తొలిరోజుల్లో జనసామాన్యాన్ని శైవం, మేథావి వర్గాన్ని బౌద్ధం ఆకర్షించాయి. వర్తక వాణిజ్యవేత్తలు, ధనికులు, విద్యావంతులు, బౌద్ధులయ్యారు. మామూలు జనం శైవులయ్యారు.

## వైదిక దేవాలయాలుగా మారిన బౌద్ధాలయాలు

బౌద్ధం పతనావస్థలో వున్న కాలంలో చాలా బౌద్ధారామాలు వైదిక దేవాలయాలుగా మారిపోయాయనడానికి తగిన ఆధారాలుకూడా వున్నాయి. కె.ఎ.యస్. శాస్త్రి, ఎం.కె. శర్మ, కె.ఆర్. శ్రీనివాసన్ వంటి ప్రముఖులు చేజెర్ల, అయిహోలు, ఉండవల్లి, బెజవాడ, తిరుపతి ..... ఈ ప్రాంతాల్లోని దేవాలయాలు బౌద్ధాలయాలు కావచ్చునంటూ అనేక నిరూపణలిచ్చారు. చేజెర్ల కపోతేశ్వరాలయం, అయిహోలు దుర్గగుడి బౌద్ధారామాలేనని, శిల్ప కళారీతులబట్టి, ఆలయ నిర్మాణశైలిని బట్టి నిర్ధారిస్తున్నట్లు కె.ఎ.ఎన్. శాస్త్రి రాశారు.

కె.ఆర్. శ్రీనివాసన్ "ఉండవల్లి" అనంతశయన పద్మనాభస్వామి గుడిమీద పరిశోధన చేశారు. కృష్ణానదికి దక్షిణం ఒడ్డున, బెజవాడ ప్రకాశం బ్యారేజికి అవతలివైపున ఉండవల్లి గుహలున్నాయి. ఈ బౌద్ధ గుహలకు ఇంకా ఇవతలగా అనంతశయన పద్మనాభుని గుడి వుంది. బుద్ధుడు శయనించిన విగ్రహాన్ని విష్ణుకుండినుల కాలంలో చెక్కి వుంటారు. ఇది మూడు అంతస్తుల హర్మ్యం. ఎల్లోరా బౌద్ధ గుహల్ని పోలి వుంటుంది. విష్ణువు అనంతశయన రూపంగా ఇది తర్వాతి కాలంలో మారివుంటుందంటారు.

ఆహారాన్ని ఉండలుగా చేసి బలులు సమర్పించే తాంత్రిక బౌద్ధుల ఆచారం ఇక్కడ వుండి వుంటుందని, ఉండ బలులిచ్చే గుడి కాబట్టి, "ఉండ బలి" - ఉండవల్లిగా మారివుంటుందనే ఐతిహ్యం కూడా వుంది.

మహానగపర్వతం తిరుపతి దగ్గర గుంటుపల్లి గ్రామంలో వుంది. 11వ శతాబ్ది వరకూ ఇది వివిధ బౌద్ధ ధర్మాలు వ్యాప్తిలోవున్న బౌద్ధ క్షేత్రంగా వుండేది. ఇక్కడి వృత్తాకార చైత్యాన్ని ధర్మలింగేశ్వరాలయంగా మార్చి, నందిని ప్రతిష్టించి వుంటారని కార్తికేయ శర్మ పేర్కొన్నారు. తిరుపతి అశోకుడి పాలనలో వున్న ప్రాంతమే! తొండమండలం మొత్తం మౌర్య సామ్రాజ్యంలో వుంది. ఇవి అశోకుడి కాలంనాటి బౌద్ధ ఆరామాలు కావచ్చని అంటారు.

## బౌద్ధం ప్రజల మతం

భారత ఉపఖండంలో అనేక దేశాలలో బౌద్ధం విస్తరించింది. అయితే, భారత దేశంతో సహా ఏ దేశంలోనూ పూర్తిగా ప్రజలంతా బౌద్ధులుగానే వున్న దాఖలాలు లేవు. అలాగని, అధిక ప్రజల మతం అని కూడా అనుకోలేము. ముఖ్యంగా భారతదేశంలోను ఇది చాలాచోట్ల రాజమతంగా కూడా లేదు. మౌర్యులు, శాతవాహనులు, గుప్తులు బౌద్ధాన్ని ఆదరించారు. పోషించారు. కానీ, ఆ కాలంలో ప్రజలంతా బౌద్ధులే అనడానికి వీల్లేదు. అప్పటి నుండి ఇప్పటిక్కూడా, వైదిక ధర్మాలే మెజారిటీ ప్రజల్ని అంటి పెట్టుకొని వున్నాయి.

క్రీ.శ. 7వ శతాబ్దిలో హ్యూన్‌త్సాంగ్ ఇక్కడ పర్యటించి, భారతదేశంలోంచి బౌద్ధం పట్టు కోల్పోయి కనుమరుగైపోబోతోందని ఊహించాడు. అంతేగానీ, వైదికులు, బౌద్ధులు విరోధాలతో కొట్టుకొని హింసించుకొన్నట్లు రాయలేదు. బౌద్ధానికి స్వర్ణయుగం అనదగిన కాలంలో కూడా వైదిక ధర్మాలు అమితంగా అభివృద్ధి పొందాయి. కాబట్టి, రాజులతో నిమిత్తం లేకుండా ప్రజలపై పట్టు సాధించిన యోగులు, ఋషులు, సాధకులు తమ తమ ధర్మాల్ని వ్యాప్తి చేసుకొంటూ వచ్చారు. ఎవరి ప్రచారం వారు చేసుకున్నారు. ఇవన్నీ మతాలు కావు - అభిప్రాయాలు మాత్రమే! భారతదేశంలో ఫలానా మతం ఉన్నదనడం సరికాదు.



అయితే, బౌద్ధ ధర్మాలు ఏ దళిత వర్గాల్ని తక్కిన సామాజిక వర్గాలతో సమానం చెయ్యాలని భావించాయో ఆ దళితుల్లోకి బౌద్ధం ఎక్కువగా విస్తరించినట్లు కూడా కన్పించదు. అంతో ఇంతో "శైవం" ఈ విషయంలో ముందంజలో వుండేదని చెప్పవచ్చు.

హ్యూన్‌త్సాంగ్ రికార్డులను బట్టి క్రీస్తుశకం 7వ శతాబ్ది నాటి సామాజిక వర్గాలలో అస్పృశ్యులూ, చండాలురూ వర్ణవ్యవస్థలో "బాహ్యులు"గానే వున్నారు.

మొదట శైవం, తర్వాత జైనం, ఆ తర్వాత బౌద్ధం, ఆ తర్వాత వైష్ణవం కుల మతాలు లేని వ్యవస్థనే ప్రబోధించాయి. అంటే, అట్టడుగు వర్గాల మీద సానుభూతిని మాత్రమే ప్రదర్శించాయి. కానీ, ఆ ఇనుపసంకెళ్ళని ఖండించే ప్రయత్నాలు గట్టిగా చెయ్యలేదు.

20వ శతాబ్దపు సామాజిక రుగ్మతలో "దళిత సానుభూతి" కూడా ఒకటి. ఈ సానుభూతి పరులు ఎవ్వరూ దళితులకు" సోషల్ స్టేటస్‌ని సమానంగా కల్పించడానికి తగిన ఉద్యమాల్ని ప్రతిపాదించలేక పోయారు. దళితులు కూడా స్వయం శక్తితో సోషల్ స్టేటస్‌ని పొందేందుకు తగిన ఉద్యమ స్ఫూర్తిని తీవ్రంగా ప్రదర్శించినట్లు కన్పించదు. సామాజిక సమానత్వం ఒకరు దయతో ఇప్పించేది కాదు కదా!!

## అస్పృశ్యులుగా మిగిలిన బౌద్ధులు

పండితారాధ్య చరిత్రలో వాద ప్రకరణం విష్ణువు బుద్ధుడి అవతారం ఎత్తడాన్ని ఆక్షేపించింది.

అనిత్యుడైన హరిని భజించినందువలన చిరతరమైన ముక్తి ఎలా వస్తుంది? వికృత భాగవతాలు "ఆది" కావుగదా! విముక్తి మార్గాలు కావుగదా! "నీవు కేవల విష్ణు నిజ సమయుడవు గావు - బౌద్ధుడవు...." అని ఆక్షేపణ !

శివుడు త్రిపురాల్ని ధ్వంసం చేసే రోజుల్లో 'హరి' సాక్షాత్తూ బుద్ధుడై ఉన్నాడు కాబట్టి, విష్ణువు పది అవతారాల్లోనూ బుద్ధజన్మం కూడా కలదు కాబట్టి, జైన బౌద్ధాల మధ్య కించిత్తయినా తేడా లేదు కాబట్టి, బుద్ధుడే విష్ణువు, విష్ణువే బుద్ధుడు కాబట్టి ....

వెయ్యి మాటలు దేనికి -
బౌద్ధుడా..! విను ...
నీ బౌద్ధం శ్రుతి విరుద్ధం -
భవపాశాబద్ధం -
ఈ భూమిమీద నిషిద్ధం -
అది దుఃఖ సమృద్ధం -
పాపాబద్ధం -
అంతా అబద్ధం - " ఇలా సాగుతుంది బుద్ధ నింద!

జైనుల్ని కూడా 'మాయాదులని" పండితారాధ్య చరిత్ర తూలనాడుతోంది.

ఇదే గ్రంథంలో వెలనాటి చోళ వంశక్షయం కథలో కూడా " బౌద్ధుని ఇతరులతో సమానంగా చూసిన తప్పు, బుద్ధుని అంటుకున్న తప్పు, బౌద్ధుడు శివనింద చేస్తుండగా

విన్న తప్పు, చంపవలసిన బౌద్ధుని చంపవలసిన సమయంలో చంపక పోయిన తప్పు..." ఇలా చోళరాజు చేసిన తప్పుల గురించి కన్పిస్తుంది.

బౌద్ధుల్ని అంటుకోవడం కూడా తప్పు అనడం ఈ కథలో ముఖ్య విషయం. అంటరాని వారుగా ఈనాటికీ సమాజంలో మిగిలిపోయిన వారిలో అలనాటి బౌద్ధులు వున్నారనేది మరో ముఖ్య విషయం.

ఒకప్పుడు "దేశం అంతా బౌద్ధమే" అన్నంతగా బౌద్ధ ధర్మాలు ప్రజాదరణ పొందాయి. కారణాలనేకం మనం విశ్లేషించాం..... అంతటి బౌద్ధం నామమాత్రం అయిపోవడానికి బౌద్ధం తర్వాత బౌద్ధులేమయ్యారు.....?

కొందరు పండితులైన బౌద్ధులు బ్రాహ్మణ కులంలోనూ, వ్యాపార దక్షతలున్నవారు వైశ్య కులంలోనూ చేరిపోయి వుంటారు. మిగిలినవారి పరిస్థితి దయనీయమే! చాతుర్వర్ణ వ్యవస్థలో కొందరు శూద్రులుగా మారి వుంటారు. మిగిలినవారు అస్పృశ్యులనిపించుకుని వుంటారని ఎస్.బి. దాస్‌గుప్తా తదితర చరిత్రకారుల అభిప్రాయం. బ్రాహ్మణ, వైశ్య కులాలలో స్థానాలు కల్పించిన బౌద్ధులైన బ్రాహ్మణులకు, బౌద్ధులైన వైశ్యులకు ఆయా కులాలలో తక్కువ స్థానమే వుండేదని అంటారు.

ఉత్తర భారతదేశంలో దోయాలు, హాదీలు, కొందరు జాలరులు, వడ్రంగులలో- చివరి కాలంనాటి బౌద్ధాచారాలు, వైదిక ఆచారాలు సమ్మిళితంగా కన్పిస్తాయి.

తాయెత్తులు కట్టడం, ధూపం వేయడం వంటివి మహమ్మదీయుల్లో కొందరు ఇప్పటకీ పాటిస్తుండడం మనం చూస్తుంటాం. దాస్ గుప్తా గారి ప్రకారం బెంగాల్‌లోని ముస్లింల మీద తాంత్రిక బౌద్ధం ప్రభావం ఇది !

మయూర్ భంజ్ ప్రాంతంలోని ఆటవిక జాతుల్లో ఈనాటికీ బౌద్ధాన్ని పాటించే హిందువులున్నారని కనుగొన్నారు. నాగరకుల్లో కూడా కాయస్థులు, సోనాల్ బనియాలు, వైష్ణవ సహాజియాలలో బౌద్ధ ధర్మాలు కన్పిస్తాయంటారు.

ఏదోకవిధంగా ప్రతిభావ్యుత్పత్తులతో ఎంతో కొంత సామాజిక హోదాని పొందలేక పోయిన బౌద్ధులు చరిత్రలో అస్పృశ్యులుగా - అంటరాని వారిగా - అట్టడుగు వారిగా మిగిలిపోయారు. బుద్ధదేవుని బోధనలతో వ్యక్తి పరివర్తనని ఆశించి అంబేద్కర్ ఆ రోజున పది మిలియన్ల మంది అనుచరులతో బౌద్ధాన్ని స్వీకరించారు. నాగులు బుద్ధుని సమాదరించిన తొలి జాతీయులని నాగుల కేంద్రమైన నాగపూర్ ఇందుకు అనువైన స్థలంగా ఎంచుకున్నారు. పరివర్తన దిశగా వ్యక్తి తనను తాను సంస్కరించుకోవాలి. అందుకు కావలసిన ప్రేరణని బౌద్ధం కలిగించగలదని ఆశ !

# ఉపకరించిన గ్రంథాలు


- **The A to Z of Buddhism**
  *– Charles S. Prebish.*
- **ITIHAS Journals of the Andhra Pradesh Archives Volumes**
- **Archaeology of Andhra Pradesh Centenary 1887-1987 Volume.**
- **A study of the Salankayana Geneology & Chronology**
  *– Sri V. Sundara Rama Sastry.*
- **Protohistoric India**
  *– I.K. Sarma.*
- **New Satavahana Sculptures from Andhra Amaravathi**
  *– P. Sitapati & V.V.Krishna Sastry*
- **Journal of Telugu Studies**
  *– Telugu University.*
- **Some Outstanding Historical Monuments in Andhra Pradesh**
  *– I. Karthikeya Sarma.*
- **Tantric Sculptures in Amaravathi**
  *– Dr. K. Krishna Murthy.*
- **India in Cylonese History & Culture**
  *– M.D. Raghavan*
- **Tirupati Balaji was a Budhist Shrine**
  *– Dr. K. Jamanadas.*
- **Hindu Polity**
  *– Jayaswal.*
- **An Early History of Vaishali**
  *– Y. Mishra*
- **History of Indian Philosophy**
  *– Das Gupta.*
- **Lokayatha**
  *– Devi Prasad Chattopadhyaya.*
- **The Ajivikas**
  *– Prof. Basham.*
- **The Role of Traders and Guild in Indian Society**
  *– Article by O.P. Verma.*

- **Fresh Light on the History of Satavahanas**
  *– Sri I. Kartikeya Sarma.*
- **Hinduism a religion to live by**
  *– Nirad C. Chaudhuri.*
- **History of Religion**
  *– Sergei Tokarev.*
- ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం :
  – శ్రీ కుందూరి ఈశ్వరదత్తు.
- **Secret Doctrine**
  *– H.P. Blavetsky.*
- **Sri Salankayanas of Andhra country**
  *– Sri V.S.N. Sastry.*
- **Itihas**
  *– Journal of the Andhra Padesh State Archives.*
- శ్రీ విష్ణు సహస్రనామము
  – శ్రీ పరాశర భట్టరుల భాష్యము.
- ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర : ప్రథమ సంపుటము – ప్రాగ్విభాగము.
  – అను : సరిపెల్ల విశ్వనాథ శాస్త్రి.
- శివరహస్య ఖండము
  – శ్రీ వాడ్రేవు శేషగిరిరావు.
- **The Hindu Civilization**
  *– Radha Kumud Mukherji.*
- ఆంధ్రుల సాంఘిక చరిత్ర
  – సురవరం ప్రతాపరెడ్డి.
- **Philosophy of Life & Death**
  *– M.V. Kamath.*
- **Journals of Historical Society**
- ఆంధ్రశిల్పము
  – డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి.
- చారిత్రక వ్యాసములు
  – మల్లంపల్లి సోమశేఖర శర్మ.
- **A Comprehensive History of India - II**
  *– Orient Logmans, London 1957.*
- **Early History of Deccan**
  *– G. Yazdani (Oxford 1960)*

- **Buddhist Monuments**
  *– Debala Mitra (Calcutta 1971)*
- **Salihundam : A Buddhist site in Andhra Pradesh**
  *– Dr. R. Subrahmanyam.*
- **Nagarjuna Konda - Memoirs of the Archaeological Survey of India**
  *– Dr. R. Subramanyam.*
- **Ancient India**
  – H. Sarkar.
- **Amaravathi**
  *– H. Sarkar & S.P. Nainar.*
- **Journal of the Epigraphical Society of India - IV.**
- **Everyday life in Ancient India**
  *– Padmini Sen Gupta.*
- శ్రీ పండితారాధ్య చరిత్ర : పాల్కురికి సోమనాథ కవి ప్రణీతము
  – కీ.శే. డా. చిలుకూరు నారాయణరావు పరిష్కరించినది.
- **Coins of Ancient India**
  *– A. Cunningham.s*




అమూల్యమైన సమాచారాన్ని నిక్షిప్తం చేసిన
ఆయా గ్రంథ రచయితలకు
ప్రాతః స్మరణీయంగా నమస్కృతులు

| Check List | | | |
|---|---|---|---|
| **Book Number** | Gn.v.PO1 k 171 | **Date** | 30/01/2021 |
| **Front Cover** | Yes | **Back Cover** | Yes |
| **Blank Pages** | CI, 131 | | |
| **Missing Pages** | NO | | |
| **Prepared** | Ramya | **Scanned** | Swathi |
| **BOOK SIZE** | H 8.5 W 5.3 | **Pages** | 135 |